Exclusive Open AIR BAR
& Restaurant in Vijayawada

Relax in SUMMER!
step in
and ENJOY!



BHAVANI PUBS.

Family Section



ANAND

BAR Section

**open house**

*BAR & RESTAURANT*

Gopalareddy Road, near Civil Courts.
VIJAYAWADA.2 call.62586





Coffee House: Timings: 6 to 11 am. 3 to 8 pm.



ఉషాకిరణ్ మూవీస్

# మౌనపోరాటం

రామోజీరావు మోహనగాంధి

# ఓ అడవిమల్లె జరిపిన అపూర్వపోరాటం

# 'మౌనపోరాటం'

అడవి మల్లెకు అమాయకంగా నవ్వటంతప్ప మరొకటి తెలీదు. అందమైన ప్రకృతిలో సిరివెన్నెల ఆరబోసినట్లు నవ్వుకొంటున్న మల్లె జీవితంలోకి చల్లగావచ్చి అందాలు ఆఘ్రాణించి ఏమీ ఎరగనట్లు వెళ్ళిపోతుంది ఓ గండు తుమ్మెద. తనకు జరిగిన అన్యాయాన్ని అడవిమల్లె గనుక ప్రతిఘటిస్తే అప్పుడది దుర్గ కథ వుతుంది! అది చలనచిత్ర రూపం ధరించి 'మౌనపోరాటం' అవుతుంది.

కొందరి జీవితాలు కథలకన్నా కల్పనల





న్నా ఆదర్శవంతంగా వుంటాయి. ప్రకృతిలో పరవశించిపోతూ గొంతెత్తి పాడటం, సెలయేటిలా గలగలా పారటమే కొండకోనల్లో పెరిగే గిరిజన యువతి దుర్గకు తెలుసు. అన్న భీముడి అండలో అమాయకంగా నవ్వుకోవటమే తెలుసు. ఆ అడవిలోకి, ఆ సిరిమల్లె జీవితంలోకి నెమ్మదిగా ప్రవేశించాడు రాజశేఖరం. అతని ఒంటికి గాయమైతే ఆమె బాధపడింది. అతని రక్తంతో తన రక్తం కలిస్తే కులాచారం ప్రకారం మనువయినట్లేనని భావించింది. ఆ అమాయకత్వాన్ని రాజశేఖరం జుంటితేనెలా జుర్రుకున్నాడు. అవసరంతీరాక ఆమెను కాలదన్నాడు. చాలామంది మగాళ్ళలాగానే 'నువ్వు కులటవని' నిందించాడు. 'నీ కొడుకు లంజకొడుకు' అన్నాడు. దుర్గ నివ్వెరపోయింది. మనువాడతానన్నవాడు ఇలా మాట్లాడతాడా అని నిస్తేజ అయింది. న్యాయంకావాలని చట్టాన్ని సాయం అడిగితే, డబ్బుకు అమ్ముడుపోయిన చట్టం ఆమెను కష్టాలపాలు చేసింది. కడుపున పెరిగే బిడ్డ కోసం ఆమె పూటకోముద్దతింటూ ధైర్యం నింపుకొంది. పండంటి కొడుకును కన్నాక, తన ఆలోచనలకు కార్యరూపం ఇచ్చింది. ఆమె మౌనపోరాటం అప్పుడారంభమైంది!

నాగరిక జనారణ్యంలో ఎన్నో మేకవన్నెపులులున్నాయి. వాటిలో ఒకదానిపేరు– అక్కయ్య



దొర. గిరిజనులను వంచించి, వారి జవజీవాలను దోచుకోవటం అతని ప్రవృత్తి. గిరిజన యువతుల్ని పెళ్ళాడి, వారిపేర రుణాలు తీసుకుని ఆస్తులు పెంచుకునే పట్నం దొరలలో అతడు అగ్రగణ్యుడు. ఆకలేసిన పశువులకు పచ్చిగడ్డి పెట్టినట్లు అవినీతి అధికారులకు పచ్చనోట్లు పెడతాడు. వాళ్లను బుట్టలో వేస్తాడు. ఫలితం- గిరిజనులమీద జరిగే అక్రమాలు, వారికి కలిగే అన్యాయాలు ఏ ప్రభుత్వం దృష్టికీ రావు. అందుకే - అక్కయ్యదొర తనను పెళ్ళాడినా, తనవారికి జరుగుతున్న అన్యాయాలు కళ్ళారా చూస్తున్నా చుక్కమ్మ మాత్రం జరుగుతున్న నేరాలకు భయంతో నిశ్శబ్దసాక్షి అయింది. భయం మేఘాలవెనుక దాగివుండే ఏ చుక్కమ్మలాటి యువతి అయినా



నరే మబ్బునీడ దాటితే- అక్కయ్యదొరలాటి వారి కథ ఏమవుతుందో వేరే చెప్పటం దేనికి? ఆ గిరిజన గూడెంలో మరో కథ గంగది. తనను మోసం చేసిన దాసుబాబుకోసం చిరకాలం అన్వేషించి, చివరకు అతనికి కనిపించి, అతను కాదంటే ఆ తిరస్కారం భరించలేక ఆత్మాహుతిచేసుకున్న పడతి గంగ.

జరిగిన అన్యాయాల్ని ప్రతిఘటించేవారు కొందరైతే, జరుగుతున్నది అన్యాయమేనని తెలిసినా ఏమీ చెయ్యలేనివాళ్ళు ఎందరో. సీతారామయ్య అలాటివాడే. తెలుగు పాఠాలు చెప్పే సీతారామయ్యకు తన ఇంట్లో అభినవ శాకుంతలం జరుగుతోందని తెలుసు. దుర్గ గెలిచి, తన కొడుకు ఓడిపోవాలని మనసారా ఆశిస్తాడు. ప్రపంచంలో ఎప్పుడూ మంచే గెలవాలని ఎంచే పెద్దమనసు ఆయనది. దుర్గ గిరిజన యువతే అయినా, చదువు సంధ్యలు లేని అమాయకురాలే అయినా తనకు జరుగుతున్న అన్యాయాన్ని ఆమె ప్రతిఘటించినతీరు ఒక్క సీతారామయ్యకే కాదు, ఎవరికైనా అపూర్వమనిపిస్తుంది. సభ్య నాగరిక సమాజంలో తమకు జరిగిన అన్యాయాలకు బలై

తలవంచుకొని జీవితాల్ని వెళ్లబోస్తున్న యువతులెందరో ఉన్నారు. వారే గనుక, దుర్గ ప్రతిఘటననే ఆదర్శంగా తీసుకుంటే ఆ అన్యాయాలు తొలగిపోతాయిగదా !!

పోరాటం అన్నాక విజేతలూ ఉంటారు, పరాజితులూ వుంటారు. నిండుహృదయంతో దుర్గను ప్రేమించి, ఆమెను మనువాడాలని ఆశించి ఓడినవాడు భిక్షు. గిరిజనులకు నిజమైన సేవచేయాలన్న తపనతో వారిలో చైతన్యం తెచ్చి గెలిచినవాడు డాక్టర్; క్షణక్షణం అన్యాయాలను ప్రతిఘటిస్తూ ఆ ప్రయత్నంలో దెబ్బతిన్నవాడు కాంపౌండర్; గిరిజనుల విశ్వాసాల్నే పెట్టుబడిగా పెట్టుకొని తనకు మూలికా వైద్యం, మంత్రతంత్రాలు వచ్చునని చెప్పుకుంటూ కాలంగడిపే గణాచారి; గిరిజనులపై దోపిడీని అరికట్టేందుకు వెళ్ళి వారినే దోచుకుంటూ బతికే పోలీస్ ఇన్‌స్పెక్టర్ దైవాధీనం—

నిజానికి 'మౌనపోరాటం' విభిన్న మనస్తత్వాల మేలు కలయిక! కొండకోనలమధ్య నివసించే గిరిజనుల మంచితనాన్ని, వారి అమాయకత్వాన్ని దోచుకోవాలని జరుగుతున్న ప్రయత్నాలను అద్దంపట్టి చూపే చిత్రం 'మౌనపోరాటం'. అతివ శారీరకంగా అబలే అయినా వజ్ర సంకల్పంతో ఉద్యమిస్తే ఆమె సాధించలేనిది లేదని నిరూపించే చిత్రం 'మౌనపోరాటం'. మహాత్ముడు అహింసతో మన దేశాన్నుంచి పరాయిపాలకుల్ని తరిమేస్తే మౌనంతోనే ఎంతటి అన్యాయాన్ని అయినా ఎదుర్కోవచ్చునని నిరూపించిన ఓ మగువ కథే 'మౌనపోరాటం'.

'మయూరి'లాగానే ఇదీ యదార్థంగా జరిగిన సంఘటనే! తనకు జరిగిన అన్యాయాన్ని మౌనంగా ఎదుర్కొని గెల్చిన 'సబిత' అనే ఒక గిరిజన యువతే 'మౌనపోరాటం'లోని దుర్గ పాత్రకు స్ఫూర్తి.





ఉషాకిరణ్ మూవీస్ నిర్మించిన ఈ చిత్రంలో వినోద్కుమార్, కోట శ్రీనివాసరావు, వేలు, రాళ్లపల్లి, ప్రసాద్‌బాబు, నర్రా, మల్లికార్జునరావు, సంజీవి, రమణారెడ్డి, విద్యాసాగర్, అట్లూరి రామారావు, యమున, ముచ్చెర్ల అరుణ, రాజ్యాలక్ష్మి, కృష్ణవేణి, రాగిణి ప్రభృతులు నటించారు.

'మౌనపోరాటం' చిత్రానికి కథ: ఉషాకిరణ్ యూనిట్; రచన, స్క్రీన్‌ప్లే: పరుచూరి బ్రదర్స్ పాటలు: వేటూరి, జాలాది; సంగీతం: యస్. జానకి; గానం: యస్.పి. బాలసుబ్రహ్మణ్యం, యస్. జానకి కెమేరా: డి. ప్రసాద్‌బాబు; కూర్పు: గౌతంరాజు, కళ: వి. భాస్కరరాజు.

ఎగ్జిక్యూటివ్ నిర్మాత: అట్లూరి రామారావు

నిర్మాత: రామోజీరావు

దర్శకత్వం: ఎ. మోహనగాంధీ

'మయూరి' విడుదల.

ఉషాకిరణ్ మూవీస్

# మౌనపోరాటం

రామోజీరావు　　మోహనగాంధి



నోరూరించే మధురమైన మిఠాయిలు

కోకోనట్ కుకీస్‌ల
విందు బలే పసందు

న్యూట్రిన్
# కుకీస్

పాలు కొబ్బెరల అపురూప
సంగమమం







/cech/NC/8815/Tel




ఏప్రిల్ 'చతుర' లో ప్రచురితమైన ఇంద్రగంటి జానకీబాలగారి నవల 'నిజానికీ అబద్ధానికీ మధ్య' పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.

## శిక్షలేని నేరం

(ప్రథమబహుమతి రు.100/- పొందిన సమీక్ష)

తెల్లవారిలేస్తే పేపర్లో ఎన్నో మానభంగాలు, వాటి తాలూకు ఆత్మహత్యలు, హత్యలు-చదువుతుంటాం, వింటుంటాం. తన ప్రమేయం లేకుండానే, తనేతప్పూ చేయకుండానే ఓ దుర్మార్గుడి అఘాయిత్యానికి బలియైపోయినా జీవితమంతా అగ్నిపరీక్షలకు గురికావలసింది మాత్రం ఆడదే. ఈ ఆరనిచిచ్చును రగిల్చి పచ్చని బ్రతుకుల్ని సంసారాల్ని బూడిదచేసే వాడిని ఎవ్వరూపట్టుకోలేరు,పట్టుకొన్నా శిక్షించలేరు.

అప్పటిదాకా ముక్కు, ముఖం తెలియనివాడు మూడుముళ్ళు వేస్తే, అతనే తన సర్వస్వంగా భావించి, తను కరిగిపోతూ వెలిగునిచ్చే త్యాగమయిని- సానుభూతిగా, సహృదయంతో అర్థంచేసుకొనడానికి ఇచ్చగించక హింసిస్తూ, అభము, శుభము తెలియని పసివానిపై పగ సాధించే మగవాడి దురహంకారానికి, మూర్ఖత్వానికి అద్దంపడుతుంది ఈ నవల. కామేశ్వరి తల్లిని అర్థం చేసుకొని సాటిస్త్రీగా సానుభూతి చూపించలేకపోగా, తల్లి అపుడే చెప్పలేదని, చావలేదని కసిబూనిన దానిలా ప్రవర్తించి, తనకు దెబ్బతగిలితేకాని, ఇతరుల దెబ్బగురించి ఆలోచించలేకపోవటానికి కారణం ఆమె కళ్లకు కమ్మిన అహంకారపు పొరలు, అవగాహనలో ఉన్న లోపమే!

'తల్లికి పిల్లలమీదవున్న ప్రేమ, పిల్లలకు తల్లిమీద ఉండదు' అని పెద్దలంటారు, అంటూనే అందుకు విరుద్ధంగా సుమబాల తనతల్లిలో పరివర్తన తీసుకురావటానికి ఆడిన నాటకం అభినందనీయం. ఆమె సమయస్ఫూర్తి ఈనాటి యువతకు ఎంతో అవసరం. సహనాన్ని,ముఖ్యంగా ఇలాంటి సున్నితమైన విషయాల్లో వుండాల్సిన నేర్పరితనాన్ని చక్కగా చిత్రించారు. అందుకే ఆ రెండుకుటుంబాలు కలవడమేగాక, తనతల్లి ప్రేమను శాశ్వతం చేసుకొంది. ఒక నిజానికి అబద్ధానికి మధ్య జీవితాలు ఎలా పరిణమిస్తాయన్న అంశాన్ని ఇతివృత్తంగా తీసుకుని అతినేర్పుగా అల్లుకొచ్చారు రచయిత్రి.

—బి.విజయరమ
గుంటూరు.

ముఖచిత్రం: పినిశెట్టి

## మధ్యస్తంగా ఉంది

(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)

'నిజానికి అబద్ధానికి మధ్య' నవల చదువుతూంటే 'బాగుంది', 'బాగాలేదు' అన్నపదాలకు మధ్య ఉన్నట్లనిపించింది. నవలలో క్రొత్తదనం లేకపోయినప్పటికీ కాలక్షేపానికి బాగానే ఉంది. నవలలో సుశీల, సత్యవతిల పాత్రలు సజీవంగా ఉండి ఎంతగానో ఆకట్టుకున్నాయి.

అన్యాయానికి బలి అయిన సుశీల, భర్త ద్వారా అనుభవించిన నరకం, తన వల్ల తన బిడ్డలకు ఎటువంటి అపకీర్తి రాకూడదని ఆమె చేసిన ప్రయత్నం, పుట్టిన ఆ బిడ్డను కాపాడుకోవాలనే ఆ మాతృమూర్తి హృదయారాటం- ఇవన్నీ చదువుతూంటే ఆ పాత్రతో ఎక్కడో నిజజీవితంలో చాలా పరిచయము ఉన్నట్లే అనిపించింది. ఇతరత్రా ఏ విషయాలలోనైనా సమాజం మారిందేమోకాని ఇతరులపై నిందలు వేసి, వారిని బాధకు గురిచేసే విషయంలో మాత్రం ఈ సమాజం మారలేదు. ఈ నవల చదివైనా మారగలదని ఆశించాలి.

బాల్యంలోనే వైధవ్యం ప్రాప్తించిన సత్యవతి అన్న వదినెలు ఆమెని కాకుండా ఆమె ఆస్తిని ప్రేమించడం ఎంతో బాధాకరంగా ఉంది. కొందరికి జీవితాల్లో సంభవించే అవమానాలు, నిరాశల కారణంగా ఒకరకమైన మొండితనం వస్తుంది. ఆ కారణంగానే సత్యవతి అందర్నీ ఎదిరించి అయినా సరే ఒక మంచి నిర్ణయానికి రావడం జరిగిందేమో! సత్యవతి తల్లి కాంతమ్మ పాత్ర సహజంగా ఉంది.

స్త్రీ ఎటువంటిదైనా బిడ్డల విషయంలో మాత్రం ఆమె మనసున్న మాతృమూర్తే. అనుకోని అన్యాయానికి తల్లి గురయితే సానుభూతి చూపడంమాని, తల్లి అప్పుడే మరణించవలసిందని అనుకొనే కామేశ్వరిలాంటి కూతుళ్ళు ఉంటారా అనిపించింది.

నిజానికి ఆ బిడ్డ ఎవరో తెలియకపోయినా, కంటికి రెప్పలా కాపాడి ప్రయోజకుడిని చేసిన వదిన విశాలాక్షి పాత్ర ఎంతో బాగుంది. వాసు చిన్నప్పటి జీవితం చదువుతుంటే ఆ [illegible]డు పడ్డ కష్టాలు కంటిముందు నిజంగా జరుగుతున్నట్లే అనిపించింది.

వాసు, సుమల ప్రేమ మామూలుగానే ఉంది. ఎదుటపడిన మూడురోజులకే చూపులు కలుసుకొని ప్రేమలో పడటం సినిమారీతిలో ఉంది.

స్వతహాగా భయస్తురాలైన సుమ తల్లికి బుద్ధిచెప్పడం కోసం అబద్ధం చెప్పడం, నాటకం ఆడటం సహజంగా లేదు. సమాజంలో ఏ స్త్రీ అయినా అటువంటి విషయంలో అబద్ధం చెబుతుందా అని మా సందేహం. ఇప్పటి సమాజంలో స్త్రీ పురుషులు ఇరువురు సమానం కనుక వాసు, సుమలు ధైర్యంగా వివాహం చేసుకొని, తల్లిని వేరొక విధంగా మార్చినట్లయితే బాగుండేది.

—బి. కృష్ణప్రియ
కాకినాడ

## 'స్త్రీ' విభిన్న ప్రకృతులకు అద్దం

(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)

'నిజానికీ అబద్ధానికీ మధ్య' ఒక మధ్యతరగతి కుటుంబీకుల ఫార్ములా నవలే. మూడు రోజుల్లో ప్రేమ, క్లయిమాక్సు, ప్లస్ విలనీ, ప్లస్ సందేహం, ప్లస్ ఫ్లాష్‌బాక్‌లో ఒక నిజం, ప్లస్ కథకు సంబంధించని సైడు పాత్ర, ప్లస్ ఒక ట్రిక్, ప్లస్ సుఖాంతం- బాగుంది.

అవమానంతో నరకం అనుభవిస్తూ జీవించిన సుశీల పాత్ర, అహంకారి కామేశ్వరి పాత్ర, అనురాగమయి విశాలాక్షి పాత్రలు సముచితంగా చిత్రించారు.

'ఒక్కొక్కసారి నాకు అనిపిస్తుంటుంది. ఆ జరిగిందేదో నాకు జరిగినా ఇంత గొడవ ఉండేది కాదేమో' అని అనగలిగేటంత మానవత్వం ఉన్న సత్యవతి పాత్రను మరింత శ్రద్ధతో మలిచి ఉంటే రచనకు పుష్టినిచ్చేది.

'ప్రకృతికి గొప్పా, బీదా, స్త్రీ, పురుష భేదం

లేదు. దాని క్రమాన్ని అది నిర్వికారంగా, నిర్విఘ్నంగా నిర్వహిస్తుంది' అన్న లోకోక్తి 'వా నుని అనాథశరణాలయంలో చేర్పించు. నువ్వు చెప్తే వినకపోడు నీ భర్త' అన్న తల్లి మాటలకు 'తను పురుడు పోసుకోవడానికి కూడా మళ్ళీ ఇక్కడకు రాకూడదు' అనుకొన్న విశాలాక్షి మౌన మనసోక్తి 'స్థిరమైన నిర్ణయం తీసుకున్న పుడు మనసెంతో హాయిగా ఉంటుంది' అని వానుకు అశాంతిపర్వంలో సుమరాసిన లేఖోక్తి "అధైర్యానికి ఒక్కోసారి మొండితనం కూడా జోడించాల్సి వస్తుంది. బాబోయ్! ఏమవు తుందోనని ఆలోచిస్తే నువ్వేం చెయ్యలేవు" అన్న సైకియాట్రిస్ట్ రేణుక హితోక్తి, "తనకి దెబ్బ తగిలాగ ఎదుటివారి బాధ తనకి తెల్సింది" అనుకొన్న కామేశ్వరి బాధాతప్త హృదయోక్తి, రచనకు సమకూరిన వన్నెలు.

మధ్యతరగతి 'స్త్రీ' విభిన్న ప్రకృతులకు నవల అద్దం పట్టింది. వాసు, విశ్వనాథ్, జగదీష్ తదితర 'పురుష' పాత్రలు చప్పగా ఉన్నాయన్న లోపం మినహా నవల బాగుంది.

— కళ్యాణ్
విశాఖపట్టణం

## గొప్ప ఓదార్పునిస్తుంది

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

సంఘాన్ని పట్టిపీడిస్తున్న అనేక సమస్యలను కథలో అంతర్భాగంగా నింపుకున్న నవల "నిజానికీ అబద్ధానికీ మధ్య", బహిర్గతపరచలేని సమస్యలతో కృంగిపోయే దురదృష్టవంతులకు ఒక గొప్ప ఓదార్పునిస్తుంది. సుమబాల, వాసు తమ కుటుంబాలమధ్య ఉన్న శత్రుత్వం వెనుకఉన్న అసలు కారణాన్ని తెలుసుకోవడానికి ప్రయత్నించడంతో సుశీలలాగ విచిత్రమైన, బాధాకరమైన సమస్యలలో చిక్కుకునేవారూ, సత్యవతి వంటి బాలవితంతువులూ, కామేశ్వరి వంటి అహంకారులూ ఇలాంటివెన్నో విభిన్నపాత్రలు వెలుగులోకి వస్తాయి.

ముఖ్యంగా సుశీలపాత్ర అందరి మనసులను కదిలించేలా ఉంది. అన్యాయానికి గురయినవారి అంతర్మథనం రచయిత్రి ఈ పాత్రలో సజీవంగా చిత్రించారు. ఈ నవలలో కామేశ్వరిపాత్ర సమాజంలోని నగటుస్త్రీకి దర్పణం. సమస్యలను అర్థంచేసుకోలేని ఆమె వంటి మూర్ఖులు సంఘంలో ఎందరో ఉన్నారని రచయిత్రి పరోక్షంగా తెలియజేశారు. ఇలాంటివారికి ఎలా కనువిప్పుకలిగించాలో కథానుగుణంగా చూపించారేకాని సమాజపరంగా ఇలాంటివారికి ఎలా గుణపాఠం నేర్పాలో రచయిత్రి తెలుపలేదు.

ముఖ్యపాత్రలలో ఒకరైన సత్యవతి పాత్రను కథకు అవసరమయినంతవరకు వాడుకుని ఆమెకు ఓ పరిష్కారం చూపకుండా అర్థంతరంగా వదిలివేశారు. సత్యవతిని ఆమె అన్నయ్య డబ్బుడిగె ప్రహసనం, ప్రక్కింటి బామ్మగారు, సత్యవతి తల్లి కలిసి ఆమెకు జుట్టుతీయించాలనుకోవడం, ఇలాంటి సంఘటనలన్నీ బాలవితంతువులకు అటు సమాజంలోనూ, ఇటు పుట్టింటిలోనూ ఎదురయ్యే నిరాదరణను నిరూపిస్తాయి.

కథాగమనంలో . చదివించగలిగే లక్షణముంది. బహుశా రచయిత్రి ఎన్నుకున్న ఇతివృత్తం, విశిష్టమైన ఆమెశైలి దీనికి కారణం అయిఉండవచ్చు. ఈ నవల మనుషుల విభిన్న మనస్తత్వాలపై ప్రసరింపచేసిన "సెర్చిలైట్" అని నిస్సందేహంగా చెప్పవచ్చు.

— పి. బాలసుబ్రమణ్యం
నెల్లూరు

## ఆలోచింపజేస్తుంది

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

ఏప్రిల్ 'చతుర' నవల 'నిజానికీ అబద్ధానికీ మధ్య' సాధారణ కథే అయినా, ఆలోచన రేకెత్తించేదిగా ఉంది.

విశాలాక్షి గతాన్ని వివరించటం తప్ప మిగిలిన కథ అంతా సాధారణ ప్రేమకథ. దీన్ని గురించి ఎంతోమంది రచయితలు రాసినప్పటికీ జానకీబాలగారి చక్కటి శైలివల్ల విసుగు కల్గించలేదు. విశాలాక్షి గతాన్ని వివరించుతు




న్నప్పుడు పాత్రలు నడిపించినతీరు ద్వారా రచయిత్రి తాను చెప్పదలచిన భావాలను స్పష్టంగా వెల్లడించారని చెప్పుకోవచ్చు.

'మనం చేయని తప్పుకు శిక్ష ఎందుకు అనుభవించాలి? మనకు సంక్రమించిన హక్కులతో వాటిని ఎదురించలేమా? సమాజం, మనిషి ఆలోచనాధోరణి మారనంత వరకు మనకు విముక్తి లేదా?' అని సుశీల, సత్యవతి పాత్రల ద్వారా రచయిత్రి ప్రశ్నించటం బాగుంది.

ఆర్థిక స్వేచ్ఛ మన ఆలోచనధోరణికి ఏవిధంగా తోడ్పడుతుంది. సమాజపు కట్టుబాట్లు ఎదుర్కొనటానికి కావలసిన శక్తికి, ఆర్థిక స్వేచ్ఛ ఏవిధంగా అండగా ఉంటుంది అన్న విషయాన్ని సత్యవతి పాత్రద్వారా సూచించటం బాగుంది.

తన ప్రమేయం లేకుండా, ఎవరో దుర్మార్గుడు తనపై అత్యాచారం జరిపితే, అన్నేళ్లుగా కష్టసుఖాలలో పాలుపంచుకొని, ప్రేమ అనురాగాలు పంచిన భార్య ఉనికినే భరించరానంతగా అసహ్యించుకోవడం, ద్వేషించడం ఎంతవరకు సరైనది? ఇది కొంతవరకు మగవారిని ఆలోచింపజేసేలా ఉంది.

ఎవరైనా కష్టాలలో ఉన్నప్పుడు వాళ్ళను ఆదుకోకపోవటమే గాకుండా 'ఆ! ఏమిచేసి కష్టాలు తెచ్చుకుందో' అని ఈసడించుకొనే వ్యక్తులు అవే కష్టాలు తమకు వస్తే ఏవిధంగా తల్లడిల్లిపోతారో కామేశ్వరి పాత్రద్వారా రచయిత్రి చక్కగా వివరించారు.

విశాలాక్షి పాత్ర చాల ఉన్నతంగా ఉంది. ఆమెలాంటి వదినలు, జగదీష్‌లాంటి అన్నలు ఉంటే ప్రతి ఇల్లు ఓ నందనవనం అవుతుంది. అనాథబాలలు తయారుకాకుండా ప్రతిఒక్కరు వారికి అవకాశమున్నంతవరకు తమపరిధిలో సమస్యలు పరిష్కరించుకోమని సూచించటం కూడా బాగుంది.

'నిజానికి, అబద్ధానికిమధ్య' గల గాజుతెర పగిలినప్పుడు కలిగే పరిణామాలు, కుటుంబాలమధ్య ఉన్న ఇనుపతెర తొలగినప్పుడు వెల్లివిరిసే ఆనందం ఏవిధంగా ఉంటాయో హృద్యంగా వివరించిన జానకీబాలగారికి ధన్యవాదాలు.

— యమ్. పరుశురామ్
తాడ్వాయి

## చక్కని మనోవిశ్లేషణ

(రు.25/- బహుమతిపొందిన సమీక్ష)

సామాన్యంగా నేటి నవలలు ఊహాలోకాల్లో విహరింపచేయటమో, లేక లేని సమస్యల తోరణాల్ని సృష్టించటమో తప్ప సమాజంలోని సమస్యలకు తగిన పరిష్కారమార్గాల్ని చూపించటంలో విఫలమవుతున్నాయనే చెప్పాలి. ఈ నవలలో అలాగాక రచయిత్రి సున్నితమైన సమస్య ఆధారంగా ఈ నవల నడిపించి ఒక విధమైన పరిష్కారమార్గాన్ని చూపించగలిగారు. అయితే ఆ పరిష్కారం సాధ్యమా, సహజమా అనేది ప్రశ్నార్థకమే! రచయిత్రి భావనా ఘర్షణల్ని, మనోవిశ్లేషణని అద్భుత పదజాలంతో చిత్రించారు. ముఖ్యంగా స్త్రీ మనస్తత్వాన్ని వర్ణించటంలో కృతకృత్యులయ్యారు.

బాల వితంతువైన సత్యవతిని ఆమె ఖర్మకు ఆమెను వదిలేశారు. ఆ పాత్ర బూజుపట్టిన పాత సంప్రదాయపరిధిలోనిదే. ఈనాటి సమాజంలో బాలవితంతవులు కొంత మారినారు. ఈ విషయంలో ఛాందస సంప్రదాయాలు కొంతవరకూ వెనక్కినెట్టబడ్డాయి.

సుశీల పేరుచాల ఔచిత్యంగా ఉంది. ఆమె భర్తపేరు తెలియజేయకుండానే రచయిత్రి చమత్కారంగా నవల నడిపారు. బహుశ ఆయన పేరు చెప్పటం రచయిత్రికి అయిష్టమనే భావించవలసి వస్తోంది. ఆవిధంగానే సుశీల మరణాన్ని మిస్టరీగానే ఉంచేశారు రచయిత్రి.

ముగింపు కొరకు కొంత తొందరపడ్డారో ఏమోకాని వాసు జర్మనీ ప్రయాణం చేశాడో లేదో! విశాఖపట్టణంలో వున్న సుమ దగ్గరకు హఠాత్తుగా వాసు రావటం పఠితలను సందిగ్ధంలో పడేస్తుంది. 'తనదాక వస్తేగాని' అనే నానుడి ఆధారంగా రచయిత్రి చక్కని నవల అందించారనే చెప్పాలి! సైకియాట్రిస్ట్ రేణుకను రచయిత్రి సమయస్ఫూర్తిగా ఉపయోగించటం ఆమె కల్పనాపటిమకు చక్కని ఉదాహరణ!

— కొలచన వెంకటరమణమూర్తి
విజయవాడ

# చతుర

సంపుటి: 12 జూన్ 1989 సంచిక: 5

ఆ ప్రశ్న... గత పదేళ్ళుగా అతన్ని వేధిస్తోంది. అందం, వయసూ, సంపాదనా అన్నీ ఉన్నా తన ప్రశ్నకి సమాధానం తెలియనిదే ముందడుగు వేయదల్చుకోలేదతను. ఆ కారణంగా అయినవాళ్ల నిష్ఠూరాలకు లోనైనా చలించలేదు. ఈలోగా అనుకోని సమస్యలలో ఇరుక్కున్న అతడిని కొన్నాళ్లకోసం తమ పల్లెకు రమ్మని మేనమామ ఆహ్వానించాడు. ఆ మార్పువల్ల కాస్త మనశ్శాంతైనా లభిస్తుందనుకుని అతను పల్లెకు బయల్దేరాడు.

మనసులో నాటుకున్న సమస్యాబీజం క్రమంగా వట వృక్షంలా పెరిగి వేధిస్తుంటే ఏ

# అమృతహస్తాలు

ఆదుకుని అతని జటిల ప్రశ్నలకు జవాబులిచ్చాయి? జీవితంలో ఏనాడూ చవిచూడని శాంతిసౌఖ్యాలు ఎలా అతని అనుభూతిలోకొచ్చాయి? ఇంతకీ అతని ప్రశ్న, దానికి సమాధానం ఏమిటి? అదెలా దొరికింది? ఫలితంగా అతను తీసుకున్న నిర్ణయం ఏమిటి? ఆదుకున్న ఆ అమృతహస్తాలు ఎవరివి?

ఆద్యంతం రక్తికట్టిస్తూ ఆసక్తిగా చదివించే

జే.వి. బాబు రచన

ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్రనవల.

"గుడ్‌మార్నింగ్‌సర్".

ఆరోజు దినపత్రికలు తిరగేస్తున్న రమేష్ తలెత్తి చూశాడు. టేబుల్ చివర్న నిలబడి నవ్వుతూ విష్‌చేసింది హరిత.

"వెరీగుడ్‌మార్నింగ్. ప్లీజ్ టేక్ యువర్ సీట్"

ఎదురుగా కుర్చీలో కూర్చుంది హరిత.

అతడు కాలింగ్‌బెల్ కొట్టి, వచ్చిన బాయ్‌కి రెండు టీలు చెప్పాడు. ఆ కుర్రాడు వెళ్లిపోయాడు.

రమేష్ చేతిలోని దినపత్రికలు మడిచి వక్కనపెట్టి ఆమెవంక తిరిగాడు. "ఈరోజు మంచి యాడ్స్ ఏవైనా వున్నాయా?"

"ప్రస్తుతానికి ఈరోజు టూ ఇంటూ ఫైవ్ సెంటిమీటర్స్ యాడ్స్ రెండు తీసుకువచ్చాను. పోతే ఈ మధ్యాహ్నం వెళితే వంశీ రెస్టారెంట్‌వారు క్వార్టర్ పేజీ మూడు పేపర్లకి హైదరాబాద్ ఎడిషన్స్‌కి ఇస్తామన్నారు. అది సంక్రాంతికి శుభాకాంక్షలతో పడాలట"

అతడు తలూపాడు. ఆమె చేతిలోని పేపర్స్ రెండు అందుకుంటూ "ఇవి ?" ప్రశ్నించాడు.

"ఇందులో పై యాడ్ 'ఈనాడు' నాలుగు ఎడిషన్‌లు. నెక్స్టవి మూడు పేపర్లకి హైదరాబాద్ ఎడిషన్ మాత్రమే."

అతడు తలూపి, చేతిలోని యాడ్ మేటర్ వంక చూశాడు. తర్వాత వక్కనున్న పెన్ అందుకుని రెండుమూడు పదాలు, ఒకటీ రెండు అక్షరాలు సరిచేశాడు. తర్వాత ఆమెతో అన్నాడు- "మీరింకా తెలుగుభాష బాగా నేర్చుకోవాలి, ముఖ్యంగా గుణింతం"

ఆమె సిగ్గుగా నవ్వింది.

రమేష్ తిరిగి తన చేతిలోని పేపర్స్ ఆమెకిస్తూ చెప్పాడు- "వెళ్ళి ఆర్టిస్ట్‌చేత వారు కోరిన విధంగాడిజైన్‌చేయించండి.పేపర్స్ ఆయనకు ఇచ్చేసిన తర్వాత అటు నుండి అటే ఫీల్డ్‌మీదకు వెళ్ళండి"

"యస్సర్" చెప్పి, పైకి లేచిందామె.

"అన్నట్టు మీకీ ఉద్యోగం కొత్త కదా! ఎలా ఉంది?"

ఆమె చిన్నగా నవ్వింది. "కొద్దిగా ఇంటరెస్టింగ్‌గా... మరికొద్ది ఎగ్జయిటింగ్‌గా... కాస్త రిస్కీగా..."

"రిస్కా! ఎందుకు?"

"ఎందుకంటే... పార్టీ ఆశించిన విధంగా యాడ్ పబ్లిష్ కాని పక్షంలో వారు కాస్త బాధపడతారు. దాంతో మనల్ని విసుక్కుంటారు... ఒక్కొక్కసారి ఆ యాడ్‌కి డబ్బు ఇవ్వకుండా ఇబ్బంది పెడుతుంటారు"

రమేష్ పెదాలు మెల్లగా విచ్చుకున్నాయి. "మీరన్నది నిజమే... కాని ప్రతి బిజినెస్ ఫీల్డ్‌లో రిస్క్ అన్నది తప్పనిసరి. అది యజమానికి కానీ... అతని క్రిందవారికి కాని... దట్సాల్"

"యూ ఆర్ రైట్ సర్... గుడ్‌బై"

ఆమె వెళుతూ తలుపు దగ్గరకు లాగి వెళ్ళింది.

అతడు రిలాక్స్‌డ్‌గా కుర్చీలో వెనక్కువాలి, ఆరోజు పోస్ట్‌లో పత్రికల నుంచి వచ్చిన బిల్లులు చూడసాగాడు.

సరిగ్గా అప్పుడే ఫోన్ మ్రోగింది. "హలో" రిసీవర్ పైకెత్తి అన్నాడతను.

"హలో రమేష్"

"ఏంటమ్మా" అవతలి తల్లి జానకమ్మ గొంతు గుర్తుపట్టి అన్నాడు.

"మీ మామయ్య ఊరెళ్లిపోతున్నాడు"

"అలాగా! సరే పోనివ్వు"

అవతల ఒక నిముషం నిశ్శబ్దం తర్వాత, ఆమె అన్నది- "అది కాదురా! మీ మామయ్య ఇక ఎప్పటికీ ఈ ఇంటికి రాడట"

"ఏం...ఎందుకని?"

ఈసారి జానకమ్మ కాస్త విసురుగా అంది- "అంతా తెలిసి ఏమీ తెలియనట్టు నటించకురా! మీ మామయ్య అంత కోపంగా ఎందుకెళుతున్నాడో నీకు తెలీదా?"

మేనమామ రఘురామయ్య కోపానికి కారణం తెలును రమేష్‌కు. తన కూతుర్ని రమేష్ పెళ్లి చేసుకోలేదన్నదే ఆయన కోపానికి కారణం. కానీ... నిజానికి తనకు పెళ్లంటే ఇంట్రస్ట్ లేదే మరి ఇంట్రస్టే కాదు... తనలో మెదలుతున్న ఒక ప్రశ్నకు సమాధానం తెలుసుకోకుండా మాత్రం తను పెళ్లి చేసుకోడు.




అవతలవైపు నుండి తిరిగి జానకమ్మ గొంతు వినిపించసాగింది. "రమేష్! ఈ రోజు నువ్వీ స్థితిలో ఉన్నావంటే అందుకు మీ మామయ్యే కారణం. నీ చదువులోనూ, నువ్వు ఉద్యోగం వద్దు వ్యాపారమే చేస్తానన్నప్పుడూ ఆయన ఎంతగా సహాయం చేశాడో నీకూ తెలును. అలాంటి ఆయనని ఇప్పుడిలా బాధించడం ఏమంత మంచిదికాదు"

అమాయకంగా, అభిమానంగా... తనంటే ఎంతో ప్రేమించే తన మామయ్య ముఖం ఒక్క క్షణం రమేష్ ముందు కదలాడింది. వెను వెంటనే తనెప్పుడో చిన్నప్పుడు చూసిన మామయ్య కూతురు 'శ్వేత' గుర్తుకు వచ్చి మనస్సే దోలా అయింది కాని... ఊహు! తన ప్రశ్నకు జవాబు తెలునుకోకుండా తను మాత్రం పెళ్లి చేసుకోడు.

"అమ్మా! నాకూ మామయ్యంటే అభిమానమే కాని పెళ్లి ఇప్పుడే చేసుకోవాలని లేదు" అన్నాడతను.

"నీ వయస్సు ఇరవైఆరు... తెలునుకదా?"

"తెలును... కాని నేనిప్పుడే పెళ్లి చేసుకోను"

"ఇప్పుడే చేసుకోవా? లేక అసలెప్పటికీ చేసుకోవా?" అడిగింది జానకమ్మ.

ఆ ప్రశ్నకు జవాబు చెప్పలేదు రమేష్. అందుకే జానకమ్మ తిరిగి అన్నది- "పోనీ నువ్వెప్పుడు పెళ్లిచేసుకుంటావో చెప్పు. అప్పటివరకూ శ్వేతను నీకోసం అలాగే పెట్టేస్తాడు మీ మామయ్య"

రమేష్ వెంటనే జవాబు చెప్పాడు. "నా కోసం ఆ అమ్మాయికి పెళ్లి చేయకుండా ఆపేయడం నాకు ఇష్టం లేదు. శ్వేతకు పెళ్లి చేసేయమను"

"అంటే శ్వేతను పెళ్లి చేసుకునే ఉద్దేశ్యం నీకు లేదన్నమాట" అవతలి వైపు నుండి జానకమ్మ స్వరం చాలా తీవ్రంగా పలికింది.

"శ్వేత నేకాదు. అసలు ఎవర్ని కూడా ఇప్పుడే పెళ్లి చేసుకునే ఉద్దేశ్యం నాకు లేదు" ఖచ్చితంగా చెప్పాడు రమేష్.

"శ్వేతను కాదన్నందువలన మనం మీ మామయ్యకు దూరం అవుతామన్న నంగతి ఆలోచించు" చివరిసారి అన్నట్టుగా అంది జానకమ్మ.

రమేష్ చిన్నగా నిట్టూర్చాడు. "ఎవరికో దూరం అవుతామనో-మరెవరి బెదిరింపుకో భయపడి ఇష్టంలేనివని నేను చేయలేను... ఇదేమాట మామయ్యకు చెప్పు" ఇక సంభాషణను పొడిగించే ఉద్దేశం లేనట్టుగా రిసీవర్‌ను హుక్‌మీద ఉంచాడు- అవతలి వైపు జవాబు వినకనే.

రిసీవర్ పెట్టేసిన తర్వాత, అతడు కుర్చీలో వెనక్కు వాలాడు సాలోచనగా.

"శ్వేతను కాదని తను అమ్మనూ-మామయ్యను ఇద్దర్నీ బాధపెడుతున్నాడా? వారిని బాధపెట్టడం తనకేమాత్రం ఇష్టంలేదు. కాని... పెళ్లి మాత్రం ఇప్పుడే చేసుకోబుద్ధవడంలేదు. నిజానికి తనకు శ్వేత అంటే అయిష్టంలేదు. పెళ్లంటే విరక్తీలేదు. అయితే తనలో మెదలేది ఒకే ఒక ప్రశ్న. చాలా చిన్న ప్రశ్న!

తన మనసులో ఉదయించిన ఆ ప్రశ్నను గురించి ఎవరికైనా చెపితే నవ్వుతారు. పిచ్చివాడిని చూసినట్టుగా చూస్తారు. కాని తనకు అనిపిస్తుంది... తన ప్రశ్నలో ఏదో రీజన్ ఉంది... ఆ ప్రశ్నకు జవాబు తెలునుకోకుండా మాత్రం తను పెళ్ళిచేసుకోడు.

తనకు ఆ ప్రశ్నకు జవాబు కావాలి!

★ ★ ★

"నేనో ప్రశ్న అడుగుతాను దానికి సమాధానం చెప్పకపోయినా పర్వాలేదు. కాని నవ్వకూడదు"

అశోక్ తలెత్తి మిత్రుని వంక చూశాడు.

తన దగ్గర ఎప్పుడూ క్లోజ్‌గా చనువుగా ఉండే రమేష్, ముఖంలో మొదటిసారిగా బిడియం చూశాడు అశోక్. అదీ ఏదో ప్రశ్న అడిగేందుకే అనుకుంటేనే అతనికి వింతగా అనిపించింది.

"అడుగు" అన్నాడు అశోక్.

"అడిగిన తర్వాత నవ్వకూడదు" మరోసారి హెచ్చరించాడు రమేష్.

"అలాగే" చెప్పాడు అశోక్.

"రమేష్ కొద్దిసేపు మౌనంగా ఉండిపోయాడు. ఆ క్షణం ఎందుకో ఎగ్జయిటింగ్‌గా అనిపించింది. తను కాలేజీలో అడుగుపెట్టిన మొదటి రోజుల్లో తన మనస్సులో అడుగిడిన ప్రశ్న

అది. సుమారు పది సంవత్సరాలుగా జవాబు దొరకకనే ఆలోచింపచేస్తున్న ప్రశ్న అది. చాలా మందికి సిల్లీ ప్రశ్న. తనకు మాత్రం అర్థవంత మైన ప్రశ్న.

అలాంటి ప్రశ్నను మొట్టమొదటిసారిగా మరో మిత్రుడి ముందు బయటపెట్టబోతున్నాడు. రమేష్ కొద్దిసేపు బలంగా ఊపిరిపీల్చుకున్నాడు. ఆ తర్వాత మెల్లగా... అతి మెల్లగా అన్నాడు- "మగాడు... మగాడు అసలు ఎందుకు పెళ్ళిచేసుకోవాలి".

రమేష్ అడిగిన ప్రశ్న ఏమిటో కొద్దిసేపటి వరకూ సరిగ్గా అర్థం కాలేదు అశోక్‌కు. అర్థంకాగానే 'అంతటి సిల్లీ ప్రశ్న తెలివైన మిత్రుని బుర్రలోకి ఎందుకు ప్రవేశించిందా అని వెంటనే అనిపించింది అతడికి' ఆ తర్వాత నవ్వొచ్చింది. కాని ఆ నవ్వు పెదాలు మధ్యనే బిగపట్టాడు- మిత్రునికి ఇచ్చినమాట కోసం.

రమేష్ ఉద్దేశం మరింత విపులంగా తెలుసుకునేందుకు అశోక్ అడిగాడు- "నీ ప్రశ్న ఏమిటో నాకు సరిగా అర్థంకాలేదు"

రమేష్ గొంతు సవరించుకున్నాడు. మగాడికి యుక్తవయస్సురాగానే, పెళ్ళి చేసేయాలని అతడి పెద్దలు ఆరాటపడటమో, లేదా పెళ్ళిచేసుకోవాలని అతడే ఆత్రుతపడటమో జరుగుతుంది. నిజానికి మగాడికి పెళ్ళి ఎంతవరకూ అవసరమో చెప్పు"

అశోక్ రమేష్ వంక వింతగా చూశాడు. "అవసరం... అవసరమంటే అవసరమే కదా!"

"అదే ఎందుకు అవసరమని నేను అడుగుతున్నాను".

అశోక్ ఆ మాటకు జవాబు చెప్పే నిమిత్తం కొంతసేపు ఆలోచించాడు. 'అవునూ మగాడికి పెళ్ళి అనేది దేనికోసం?' ఎందుకో తెలియకనే 'పెళ్లి' అనే కార్యాన్ని పూర్తి చేసిన ఆ వ్యక్తి 'పెళ్లయిన నాలుగేళ్ల తర్వాత తను ఎందుకు పెళ్ళిచేసుకున్నాడా?' అని మొదటిసారిగా ఆలోచించడం మొదలుపెట్టాడు. సాధారణంగా పెళ్ళిచేసుకునేందుకు కారణాలు కొన్ని ఉంటాయి. కాని తన పెళ్ళికి కారణం అంటూ ఏదీ లేదు. ఎందుకో తెలియకనే తను పెళ్ళిచేసుకున్నాడు.

పెళ్ళికి 'సెక్స్' ఒక కారణమనుకుంటే, అప్పట్లో తన క్లాస్‌మేట్స్‌లో సరోజ అనే అమ్మాయితో తనకు సెక్సువల్ డీలింగ్స్ ఉండేవి. పోని డబ్బు కోసం పెళ్ళిచేసుకున్నాడా అని అనుకునేందుకు- తనసలు కట్నం తీసుకోలేదు. మరి తను పెళ్ళెందుకు చేసుకున్నట్టు?... అప్పట్లో తాను అమ్మాయిలతో ఎక్కువగా తిరుగుతుండేవాడు. అది తెలిసిన అమ్మానాన్న ఇక లాభంలేదని పెళ్ళిచేసుకోమన్నారు. అది ఎప్పటికైనా తప్పని జీవితకృత్యం కాబట్టి 'అలాగే' అని ఒప్పుకున్నాడు. అంతేతప్ప పెళ్ళి అనేది ఎంతవరకూ అవసరమో తనప్పుడు ఆలోచించలేదు... ఇప్పుడు ఆలోచిస్తే- జరిగిన దానికి చింతించటం కాదుగాని, రమేష్ చెప్పినదాంట్లో ఏదో కొత్త అర్థం ధ్వనిస్తోంది. 'అసలు మగాడికి పెళ్ళి అవసరమా?' జవాబు తట్టలేదు అశోక్‌కు. అందుకే అతడు మౌనంగా ఉండిపోయాడు.

అశోక్ మౌనాన్ని అర్థం చేసుకున్నాడు రమేష్. అందుకే చిన్నగా నవ్వాడు. పెళ్ళయిన నాలుగేళ్ళ తర్వాత కూడా నువ్వెందుకు పెళ్ళి చేసుకున్నావో చెప్పలేకపోయావు. నిజానికి నువ్వేకాదు లోకంలోని చాలామంది మగవాళ్ళు ఎందుకు పెళ్ళి చేసుకుంటున్నారో తెలియకనే పెళ్ళి చేసుకుంటున్నారు. అదొక అనాలోచితంగా చేసే తప్పనిసరి చర్య అయిపోయింది.

ఆ ఇంటి పెరటిలోని కొబ్బరిచెట్ల ఆకులు గాలికి మెల్లగా ఊగుతున్నాయి. ఆకాశం నుండి వెన్నెలనీడ తెల్లగా పడుతోంది.

అశోక్ సిగిరెట్ వెలిగించాడు.

"అంటే ఈ లోకంలో అందరూ అనాలోచితంగానే పెళ్ళి చేసుకుంటున్నారంటావా?" అడిగాడతను.

రమేష్ తల అడ్డంగా ఊపాడు. "అని నేను అనడంలేదు. కాని ఎక్కువమంది యువకులు అనాలోచితంగానే పెళ్ళి చేసుకుంటున్నారని నేను ఖచ్చితంగా చెప్పగలను. చాలా మంది కుర్రాళ్లకు పెళ్ళి చేసుకోవాలంటే అదో చెప్పలేని ఆనందమే తప్ప. ఆ పెళ్ళి ఎందుకు? దేనికోసం? అని ఆలోచించి ఏ ప్రయోజనం

ఆశిస్తున్నారో ఖచ్చితంగా నిర్ణయించుకుని మరీ పెళ్ళి చేసుకోవడం లేదంటాను నేను. మరి కొంతమంది పెళ్ళి చేసుకోవాలనుకోవడా నికి కారణాలు కూడా నేను చెప్పగలను''

అశోక్ యాష్‌ని ట్రేలో విదిలిస్తూ అన్నాడు- 'చెప్పు' రమేష్ కుర్చీలో వెనక్కు వాలాడు. ''ఈలోకంలో ఎక్కువ మంది పెళ్ళి చేసుకోవడా నికి మొదటికారణం సెక్స్- సెక్స్ ఈజ్‌ఏ ఫిజికల్ నీడ్. తిండి, నిద్రలాగానే వయస్సు వచ్చిన తర్వాత సెక్స్ ఒక శారీరక అవసరం. రాత్రికాగానే తనువు 'ఆ సుఖం' కోరు కుంటుంది. ఆ సుఖం కోసం ఎవరినో వెతుక్కో వడం, ఏవో సుఖవ్యాధులు అంటించుకోవటం ఎందుకనుకునే వాళ్ళు మొదట చేసేపని- పెళ్ళి చేసుకోవడం.

రెండవది- ప్రస్తుతానికి బాగానే ఉంటారు గానీ ముసలివారయినప్పుడు అన్నం వండిపె ట్టేందుకు ఒక మనిషికావాలి. ఆమనిషికి తోడుగా మగవాడు ఉండాలి అందుకే ఆలోచ నాపరులు ఆడామగలను జతకలిపేది.

మూడవది- పెద్దలపోరు. కొంతమంది కుర్రాళ్లకు పెళ్ళి అంటే పెద్ద ఇంట్రస్ట్ ఉండ దుకాని పెద్దలు పాతికేళ్ళు నెత్తికెక్కాయి, ఒక తోడు తగిలించుకో అంటూ గోలపెడుతుంటా రు. ఆ పెద్దలపోరు పడలేకనే కొంతమంది కుర్రాళ్ళు 'సరే' అని పెళ్ళి చేసేసు కుంటుంటారు

''అంటే నాకేసు'' నవ్వాడు అశోక్. రమేష్ తలూపాడు.

''పోతే- భారతదేశంలో మాత్రం, మగాడి పెళ్ళికి మరో కారణంకూడా ఉంది. అదే కట్నం అన్న పేరుతో వచ్చే డబ్బు. ఈ దేశంలో కొంతమంది మగాళ్ళు పెళ్ళి చేసుకుంటే కట్నం రూపేణా డబ్బు వస్తుందనీ, దానితో జీవితం సుఖంగా గడపొచ్చనీ పెళ్ళిచేసు కుంటున్నారు''

అశోక్ రమేష్ చెపుతున్నది శ్రద్ధగా వింటు న్నాడు- ''ఇంకా కొంతమంది సంతానం కోసం పెళ్ళి చేసుకుంటున్నారు. తన బిడ్డ అంటూ ఒకడుంటే, తన స్వార్జితం వాడికి అప్ప గించటం, ముసలితనాన వాడి నీడన బ్రత కడం కోసం కొంతమంది పెళ్ళి చేసు కుంటున్నారు.

రమేష్ చెప్పడం కాసేపు ఆపాడు. తర్వాత అలుపు తీర్చుకుంటున్నట్టుగా గుండెల నిండుగా ఊపిరి పీల్చి వదిలి ఆ తర్వాత మళ్ళీ చెప్పాడు. ఈ పై కారణాల వలననే పెళ్ళిళ్ళు అనేవి జరుగుతున్నాయి. ఎవరో ముక్కుముఖం తెలియని స్త్రీ పురుషులకీ మధ్య సంబంధం పెంచుకునేందుకు ఇవే కారణాలు. పెళ్ళి అనే తంతు జరిగేందుకు సెక్స్ ఒక కారణం కావడం నాకిష్టంలేదు. అలాగే పెళ్ళి పేరుతో జీతంలేని ఒక పనిమ నిషిని సంపాదించుకోలేను. సంపాదించుకో ను. అలాగే పెద్దలుపోరు పెడుతున్నారని ఇష్టంలేని పెళ్ళికార్యాన్ని పూర్తిచేయలేను. కట్నం అన్నది నా కిష్టంలేనిది. సంతానం కావాలని నే కోరుకోవడం లేదు... మరి నేనెందుకు పెళ్ళి చేసుకోవాలి? పెళ్ళి అన్నది మగాడి జీవితానికి అంత తప్పనిసరా- చెప్పు'' రమేష్ మాటలు వేగంగా ఉన్నాయి. ఎన్నిరో జుల నుండి ఆ ప్రశ్న గురించి ఆలోచిస్తున్నా డో!

అశోక్ రమేష్ వంక పరిశీలనగా చూశాడు. చేతిలోని సిగరెట్‌ని యాష్‌ట్రేలో పడేశాడు. రమేష్ ప్రశ్నలో రీజన్ వుంది. కాని అర్థ వంతంగా అనిపించడంలేదు. 'మగాడికి పెళ్లి ఎందుకు? ... సెక్స్, తోడు, పిల్లలు ఈ కారణా లు చాలవా పెళ్లి చేసుకునేందుకు? మరి అతడు తన పెళ్లికి అవేవీ కారణాలు కాకూడ దని అంటున్నాడు. ఆ చిన్నకారణాల కోసం మగాడు పెళ్లి చేసుకోకూడదట. మరి, మగాడికి పెళ్లెందుకు అవసరం?

''అయితే నువ్వు చెప్పిన ఆ కారణాలకోస మైతే నువ్వు పెళ్లిచేసుకోనంటావు. మరి దేని కోసం పెళ్లిచేసుకుంటావు?'' అడిగాడు అశోక్.

''అదే నేనూ అడిగేది. నేను దేనికోసం పెళ్లి చేసుకోవాలి-. పెళ్లి అవసరమా?''

''అయితే నీకీ జన్మకు పెళ్లికాదు'' బల వంతంగా నవ్వాడు అశోక్.

రమేష్ నవ్వలేదు. ''ఫర్వాలేదు... నాకీ జన్మకు పెళ్లికాకపోయినా ఫర్వాలేదు. కాని నేను నా ప్రశ్నకు జవాబు తెలుసుకుని కాని పెళ్లిచే సుకోను''

అశోక్‌కు రమేష్ పట్టుదల గురించి తెలు

ను. ఒకసారి ఒకమాట అంటే ఇక ఆమాట మీదే ఉంటాడు. మరి ఈ వ్యక్తికి పెళ్ళవుతుందా? అతడు తన ప్రశ్నకు సమాధానం ఎలా సంపాదించగలడు?

"ఈ ప్రశ్నకు నీకు సమాధానం దొరుకుతుందనుకుంటున్నావా?"

"భవిష్యత్తులో ఏనాటికైనా నా ప్రశ్నకు సమాధానం దొరుకుతుందని నా నమ్మకం" చెప్పాడు రమేష్.

"అప్పటికి నువ్వు ముసలివాడివి అయిపోతావేమో?"

"అయినా ఫర్వాలేదు... ఈ దేశంలో మగాడు ముసలాడయినా ఫర్వాలేదు. పెళ్ళవుతుంది"

అశోక్ ఇక రెట్టించలేదు. మరికొద్దిసేపు మామూలు సంభాషణ తర్వాత రమేష్ లేచి వెళ్లబోతూ "గుడ్‌నైట్" చెప్పాడు.

"గుడ్ బై"

రమేష్ తన స్కూటర్‌ని స్టార్ట్ చేశాడు. రమేష్ స్కూటర్ కనుమరుగయ్యేవరకూ అటే చూశాడు అశోక్. కొద్దిసేపటి వరకూ రమేష్ గురించే ఆలోచిస్తూ ఆకాశం వంక చూడసాగాడు. కొద్దిసేపటి తర్వాత సిగరెట్ వెలిగిస్తుండగా అతనికో అనుమానం కలిగింది. 'రమేష్ మగాడికి పెళ్ళి ఎంత వరకూ అవసరం అని అడిగాడు. మరి ఆడదానికి పెళ్లి ఎంతవరకూ అవసరమో అతను చెప్పలేదు. చర్చించలేదు. మరి ఆడదానికి పెళ్లి ఎంతవరకూ అవసరం?'

ఆ అనుమానంరాగానే అతడు వేగంగా ఇంట్లోకి వెళ్లాడు. ఫోన్ అందుకుని నంబర్ డయల్ చేశాడు. అవతల ఫోన్‌లోంచి "హలో" వినిపించింది.

"హలో"

"హలో రమేష్! ఇంటికి చేరుకున్నావా?"

"వాకిట్లో అడుగుపెట్టగానే ఫోన్ మ్రోగింది. ఎత్తుకుంటే నువ్వు. చెప్పు... ఏమిటి నా వెనుకే ఫోన్‌చేశావు?"

"ఏంలేదు... ఇంతకుముందు నువ్వు 'మగాడికి పెళ్లి ఎంతవరకూ అవసరం' అని అడిగావు. నాకో అనుమానం వచ్చింది. మరి ఆడదానికి పెళ్ళి ఎంతవరకూ అవసరం?"

రమేష్ కొద్దిసేపు మౌనంగా ఉన్నాడు.

"ఏమో స్త్రీవైపు నుండి నేను ఆలోచించలేదు. సమస్య నాది కాబట్టి నావైపు నుండే ఆలోచించాను"

"ఇట్సాల్‌రైట్" ఫోన్ పెట్టేసాడు అశోక్.

డైనింగ్‌టేబుల్ ముందు కూర్చున్నాడు రమేష్.

జానకమ్మ అతడి ముందు ప్లేట్ ఉంచి, ప్లేట్‌లో ఉప్మాపెట్టింది. పక్కగిన్నెలోకి చట్నీ వేసుకుంటూ అతడు తల్లి ముఖంలోకి చూశాడు. ఆమె అతడి వైపు చూడటంలేదు. ఎటో చూస్తూ, మౌనంగా వడ్డిస్తోంది.

గత రెండు రోజులుగా తల్లి ముభావాన్ని గమనిస్తూనే ఉన్నాడతను. ఎక్కువగా పలకదు. ఏదీ చెప్పదు ... ఆమె మౌనానికి కారణం శ్యామలను పెళ్లిచేసుకోవడానికి తిరస్కరించడమే. అని తనకు తెలుసు. కానీ ఏం చేయగలడు? తన అభిప్రాయం తనది.

"ఏమ్మా! ఈరోజు బజారు నుండి ఏమైనా తేవాలా?"

"ఏంవద్దు"

"అమ్మా! నామీద ఇంకా కోపం తగ్గలేదా?"

"అష్టాలనాడు బిడ్డలుకానీ గడ్డాలనాడు బిడ్డలు కాదుకదా నాయనా! నీమీద కోపగించుకుని నేను చేయగలిగింది ఏముంది?" బాధగా అన్నది జానకమ్మ.

"నువ్వు నన్ను అర్థం చేసుకోవడంలేదమ్మా" చెప్పాడతను.

"అర్థంచేసుకున్నా, చేసుకోకపోయినా నాకోరిక మాత్రం గాలిమేడ అయిపోయింది. మన శ్యామల కాపురమే కాదు అన్నయ్య మనస్సునూ కష్టపెట్టావు"

రమేష్ బదులు పలుకలేదు. రెట్టించేకొద్దీ ఆమె ఆవేదన ఎక్కువవుతుంది. తనకూ బాధ కలుగుతుంది. అందుకే మౌనంగా టిఫిన్ తిని పైకి లేచాడు. కాఫీ తాగి బయటకు నడిచాడు.

మరో నిముషం తర్వాత అతని స్కూటర్ ఆ కాంపౌండుగేటు దాటి రోడ్డెక్కింది.

సరిగ్గా పదినిముషాల తర్వాత స్కూటర్ ఓ

పెద్దగేటుదాటి లోనికి ప్రవేశించింది.

మూడంతస్తుల బిల్డింగ్ అది. ఆ బిల్డింగ్ పైభాగాన బిన్ని కాంప్లెక్స్ అని రాసి ఉన్న బోర్డు కొట్టొచ్చినట్టుగా కనిపిస్తోంది.

ఆ బిల్డింగ్‌లో రకరకాల షాపింగ్ కాంప్లెక్స్‌లు ఉన్నాయి. కింద అంతస్తులో బట్టలకొట్లు, వీడియో షాపులు, మోటారు స్పేర్‌పార్ట్స్ లాంటివి ఉంటే, రెండవ అంతస్తులో ఫైనాన్స్ కంపెనీలు, ఒక పత్రికాఫీసు ఉన్నాయి.

మూడవ అంతస్తులో ఒక ఫిలిం డిస్ట్రిబ్యూషన్ కంపెనీ, ఒక ఫ్యాక్టరీ తాలూకు ఆఫీసు, మరో అడ్వర్టయిజింగ్ కంపెనీ ఉన్నాయి.

ఆ అడ్వర్టయిజింగ్ కంపెనీముందు బోర్డు మీద ఇలాఉంది:

"సత్యా అడ్వర్టయిజర్స్. ప్రెస్ పబ్లిసిటీ కన్సల్టెంట్స్ అండ్ డిజైనర్స్"

ఆ అడ్వర్టయిజింగ్ కంపెనీ అధిపతి రమేష్.

డిగ్రీ పూర్తయిన తర్వాత ఒక సంవత్సరంపాటు ఉద్యోగాన్వేషణ చేసి విసిగిపోయాడతను. ఇక ఉద్యోగాలు గగన కుసుమాలని తెలుసుకుని, వ్యాపారరంగంవైపు దృష్టి సారించాడు. అప్పుడు అతని దృష్టికి వచ్చింది యాడ్స్ కంపెని. కేవలం పదిహేనువేల రూపాయల పెట్టుబడితో ప్రెస్ పబ్లిసిటి బిజినెస్ స్టార్ట్ చేశాడు. షాపులనుండి ఆర్డర్స్ పొందడం, వాటిని వారు కోరుకున్న సైజులో, కోరుకున్నవిధంగా డిజైన్ చేయించి పత్రికలకు పంపడం యాడ్స్ కంపెనీ పని. అందుకుగాను ఆ కంపెనీకి పది నుండి పదిహేనుశాతం కమీషన్ వస్తుంది. ఇది మంచి ఆదాయం వచ్చే వ్యాపారమే. కాని ఇందులో ఒక రిస్క్ ఉంది. కస్టమర్ ఎప్పుడూ ముందు పేమెంట్ ఇవ్వడు. కాని హెచ్చుసందర్భాల్లో కంపెనీ ముందుగానే పత్రికకు డి.డి లేదా చెక్ యాడ్‌తోపాటు జతపరచి పంపాలి. యాడ్ పబ్లిష్ అయిన తర్వాత కస్టమర్ నుండి ఆ రావలసిన డబ్బు కలెక్ట్ చేసుకోవడం కంపెనీ శక్తిసామర్థ్యాలమీద ఆధారపడి ఉంటుంది. ముఖ్యంగా బిజినెస్ ఎగ్జిక్యూటివ్‌లదే ఆ బాధ్యత. కస్టమర్ ఏ కారణంవల్లనైనా ఇవ్వాల్సింది ఇవ్వనప్పుడు ఆ నష్టాన్ని కంపెనీ భరించాల్సిందే.

రమేష్ తన స్కూటర్‌ని పార్కింగ్ ప్లేస్‌లో ఉంచి, మెట్లవైపు నడిచాడు. అప్పుడు సమయం పదికావస్తోంది.

అతడు మూడో అంతస్తుచేరి తన సీట్లో కూర్చునేసరికి సమయం సరిగ్గా పదయింది. అతడు తన సీట్లో కూర్చున్న వెంటనే పక్కనేఉన్న దినపత్రికలు అందుకున్నాడు. ఆ పత్రికలలో ఆరోజు రావలసిన యాడ్స్ అన్నీ సక్రమంగా వచ్చాయో లేదో లిస్టు ప్రకారం సరి చూసుకున్నాడు. అన్నీ సక్రమంగానే వచ్చాయి. -- ఒక్కటి తప్ప. "గ్రే" అని రాసిన దానిని రివర్స్‌లో వేసేసారు.

అతడు నిట్టూర్చాడు. ప్రతిరోజూ ఏదో ఒక తప్పు ఉండనే ఉంటుంది. ఆ తప్పు వలన జరిగిన నష్టం ఏమిటి? అన్నది కాదు ప్రశ్న. 'తాను కోరినవిధంగా పడలేదే' అన్నదే కస్టమర్‌కి బాధగాఉంటుంది.

పేపర్ పక్కనపడేసాడు రమేష్. మరో అర్ధ గంటలో ఒక కొత్త కేండిడేట్ వస్తాడు. అతనికి యాడ్స్‌గురించి వివరంగా చెప్పాలి.

హరిత లోపలికివచ్చింది. ఆరోజు ఇవ్వవలసిన యాడ్స్ చూపించి తిరిగి ఫీల్డ్ మీదకు వెళ్ళిపోయింది.

పదిన్నరకు ఆ కొత్త కేండిడేట్ వచ్చాడు. "గుడ్‌మార్నింగ్ సర్" అని విష్ చేశాడు.

"గుడ్ మార్నింగ్" ఎదురుకుర్చీ చూపించాడు రమేష్.

అతడు ఆ కుర్చీలో కూర్చున్నాడు.

"ఈరోజునుండి నువ్వు ఫీల్డ్‌మీదకు వెళ్లాలి కదా! సో...నేనిప్పుడు నీకు యాడ్స్‌గురించి వివరంగా చెపుతాను- విను"

ఆ అభ్యర్థి ఆసక్తిగా ముందుకు వంగాడు.

రమేష్ గొంతు సవరించుకుంటున్నాడు. "మనం పత్రికలలో అడ్వర్టయిజ్‌మెంట్స్ వేయిస్తుంటాం. కస్టమర్ నుండి యాడ్ రాబట్టి పత్రికకు పంపినందుకు మనకు కమీషన్ అంటూ కొంత వస్తుంటుంది. ఆ కమీషనే మన సంస్థకు ఆదాయం.

ఇక యాడ్‌గురించి. మనం పంపే యాడ్స్‌లో అత్యధికశాతం దినపత్రికలలో ప్రచురింపబడేవే. ప్రతి దినపత్రికలో ఎనిమిదికాలంలు ఉంటాయి ..." రమేష్ పొడవుగాఉన్న

# రెండులో ఒకటిని ఈ రోజే ఎన్నుకోండి




మా CAT 1000 సిరీస్. అవి కంప్యూటర్ సాంకేతిక సహకారంతో తయారుచేయబడినవి. ప్రతిసారి మీరు టి.వి. చూసే సమయంలో మీకు దీని విశేష ఉపయోగాలు తెలుస్తుంది. చక్కటి, సున్నితమైన, నిజజీవితంలోలా రంగుల దృశ్యం. ఇవన్నీ కంప్యూటర్ సహకార డిసైను, కంప్యూటర్ సహకార ఉత్పత్తి విధానం, పూర్తిగా కొరత నివేదించబడిన ఎల్‌టిటి, ఎస్‌ఎమ్‌పిఎస్, ఎమ్‌టిఎస్‌ఎఫ్‌ఇటి, ఎలక్ట్రానిక్ ట్యూనర్, కలర్ ఐసిలు అన్నియు ప్రపంచ ఖ్యాతిగాంచినవారిచే ఉత్పత్తి చేయబడినవి వాడటం.

## ◄CAT 1000 SE

అతి అందమైన హుందాగా అగుపించే రంగుల టి.వి.

## CAT 1000 DX ►

(రిమోట్ మోడల్)

డిజిటల్ సింథసైజర్ ట్యూనింగ్ మరియు 39 ప్రోగ్రాం జ్ఞాపకశక్తి

వేరుగా అమర్చిన CAT 1000 DX చేతి స్విచ్ సెట్టుకు ప్రోగ్రాం, బ్యాండు, ఛానలు, శబ్దం, రంగుల విచక్షణ, పరిశుభ్రత, మీకు ఏది కావలిస్తే అది మీరు ఉన్న చోటునుంచే సరిచేసుకునేందుకు మైక్రో ప్రోసెసరు కంట్రోల్ కలదు.




ప్రదర్శించిన బొమ్మ సహకారం: మిస్ గీతాంజలి అయ్యర్ మరియు సుజాతా ఫిలిమ్స్ లిమిటెడ్‌వారి 'అగ్నినక్షత్రం'లో స్టిల్లు.

Solidaire 10

# సాలిడైర్

Insight-S-287

కాలంను చూపించాడు అతనికి. "ఒక్కకాలంలోని ఒక్క సెంటిమీటరువిలువ ఇంతా అని లెక్కవేస్తారు. ఆకాలంలో సెంటిమీటర్ విలువ ఒక్కోపత్రికకు ఒక్కోవిధంగా ఉంటుంది. అదీ ఎడిషన్ ఎడిషన్‌కూ మారుతుంది. అంతేకాక కంబైన్డ్ ఎడిషన్ అయితే అత్యధికంగా ఉంటుంది. ఆ విలువలు నీవు నీకందించే టారిఫ్‌లో చూసుకోవచ్చు.

"పోతే-యాడ్ కొలత వన్ఇంటూఫైవ్ అంటారు. అంటే ఒక కాలం ఫైవ్‌సెంటీమీటర్స్ అన్నమాట. అదే టూఇంటూ ఫైవ్ అంటే రెండుకాలాలు ఫైవ్ సెంటీమీటర్స్ అన్నమాట. ఇప్పుడు ఒక కాలం ఫైవ్ సెంటిమీటర్స్ అన్నది ఇంచుమించుగా అన్ని దినపత్రికలలో మినిమమ్. ఒక్కోపేపర్ వన్ ఇంటూఫోర్ కూడా యాక్సెప్ట్ చేస్తుంది. ఒక కాలం సెంటిమీటర్ విలువ పదిహేనురూపాయలు అనుకుంటే, వన్ఇంటూఫైవ్ విలువ డెబ్బైఅయిదు రూపాయలు. అదే టూఇంటూఫైవ్ విలువ నూటయాభైరూపాయలు. అంటే కాలంఇంటూ సెంటిమీటర్స్ ఇంటూ రేట్ ఈక్వల్‌టూ టోటల్ కాస్ట్‌ఆఫ్ యాడ్.

ఏవరగా ఏదేనా ఒక పత్రికలో మన యాడ్ ఫస్ట్‌పేజీలోనే పబ్లిష్‌కావాలంటే సెంట్ పర్సెంట్ ఎక్స్‌ట్రా. అదే బేక్‌పేజీ అయితే ఫిఫ్టీ పర్సంట్ ఎక్స్‌ట్రా..."

ఆ అభ్యర్థి జాగ్రత్తగా వింటున్నాడు. రమేష్ కస్టమర్ల మనస్తత్వాల గురించి, వారి దగ్గర నుండి యాడ్ ఎలా రాబట్టాలి అన్న విషయం గురించి వివరంగా చెప్పాడు. ఆ తర్వాత వివిధ పత్రికల టేరిఫ్‌లు ముందుంచి ఒక్కోపత్రిక ఒక్కోఎడిషన్‌లో కాలం సెంటిమీటర్ విలువ ఎంతుందో వివరించి చెప్పాడు. గ్రే అంటే ఏమిటి--రివర్స్ అంటే ఏమిటో విశదీకరించాడు.

ఆ అభ్యర్థి కూడా తనకువచ్చిన అనుమానాలు అడిగి జవాబు తెలుసుకోసాగాడు.

అలా ఒక అర్ధగంట గడిచేసరికి ఎదుటివ్యక్తికి యాడ్‌గురించి ఒక సరియైన అవగాహన ఏర్పడింది. అతడు తన కస్టమర్‌కు పబ్లిసిటీ గురించి వివరంగాచెప్పి, యాడ్ పట్టుకురాగలుగుతాడనిపించింది రమేష్‌కు.

"ఎనీ మోర్ డౌట్స్" అడిగాడు రమేష్.

"నోసర్" చెప్పాడా వ్యక్తి.

"ఏదయినా అనుమానంవస్తే సంకోచపడకుండా నన్నడుగు- నీ అనుమానాన్ని నివృత్తి చేయగలను"

"యస్సార్"

"ఇక చివరిగా ఒక మాట- ఈ బిజినెస్ ఫీల్డ్‌లో వ్యక్తికి కావలసింది వాక్చాతుర్యం. తన మాటతో ఎదుటివాడిని ఆకట్టుకోవాలి. అతడిని ఒప్పించి, మన బిజినెస్ మనం రాబట్టుకోగలిగి ఉండాలి"

"ఓకే...సర్" అన్నాడతను.

"ఇట్సాల్ యూకెన్‌గో"

అతడు తలుపు తీసుకుని వెళ్ళిపోయాడు. అతడి వెనుకే ఆ గది స్ప్రింగ్‌డోర్ మెల్లగా మూసుకుపోయింది.

* * *

"హలో అశోక్! సిస్టర్ ఊర్నించి ఇంకారాలేదా?"

"రేపు వస్తుంది రమేష్"

"ఈరోజు మన రాజేంద్ర పెళ్లి ఉందికదా! ఆ పెళ్లికి బయలుదేరాను. నువ్వూ పెళ్లికి వస్తున్నావు కదా!"

"రాక తప్పుతుందా? ఒకనాటి క్లాస్‌మేట్ కదా!"

"గుడ్! అయితే మనం పెళ్లిలో కలుద్దాం" ఫోన్ పెట్టేసాడు రమేష్.

త్వరగా టాయ్‌లెట్‌అయి ఇవతలకువచ్చాడు. జానకమ్మ అడిగింది. "ఎనిమిది గంటలకే ఆఫీసుకు బయలుదేరావా?"

"లేదమ్మా! ఈరోజు ఒక మిత్రుడి పెళ్లి ఉంది. అది చూసుకుని అటునుండి అటే ఆఫీసుకు వెళ్తాను"

ఆమె దీర్ఘంగా నిట్టూర్చింది. "నీవయస్సువారందరివీ పెళ్లిళ్లు అయిపోతున్నాయి కానీ నీ పెళ్లిచూసే భాగ్యమే నాకులేదు"

తల్లి మాటలకు జవాబు చెప్పలేదు రమేష్. మౌనంగా నిలబడిపోయాడు.

జానకమ్మ తిరిగి అంది- "సరే! టిఫిన్ చేసి వెళ్లు"




"లేదమ్మా... పెళ్లి దగ్గర టిఫిన్ చేయాలి. తప్పదు"

ఆమె మౌనంగా వుండిపోయింది.

"వస్తానమ్మా"

అతడు బయటకు నడిచాడు. స్కూటర్ స్టార్ట్ చేశాడు.

కళ్యాణమండపం చేరుకునేటప్పటికే అక్కడ పెళ్లిసందడి కనిపిస్తోంది. స్కూటర్ పార్క్‌చేసి ఆ జనంవైపు నడిచాడు రమేష్. పరిచయస్తులు కొందరు అతడిని విష్ చేశారు. వారందరినీ నవ్వుతూనే విష్ చేశాడతను.

"హలో రమేష్" దగ్గరగా వచ్చాడు అశోక్.

"హాయ్... ఇప్పుడేనా రావడం"

"జస్ట్ పదినిముషాలు" ఇద్దరూ లోపలికి నడిచారు.

పెళ్ళిపీటలమీద కూర్చుని వున్నారు వధూవరులిద్దరూ. సాధారణంగా ఏ ఆడపిల్లవైపు అంత పరీక్షగా చూడడతను. కాని ఎందుకో ఆ క్షణం అతడు ఆ పెళ్లికూతురివైపు పరిశీలనగా చూశాడు.

ఆమె వయస్సు పాతికేళ్లు వుంటుంది. ఒక అమ్మాయి పాతికేళ్లవరకూ పెళ్లి చేసుకోలేదంటే కారణమేమయివుంటుంది. ఒకటి- ఆ అమ్మాయి తల్లిదండ్రులు కట్నం ఇచ్చుకోగలిగిన స్తోమతలేనివారయి వుంటారు. ఆ ధనం సమకూర్చుకోవడంలో వారికి ఆలస్యమయి వుంటుంది. అందుకే ఆమె పెళ్లి ఆలస్యంగా చేస్తున్నారు.

రెండో కారణం. ఆమెకు పెళ్లంటే ఇష్టం లేకపోయి ఉండొచ్చు. కాని కాలక్రమేణా ఆమెకు తెలిసింది పెళ్లి అన్నది ఒక తప్పనిసరి చర్య అని, ఆ తప్పు జీవితంలో ఒకసారయినా చేయాలని- అందుకే ఇలా పెళ్లి చేసుకుంటూ వుండొచ్చు.

ఇక మూడవ కారణం- ఆమె ఎవరినైనా ప్రేమించివుండొచ్చు. ఆ ప్రేమలో విఫలమయింది. అందుకే ఇక తప్పదని ఆమె తన జీవితంలోనికి మరొకరిని ఆహ్వానించింది.

అతనికి ఫేస్ రీడింగ్ బాగా తెలుసు. అతడు ఆమె కళ్లలోనికి పరీక్షగా చూశాడు. ఆమె కళ్లలో అతనికి కనుపించింది ఒక్కటే- అడ్జస్ట్‌మెంట్. ఎదుటివ్యక్తి ఎవరో కొద్దినిమిషాలవరకూ తనకు తెలియదు. అతనితో ఎలాంటి పరిచయమూ లేదు. తల్లిదండ్రులు తనను ఆజ్ఞాపించారు- 'నువ్వు ఫలానా వ్యక్తిని పెళ్లి చేసుకోమని, ఆ పెళ్లి ద్వారా అతనితో జీవితం పంచుకోమని, అతని తరఫున బిడ్డల్ని కనివ్వమని, అతనికి ఉచితంగా వండిపెట్టమని, అతనికి పడకసుఖం అందివ్వమని'- అందుకామె అడ్జస్ట్ అయింది. పెద్దల మాటను అంగీకరించింది.

ఇంతకీ ఎందుకామె అడ్జస్ట్ కావడం? పెళ్లి అన్నది కంపల్సరీ అని ఆమె అనుకున్నదా? తల్లిదండ్రులు కట్నం ఇవ్వలేరు- తను పెళ్లి చేసుకోవడం ఆపెయ్యవచ్చుకదా! పెళ్లంటే ఇష్టంలేదు- పెద్దల్ని ఎదురించవచ్చుకదా! ఎందుకిలా ప్రతిమనిషీ పెళ్లి దగ్గర అడ్జస్ట్ అవుతున్నాడు?

ఆ పెళ్లికూతురు తన కాబోయే భర్తవంక ప్రేమగా చూడడంలేదు. కేవలం నిస్తేజమైన చూపులతో అప్పుడప్పుడూ అతడివంక చూస్తోంది. ఆ పెళ్లికూతురే రేపు ఆ వ్యక్తితో జీవితమంతా అడ్జస్ట్ అయిపోతుంది? లోకం కోసమా? సెక్స్ కోసమా? పిల్లల కోసమా? లేక తోడు కోసమా?

ఒక స్త్రీ పెళ్లి అన్న విషయంలో ఎందుకింతగా అడ్జస్ట్ అవుతుంది?

"ఏమిటి ఆలోచిస్తున్నావు?" అడిగాడు అశోక్.

"ఏంలేదు" నవ్వాడు రమేష్.

"రా- టిఫిన్ చేద్దాం"

మౌనంగా అతడిని అనుసరించాడు రమేష్.

విశాలమైన హొటల్ టేబుల్స్‌మీద అమర్చబడిన టిఫిన్ ప్లేట్స్‌ను ఆహూతులు అందుకుని తింటున్నారు. మరోపక్క పెళ్లి జరిగిపోతూ వుంది.

ఆ పేపర్‌ప్లేట్స్ అందుకుని తనొకటి తీసుకుని, రమేష్‌కొకటి ఇచ్చాడు అశోక్.

ఇద్దరూ టిఫిన్ తిని కాఫీ తాగి ఇవతలికి వచ్చారు. అప్పుడే పూజారి అందరికీ అక్షతలు పంచుతున్నాడు. వారిద్దరూ చేతులు చాపి ఆ అక్షతలు అందుకున్నారు.



పూజారి వధూవరుల ఎదురుగా కూర్చున్నాడు. కొద్దిసేపటికి మంగళవాద్యాలు తీవ్రస్థాయిలో మోగసాగాయి. వరుడు పైకిలేచి వధువు మెడలో తాళి కట్టసాగాడు.

ఎందుకో ఆ క్షణం రమేష్ చిన్నగా నిట్టూర్చాడు. 'ఎందుకో తెలియకనే- ఏ ప్రయోజనం ఆశించో అర్థంకాకనే రెండు జీవితాలు ఒకదానితో ఒకటి పెనవేసుకున్నాయి'

అతడి చేతిలోని తలంబ్రాలు అప్రయత్నంగా నేలజారాయి.



"హలోసర్"

"హలో హరితా! సిడౌన్"

"సార్! నేనొక పెద్ద యాడ్ తెచ్చాను" ఆమె కంఠంలో ఉత్సాహం కొట్టొచ్చినట్టు కనిపించింది.

"పెద్ద యాడా" ముందుకి వంగాడు రమేష్.

"యస్ సర్! బేక్ ఆఫ్ ది పేజీ మూడు పేపర్లకి ఆంధ్రాలోని మొత్తం ఎడిషన్‌లు"

"ఈజిట్" అతని నాలుగేళ్ల సర్వీసులో వస్తున్న మొట్టమొదటి అతిపెద్ద యాడ్- "ఎవరు ఇచ్చింది" అడిగాడు రమేష్.

"కె.యమ్.టి ట్రాన్స్‌పోర్ట్‌వారు. ఈ సంస్థ గత పది సంవత్సరాలుగా నడుస్తోంది. కాబట్టి మనం నమ్మవచ్చు"

"సంస్థను నమ్మవచ్చు. కాని ఇది చాలా పెద్దమొత్తం. మనం ఇంతవరకూ ఐదు, పదివేలు మాత్రమే పత్రికలకు క్రెడిట్‌పెడుతూ వచ్చాం. ఇప్పుడు ఇంతపెద్ద మొత్తం..."సాలోచనగా అన్నాడు రమేష్.

హరిత వెంటనే అందుకుంది- "చాలా పెద్దమొత్తం కాబట్టి మనకు కమీషన్ కూడా పెద్దగానే వస్తుందికదా సార్. కాబట్టి మీరు కొంత డబ్బు ఇతరుల దగ్గర నుండి తీసుకోండి. కొంతమొత్తాన్ని ప్రెస్‌వారికి క్రెడిట్ పెట్టండి"

"యూ ఆర్‌రైట్" తలూపాడు రమేష్.

అతడు ఆమె చేతిలోని మేటర్ తీసుకుని చదివాడు. ఆ ట్రాన్స్‌పోర్ట్ సంస్థ పదవ వార్షికోత్సవం జరుపుకుంటున్న సందర్భంగా తమ ఖాతాదారులకు శుభాభివందనములు తెలుపుకుంటోంది.

రమేష్ చేతిలోని మేటర్ ఆమెకందించాడు. అతడికి చాలా ఆనందంగా ఉంది. అది పెద్దయాడ్. తన సంస్థకు పత్రికారంగంలో పేరుతెచ్చే యాడ్. కమీషన్ కూడా భారీయెత్తున వస్తుంది.

రమేష్ ఆమెవంక తిరిగాడు- "మొత్తానికి మనసంస్థకు పేరుతెచ్చే యాడ్ పట్టుకొచ్చావు. ఈ కేష్ నాచేతికి రాగానే నీకొకమంచి బహుమతి ఇస్తాను"

"థాంక్యూసార్" చెప్పిందామె.

"బైదిబై - ఇంతకీ వారు మన పేమెంట్ ఎప్పట్లోగా ఇస్తారట?"

"యాడ్‌పబ్లిష్ అయినరోజు పేపర్‌కటింగ్ వారికి అందించగానే పేమెంట్‌లో సగం పేచేస్తారట. మిగిలిన సగం ఈ నెల ఇరవైఐదో తారీఖున ఇస్తారట. అంటే మరో పన్నెండురోజులు గడువుంది"

"పేమెంట్ గురించి నీకెలాంటి అనుమానంలేదుకదా?" ప్రశ్నించాడు రమేష్.

"లేదు సర్- ఆ సంస్థ మనరాష్ట్రంలోని ట్రాన్స్‌పోర్ట్ కంపెనీలలో పేరున్న పదింటిలో ఒకటి. ఆ సంస్థకు మనరాష్ట్రంలోని అన్నినగరాలలో, పట్టణాలలో బ్రాంచీలున్నాయి. దాని మేనేజింగ్ డైరెక్టర్ చాలా పెద్దమనిషి. నమ్మకస్తుడు. కాబట్టి మనం అనుమానించాల్సిన అవసరం ఏమీలేదు. అసలు ఆ సంస్థ మనకు యాడ్ ఇవ్వడమే గొప్ప. అది మనసంస్థకు ఎంతోపేరు. అలాంటి కష్టమర్స్ మనకు ఒకరిద్దరున్నా చాలు" అంది హరిత.

'నిజమేనన్నట్టుగా' తలూపాడు రమేష్.

"అయినా ఎందుకో ఒకసారి ఆ మేనేజింగ్ డైరక్టర్‌ని కలుసుకోవాలనిపిస్తోంది. ఈ రోజు సాయంత్రం మనం ఏదయినా గిఫ్ట్ తీసుకుని అతనిని కలుసుకుందాం. అతనికి 'థాంక్స్' చెప్పుకుంటున్నట్టుగానే కలుసుకుని, నేను మరోసారి మన కేష్‌పేమెంట్ గురించి అడిగి చూస్తాను - ఏమంటావు?"

"మీకు ఆ సంస్థమీద అంత అనుమానంగా ఉంటే అలాగే కానివ్వండి" చెప్పింది హరిత.

రమేష్ తలూపాడు. అతడికి ఆ సంస్థమీద అనుమానంలేదు. కాని తను తీసుకోబోయేది చాలాపెద్ద రిస్కు. వారు ఇచ్చిన యాడ్‌కు సరిపడేలా డి.డి.లు పంపేందుకు తన దగ్గర తగిన పెట్టుబడిలేదు. తన మొత్తం పెట్టుబడి ప్రస్తుతం యాభైవేల వరకూ ఉంటుంది. లక్ష రూపాయలకు మించిన ఆ యాడ్‌కు పెట్టుబడి ఎలాగోలా తేవచ్చు. అంతగా డబ్బు తగ్గితే పత్రికలకు చెక్ పంపవచ్చు.

"ఒకే... హరితా! సాయంత్రం మనం అతనిని కలుసుకుని వద్దాం"

"అలాగేసర్"

ఆ సాయంత్రం ఇద్దరూ ఆటోలో కె.యు మ్.టి ట్రాన్స్‌పోర్ట్ ముందు ఆగారు.

ఆ మేనేజింగ్ డైరక్టర్ గదిముందు ఆగి, అక్కడ ఉన్నప్యూన్ చేతముందుగా తన విజిటింగ్‌కార్డు పంపాడు రమేష్. వెంటనే లోపలికి రమ్మన్న పిలుపు వచ్చింది.

హరిత, రమేష్ ఇద్దరూ లోపలికి వెళ్ళారు.

ఎదురుగా రివాల్వింగ్ ఛెయిర్‌లో కూర్చుని ఉన్నాడో అజానుబాహువుడు. బట్టతల, పెద్దకళ్ళు, తేజస్సు కలిగిన ముఖం. అతని పేరు కృష్ణారావు.

"కూర్చోండి" సీట్ ఆఫర్ చేశాడాయన.

"థాంక్యూసార్" ఆయన ఎదురుగా కూర్చున్నారు వారిద్దరూ. ఆయన కాలింగ్‌బెల్ కొట్టి, వచ్చిన బాయ్‌కి రెండు ట్రీ చెప్పి పంపాడు.

"ఇంతపెద్ద యాడ్ మాలాంటి చిన్న సంస్థకు అప్పగించి మీ సహృదయం చాటుకున్నారు" వ్యాపారతీరు ప్రదర్శించాడు రమేష్.

ఆయన నవ్వలేదు, మెల్లగా తలూపుతూ అన్నాడు; "మేము మా యాడ్ ఇచ్చేందుకు అదిపెద్దసంస్థా లేక చిన్న సంస్థా అని చూడలేదు. ఆ అమ్మాయి వచ్చింది. యాడ్‌కోరింది. మేమూ మా సంస్థ తరఫున అప్పుడే యాడ్ ఇచ్చేందుకు ప్రయత్నిస్తున్నాం. సమయానికి ఆమె రావటం మీ లక్... దట్సాల్"

"ఇది మా లక్కే కాని యాడ్ ఇవ్వబోయే ముందు అది చిన్న సంస్థా? లేక పెద్ద సంస్థా అని ఆలోచించకనే ఇచ్చారన్నది మీ గొప్పతనం"

ఆయన బదులివ్వలేదు.

"ఇలాంటి గొప్ప అవకాశం మాకు కలుగచేసినందుకు ప్రతిగా ఈ చిన్న బహుమతి..." చేతిలోని గిఫ్ట్ ప్యాకెట్ ఆయన చేతికి అందించాడు.

"ఓ... ఇలాంటివన్నీ..." మొహమాటపడ్డాడతను.

"పర్వాలేదుసార్... ఇది మా ఆనందాన్ని తెలుపుకునేందుకు ఇస్తున్న చిరుకానుక" చెప్పాడు.

కృష్ణారావు ఆ ప్యాకెట్‌ను తీసి లోపల పెట్టుకున్నాడు.

కొద్దిసేపు ఇరుసంస్థల గురించి సంభాషణ జరిగిన తర్వాత రమేష్ మెల్లగా తను చెప్పదలచుకున్న విషయం చెప్పాడు... "సార్... మాది చాలా చిన్న కంపెనీ. ఇప్పుడు మీరు ఇచ్చిన యాడ్‌కు డబ్బు చాలాచోట్ల సర్ది పత్రికలకు పంపాలి. కాబట్టి మీరు పేమెంట్ లేట్ చేయకండి"

"అదేంమాట... మీరు యాడ్ చూపించిన మరుక్షణం హాఫ్ అమౌంట్‌కి చెక్ ఇస్తాను. మిగిలిన మొత్తం మరో పన్నెండురోజులలో పే చేస్తాను .ఏమంటారు ?"

"అలా అయితే పెద్ద ఇబ్బందేం లేదు సార్"

"ఒకే... యాడ్ మాత్రం చాలా అట్రాక్టివ్‌గా రావాలి"

"చూస్తారుగా" చెప్పాడు రమేష్.

మరికొద్దిసేపు తర్వాత వారిద్దరూ ఆయన దగ్గర శెలవు తీసుకొని ఇవతలకు వచ్చారు.

ఆ బిల్డింగ్ ఇవతలకు వచ్చిన తర్వాత హరిత అడిగింది- "ఇప్పటికైనా ఈ సంస్థమీద




మీకు నమ్మకం కుదిరిందా సార్?"

"చాలా పెద్ద సంస్థ ఇది. సంస్థ మీద నమ్మకం లేక కాదు, నేనిలా వచ్చింది. వారికి మన సంస్థ పరిస్థితి గురించి చెప్పుకుని ప్లీజ్ చేయడం ద్వారా పేమెంట్ తొందరగా రాబట్టుకోవాలని... పేమెంట్ తొందరగా వస్తుందన్న నమ్మకం నాకు కుదిరింది"

"నేనిటునుండి ఇంటికి వెళ్తాను సార్"

"అలా హొటల్‌కెళ్ళి టిఫిన్ చేసి వెళ్దాంరా"

ఇద్దరూ ఎదురుగా ఉన్న హొటల్‌కెళ్ళారు. సప్లయర్ రాగానే తనకు కావలసినవి తాను ఆర్డర్ ఇచ్చి, ఆమెకు కావలసినవి ఆమెను ఆర్డర్ ఇవ్వమన్నాడు. హరిత ఐస్‌క్రీమ్ ఆర్డర్ ఇచ్చింది.

సప్లయర్ ఐటమ్స్ అన్నీ తెచ్చిపెట్టాడు.

"**తినండి**" చెప్పాడు రమేష్.

**ఆమె ఐస్‌క్రీమ్** దగ్గరకు లాక్కుని, మెల్లగా తినసాగింది. రమేష్ తను తెప్పించుకున్న టిఫిన్‌మీద పడ్డాడు.

ఐస్‌క్రీమ్ చప్పరిస్తున్న హరిత ఎందుకో తలెత్తి అతడివంక చూసింది. అతడు మౌనంగా తలొంచుకుని తన టిఫిన్ తాను తింటున్నాడు.

అతడిని చూస్తే ఆమెకు నవ్వొచ్చింది. 'ఈ కాలంలో పుట్టాల్సిన మగాడు కాదు' అనుకుంది. 'ఎంత బిజినెస్‌మెన్ అయినా ఎదుట ఓ ఇరవై ఏళ్ళ అమ్మాయి కూర్చుని ఉంటే కనీసం మాట్లాడించటం కూడా తెలియదు. ఒట్టి పప్పుముద్ద ఆ విషయంలో.' మనసులోనే అనుకుని నవ్వుకుందామె.

ఇద్దరి టిఫిన్ పూర్తయింది. రమేష్ బిల్లు అందుకుని, బిల్లుకు సరిపడా మొత్తం ప్లేట్‌లో వేశాడు. ఇద్దరూ బయటకు నడిచారు.

"ఒకే. మీరు రేపుదయాన్నే ఆర్టిస్టుకు ఆ మేటర్ అందించి, వర్క్ చాలా నీట్‌గా చేయమని చెప్పండి"

"అలాగే సార్"

"గుడ్‌బై" అతడు తన స్కూటర్ స్టార్ట్ చేశాడు. ఇద్దరూ విడిపోయారు.

★ ★ ★

"హలో అశోక్! నాకో ఐదువేలు కావాలి"

"ఎందుకు?" అవతలివైపు నుండి అశోక్ అడిగాడు.

"కె.యమ్.టి. సంస్థ నుండి పెద్ద యాడ్ వచ్చింది. దానికి నా దగ్గరున్న డబ్బు చాలదు. అందుకే వీలయిన చోటల్లా అప్పు తీసుకువస్తున్నాను" చెప్పాడు రమేష్.

"అప్పుచేసి వ్యాపారం చేయకురా. అది మంచిదికాదు" అన్నాడు అశోక్.

"అది నాకూ తెలును. కాని ఈ రోజు ఈ రిస్క్ తీసుకోకపోతే అతి పెద్ద యాడ్‌ను, పెద్ద మొత్తం కమీషన్‌ను కోల్పోతాం"

అవతలివైపునుండి కొద్దిసేపు నిశ్శబ్దం... "సరే సాయంత్రం వచ్చి తీసుకో" చెప్పాడు అశోక్.

"సరిగ్గా ఐదుగంటలకల్లా నేను అక్కడ ఉంటాను" ఫోన్‌పెట్టేశాడు రమేష్.

తనకు కావలసిన మొత్తం డబ్బు సమకూరింది. కొంత క్రెడిట్ ఎలాగూ పత్రికలు అంగీకరిస్తాయి. సో! మనీ ప్రాబ్లమ్ తీరిపోయింది.

అతడు ఆర్టిస్టును, పిలిపించాడు. అతడు డిజైన్‌చేసిన యాడ్‌ను పట్టుకువచ్చాడు. ఆ డిజైన్‌చూశాడు రమేష్. చాలా బాగా కుదిరింది.

"రేపుదయం యాడ్‌ను ప్రెస్‌కి పంపిస్తున్నాము" అతనితో అన్నాడు రమేష్.

"ఈ యాడ్‌తో మన సంస్థకు మంచిపేరు వస్తుందిసార్" తలూపాడు రమేష్. ఆర్టిస్టు వెళ్ళిపోయాడు.

హరిత ఆఫీసుకు వచ్చిన వెంటనే కొంత డబ్బు పంపి బ్యాంక్ నుండి డి.డి.లు తెప్పించాడు. డిజైన్‌ను జిరాక్స్ కాపీలు తీయించి తెప్పించాడు. కొంత మొత్తానికి చెక్కులు రాసి పెట్టాడు.

ఆ మర్నాడు ఉదయం ఆ యాడ్‌ను పత్రికలకు పంపేందుకు రెడీచేశారు.

★ ★ ★

ఉదయం పదిన్నరకు మరికొంత డబ్బుకు డి.డి.లు తీసి జతచేశారు. మూడు జిరాక్స్ కాపీలు మూడుకవర్లలో ఉంచి ఒకటి హరి

తకు, మరోటి ఆర్టిస్ట్‌కు, ఇంకొకటి మరో ఎగ్జిక్యూటివ్‌కు అందించాడు రమేష్. వారు దానిని తీసుకెళ్ళి పత్రికాఫీసులకు అందివ్వాలి.

వారు ఆ కవర్లు తీసుకుని వెళ్ళిపోయారు.

యాడ్‌ను పత్రికలకు పంపిన తర్వాత రిలాక్సింగ్‌గా ఫీలయ్యాడు రమేష్.

వ్యాపారికి రిలాక్స్ అన్నది క్షణికమే. ఒక రిస్క్ తీరినవెంటనే రిలాక్స్‌గా ఫీలయినా, అప్పటికే మరో రిస్క్ అతని ముందు సిద్ధంగా ఉంటుంది. మళ్ళీ ఆ రిస్క్‌ను ఎదుర్కోవాలి.

యాడ్ పంపిన తర్వాత అది ఎలా పబ్లిష్ అవుతుందోనని ఆందోళన పడసాగాడు రమేష్.

* * *

యాడ్స్ పబ్లిష్‌కావడం రొటీన్ అయిన తర్వాత ఎప్పుడూ పదిగంటలకు ఆఫీసుకు వచ్చేవాడు రమేష్. కాని ఆరోజు ఎనిమిది గంటలకే ఆఫీసుకు వచ్చాడు. అంతకు ముందే అతడు ఇంట్లోనే పేపర్స్ అన్నీ తిరగేశాడు. యాడ్ అన్నీ పత్రికలలో చాలా చక్కగా పబ్లిష్ అయింది.

ఎనిమిదిన్నరకు హరిత వచ్చింది. "నీకోసమే ఎదురుచూస్తున్నాను" ఆమెను చూసి చెప్పాడు రమేష్.

"కొద్దిగా లేటయింది సార్"

"ఫర్వాలేదు.ఇవిగో పేపర్‌లు. యాడ్ చాలా చక్కగా పబ్లిష్ అయింది చూశావు కదా!"

"ఇంటిదగ్గరే చూశాను సార్"

"గుడ్...దెన్ నువ్విపుడు పేపర్స్ తీసుకువెళ్ళి కృష్ణారావుగారికి చూపించు. ఆయన కేష్ ఇచ్చినా, చెక్కు ఇచ్చినా పట్టుకుని వచ్చెయి" చెప్పాడు రమేష్ పేపర్స్ అందిస్తూ.

"అలాగే సర్" అతడి చేతిలోని పేపర్స్ అందుకుని పైకిలేచిందామె.

"త్వరగా వచ్చెయ్యి- నేను నీకోసం ఎదురు చూస్తుంటాను"

తలూపి, ఆగది నుండి బయటకు నడిచింది హరిత.



కుర్చీలో వెనక్కువాలి, ఆ రోజు పేపర్లోని న్యూస్ చదవసాగాడతను. ఎప్పుడు కూడా పేపర్ తీసుకున్న వెంటనే అతడు మొదట చూసేది యాడ్స్. ఏ కంపెనీ యాడ్స్ ఎన్ని పబ్లిష్ అయ్యాయి అన్నదీ, పోటీసంస్థలు తమ కన్నా ముందున్నాయా, వెనుకబడ్డాయా- అన్న విషయం. ఆ తర్వాతే అతడు పేపర్‌లోని న్యూస్ చూస్తాడు.

సుమారు రెండుగంటలపాటు అతడు హరిత కోసం ఎదురుచూస్తూ గడిపాడు.

పదిన్నరకు హరిత చిరునవ్వుతో అతని గదిలోనికి వచ్చింది. "సార్! కృష్ణారావుగారు సగం మొత్తానికి చెక్ అందించారు"

"మనకు ఏదయినా ఒకటే" అతడు ఆ చెక్ చేతిలోనికి తీసుకున్నాడు. ఒకసారి ఆ చెక్‌లోని మొత్తంవంక తృప్తిగా చూసి, తిరిగి ఆమె వంక చూసాడు. "హరితా... నువ్వీ చెక్ తీసుకెళ్ళి నా అకౌంట్‌లో వేసెయ్యి. క్లియర్ అయి వచ్చేటప్పటికి మరోరోజు పడుతుందేమో!" అన్నాడు రమేష్.

"అవును సర్"

"చెక్ క్లియర్ అయి రాగానే మొదట తెచ్చిన అప్పులు కట్టెయ్యాలి. ఇలా బదులు తీసుకున్న మొత్తాలు మనకు ఇబ్బందికరంగా అనిపిస్తాయి"

"కరక్ట్ సార్"

రమేష్ రూమ్ బాయ్‌ని పిలిచి రెండు టీ చెప్పాడు. టీ తాగిన తర్వాత హరిత పైకి లేచింది- "వెళ్ళొస్తాను సార్"

"అలాగే"

హరిత వెళ్ళిపోయింది.

రమేష్ తృప్తిగా నిట్టూర్చాడు. తమ సంస్థకు అతి పెద్ద యాడ్ లభించింది. దానిని చాలా చక్కగా పబ్లిష్ చేసారు. రావలసిన మొత్తంలో సగం వచ్చేసింది. తన తలమీద భారం ఇంచుమించుగా తగ్గిపోయినట్టుగా భావించాడు అతడు.

పూర్తి మొత్తం తన చేతికి రాగానే స్టాఫ్ అందరికీ పార్టీ ఇవ్వాలి. ముఖ్యంగా హరితకు ఏదయినా గిఫ్ట్ అందించాలి. పాపం! ఆ అమ్మాయి చాలా కష్టపడింది. నిజం చెప్పాలంటే ఈ యాడ్ ఆమె స్వశక్తితో తెచ్చిందే!

అతడలా బిజినెస్ గురించి ఆలోచి

స్తుండగా హటాత్తుగా ఏదో గుర్తొచ్చింది అతడికి- తను ఉదయం నుండి టిఫిన్‌చేయలేదని. కాని అతడికి ఆకలిగా అనిపించలేదు. తన బిజినెస్‌లోని ప్రోగ్రెస్ తలచుకుంటుంటే, కడుపు నిండిపోయినట్లుగా అనిపించసాగింది.

★ ★ ★

స్కూటర్‌ని అశోక్ ఇంటి ముందు ఆపాడు రమేష్. స్కూటర్ శబ్దం విని బయటకు వచ్చిన అశోక్ భార్య రమేష్‌ను చూసి చిరునవ్వుతో విష్ చేసింది.

"ఏమ్మా లక్ష్మీ! ఎప్పుడొచ్చావు?" స్కూటర్ స్టాండ్ వేస్తూ అడిగాడు రమేష్.

"మూడు రోజులయింది అన్నయ్యా" చెప్పిందామె.

"ఇంతకీ మావాడింట్లోనే ఉన్నాడా?" లోపలికి నడుస్తూ అన్నాడతను.

"స్నానం చేస్తున్నారు. పిలుస్తాను. మీరు కూర్చోండన్నయ్యా"

"అంత అర్జెంట్ పనేం లేదులే. ఆఫీసు నుండి తిరిగి వెళ్తూ ఇటొచ్చాను" కుర్చీలో కూర్చున్నాడు.

"ఆయనా ఇప్పుడే ఆఫీసు నుండి వచ్చారు. టీ తాగి, బాత్‌రూమ్‌లో దూరారు" అనేసి అవతల గదిలోనికి వెళ్లింది లక్ష్మి.

రమేష్ కుర్చీలో కూర్చుని, వెనక్కువాలాడు. టీపాయ్ మీదున్న పేపర్ అందుకుని చూడసాగాడు. మొదటి పేజీలోని వార్తలు ఒకసారి చూసి, పేపర్ వెనక్కు తిప్పాడు. బేక్‌పేజీలో అర్థపేజీ నిండుగా ఉంది, తన సంస్థ ప్రచురించిన యాడ్. ఆ యాడ్ చూస్తుంటే అతని మనస్సుకెంతో తృప్తిగా ఉంది.

"హలో రమేష్! ఇప్పుడేనా రావడం" తల తుడుచుకుంటూ వచ్చాడు అశోక్.

"జస్ట్ వన్ మినిట్" పేపర్‌ను పక్కన పడేశాడు రమేష్.

లక్ష్మి రెండు కప్పుల్లో టీ తీసుకువచ్చి చెరొక కప్పు ఇచ్చింది. వారి పక్కనే ఉన్న కుర్చీలో కూర్చుంది.

"కె.యమ్.టి. వారు యాడ్‌కు చెక్కు ఇచ్చారా?" అడిగాడు అశోక్.

"ఇచ్చారు. క్లియరెన్స్ కోసం బేంక్‌లో వేశాను" చెప్పాడు రమేష్.

"నిన్న నువ్వుఫోన్ చేసి డబ్బు కావాలన్నావు. నా బేంక్ బేలన్స్ నిల్. మొన్న ఫ్లాట్ కొనుగోలుకే నా బేంక్ బేలన్స్, మీ సిస్టర్ నగలు అన్నీ కలిపి డబ్బు చేసి ఆ ఫ్లాట్ కొనేసాను. నువ్వేమో డబ్బు కావాలని ఫోన్ చేశావు. ఎప్పుడూ అడిగినవాడివి కాకపోతివి. అందుకే మీ సిస్టర్‌ని వాళ్ళ అక్కయ్య వారింటికి పంపించి, వాళ్ళు స్థలం కొనుగోలు కోసం ఉంచిన డబ్బు తెప్పించాను"

"అలాగా. చాలా రిస్కు తీసుకున్నావు"

"ఫర్వాలేదు...రేపొచ్చేస్తాయి కదా!"

"ఒక్కరోజులో క్లియర్ అయిపోతుంది. రేపు మధ్యాహ్నం మీకు పంపించేస్తాను" ఆ సంభాషణ అతనికి అనీజీగా ఉంది. అందుకే టాపిక్ మార్చాడు.

"అన్నట్టు ఇల్లు కన్‌స్ట్రక్షన్ ఎప్పటినుండి మొదలుపెడతావు?" అడిగాడు రమేష్.

"మనీ ప్రాబ్లమ్. ఉన్న డబ్బంతా ఫ్లాట్ కొనుగోలుకే వెచ్చించాను. ఇక ఇల్లు కట్టుబడికి ఏదైనా లోన్‌కి అప్లయ్ చేయాలి" చెప్పాడు అశోక్.

"అదే సరయినది" అన్నాడు రమేష్.

మరికొద్దిసేపు అక్కడే కూర్చుని, అనవసర సంభాషణ జరిపాక రమేష్ అక్కడ నుండి లేచి ఇవతలకు వచ్చి స్కూటర్ స్టార్ట్ చేశాడు. స్కూటర్ ఇంటిదారి పట్టింది.

నిజానికి అతనికి ఇంటికి వెళ్లాలనిలేదు. ఇంటికి వెళితే తల్లి ముభావం అతడిని బాధిస్తుంది. శ్వేతను కాదన్నప్పటి నుండి ఆమె ప్రవర్తన బాధాకరంగా మారిపోయింది.

ఇంటికి వెళ్లాలని లేకపోయినా వెళ్లక తప్పదు. ఏ సమయానికైనా ఎంత పొద్దుపోయినా గూటికి చేరవలసిందే! మరలాంటప్పుడు ఎంతసేపని తప్పించుకుని దూరంగా పారిపోగలడు.

ఎందుకో తెలియదు- తనకు కష్టాలు మొదలయ్యాయేమో అనిపించింది రమేష్‌కు. 'ఛా ఛా... తనకు కష్టాలు ఎందుకొస్తాయి. కాకపోతే తన మీద కోపంతో అమ్మ రెండురోజులు బాధపెడుతుంది. అంతే' - తన మనసుకు తానే




నర్థి చెప్పుకున్నాడు రమేష్.

★ ★ ★

హరిత తన గదిలోనికి రాగానే యాభైవేల చెక్కు ఇచ్చి, బేంక్‌కు వెళ్లి డ్రా చేసుకు రమ్మన్నాడు రమేష్.

హరిత చెక్కు తీసుకుని బేంక్‌కు వెళ్లింది.

రమేష్ ఫైల్స్ చూసుకుంటూ కూర్చుని, ఆమె రాక కోసం ఎదురు చూడసాగాడు.

హరిత డబ్బు తీసుకుని రాగానే ముందు చేబదులుగా తీసుకున్న మొత్తాలు వెంటనే కట్టేయాలని, ఎవరి డబ్బు వారికి పంపేయాలని ఆలోచించసాగాడు. ఈలోగా ఒక ఎగ్జిక్యూటివ్ రెండు యాడ్స్ తీసుకుని వచ్చాడు. వాటిని సరిచేసి, డిజైన్ కోసం ఆర్టిస్ట్ దగ్గరకు పంపాడు రమేష్.

ఆ ఎగ్జిక్యూటివ్ తిరిగి ఫీల్డ్ మీదకు వెళ్ళిపోయాడు. రమేష్ హరిత కోసం వెయిట్ చేయసాగాడు.

సుమారు పన్నెండు గంటల ప్రాంతంలో హరిత కంగారుగా అతని గదిలోనికి అడుగుపెట్టింది. ఖాళీ చేతులతో తన గదిలోనికి అడుగుపెట్టిన ఆమెను చూడగానే తానూ కంగారుపడిపోయాడు రమేష్. "ఏమైంది హరితా?"

"సార్... చెక్కు తిరిగి వచ్చిందంట. కె.యమ్.టి.వారి అకౌంట్‌లో ఐదువేలకు మించి బేలన్స్ లేదట"

"ఈజిట్" అతడి గొంతు ఆందోళన వ్యక్తం చేసింది.

అతడు వెంటనే కె.యమ్.టి. సంస్థ ఛైర్మన్‌కు ఫోన్ చేశాడు. అవతల కృష్ణారావు ఫోన్ ఎత్తుకున్నాడు. "హలో సార్! మీరిచ్చిన చెక్కు డిసానర్ అయి తిరిగి వచ్చింది"

"యస్ యస్... మిస్టర్ రమేష్! ఇప్పుడే మా బేంక్ మేనేజర్ ఫోన్ చేసి విషయం చెప్పాడు. మేము కొన్ని చెక్కులు క్లియరెన్స్ కోసం వేసి ఉన్నాము. ఇతర జిల్లాల నుండి ఆ చెక్కులు ఇంకా క్లియరయి రాలేదట. అవి వచ్చేస్తాయన్న ఉద్దేశంతోనే మేము మీకు చెక్కు ఇచ్చింది"

నిమిషం నిశ్శబ్దం. తర్వాత రమేష్ అడిగాడు. "మరెలా సార్! మేము అప్పులు తెచ్చి ఆ యాడ్‌కు పెట్టుబడి పెట్టాము. అప్పులవాళ్ళకు ఈ రోజు వాయిదా చెప్పాము"

"సారీ రమేష్! ఇలా జరుగుతుందని నేనూ అనుకోలేదు. నీకు చాలా ట్రబుల్ ఇస్తున్నాను... ఆ చెక్కులు ఒకటి రెండు రోజులలో క్లియర్ అవుతాయి. ఈ రెండు రోజులు ఎలాగోలా ఓర్చుకో" అవతల వ్యక్తి చాలా రిక్వెస్ట్ చేశాడు.

అవతల వ్యక్తికి తన పరిస్థితిని ఎలా వివరించాలో అర్థం కాలేదు రమేష్‌కు. ఎలా చెపితే ఆయన తన బాధను అర్థం చేసుకోగలడో అన్నది సమస్యయి కూర్చుంది రమేష్‌కు. "మీకు ఈ విధంగా చెబుతున్నందుకు ఏమీ అనుకోకండి సార్! మాది చాలా చిన్న సంస్థ. మేము ఓ చోట ఐదువేలు, మరోచోట పదివేలు అలా తెచ్చి మీ యాడ్‌ను పబ్లిష్ చేయించాం. ఆ అప్పులవాళ్లకి ఈ రోజు గడువు చెప్పాం. వారందరూ ఈ రోజు ఉదయం నుండే గుర్తుచేయడం మొదలుపెట్టారు... అదీ మా సమస్య"

"మీ సమస్యను అర్థంచేసుకోగలను. కానీ నాదీ విధిలేని పరిస్థితి అయింది... ప్లీజ్ - మరో రెండు రోజులు"

అంతటి పెద్ద వ్యక్తి అలా ప్లీజ్ అంటుంటే మరేం చేయాలో అర్థం కాలేదు రమేష్‌కు. "ఓకేసార్ - మరో రెండు రోజులలో నాకెలాగైనా హాఫ్ అమౌంట్ కావాలి"

"హాఫ్ అమౌంట్ నేనివ్వటమేమిటి? మీ చెక్కు ద్వారా మీరే నా అక్కౌంట్‌లో నుండి డ్రా చేసుకోండి... ఓ.కే'.

"అలాగే సర్"

"ఉంటాను" ఫోన్ పెట్టేశాడు కృష్ణారావు. తనూ ఫోన్ పెట్టేశాడు రమేష్.

బలవంతంగా పెదాలమీదకు నవ్వు తెచ్చుకుని హరిత వంక చూశాడు "ఏం చెప్పారు సార్?" అడిగింది హరిత.

"ఏముంది! కేష్ కావలసిన చెక్కులు క్లియరెన్స్‌లోనుండి ఇంకా రాలేదట. కాబట్టి మరో రెండు రోజులు ఓర్చుకోమంటున్నారు. ఈ లోపల చెక్కునేమో ఉంచుకోమంటున్నాడు"

ఆమె కొద్దిసేపు మౌనంగా ఉంది- "కంపెనీ ఫ్రాడ్ చేసేదిలా కనిపించడంలేదు. ఏవో అను

కోని పరిస్థితులు ఏర్పడివుంటాయి. అదీగాక అంత పెద్దసంస్థ ఇంత చిన్న మొత్తాన్ని... మనమూ చెడుగా ఊహించలేం సార్'' రమేష్ వంక పరిశీలనగా చూస్తూ అందామె.

అతడు తలూపాడు. ''నీవన్నది నిజమే... కంపెనీ మనల్ని మోసం చేయకపోవచ్చు. ప్రస్తుత సమస్య అదికాదు. ఈరోజు చెప్పిన వాయిదాను మార్చి, తిరిగి ఎప్పటికి టైమ్ చెప్పాలో ఈ అప్పులవాళ్లకి''

''మరో రెండు రోజులు చెప్పండి''

మౌనంగా తలూపాడు రమేష్. హరిత కాసేపు ఎదురుచూసింది- అతడు ఇంకేదయినా చెపుతాడేమోనని. అతడు ఏదో ఆలోచనలోపడి, ఎటో చూడసాగాడు. కాసేపటి తరువాత ఆమే పలుకరించింది. ''సర్! టైమ్ పన్నెండయింది, వేరే పార్టీ చిన్న యాడ్ ఒకటి ఇస్తాం రమ్మన్నారు- ఆ యాడ్ తీసుకువస్తాను''

అతడు ఆమెవైపు చూశాడు- ''నువ్వు యాడ్ తీసుకువచ్చినా డి.డి. తీసేందుకు నా దగ్గర మనీ లేదు'' బలవంతంగా నవ్వుతూ అన్నాడతను.

ఏంచెప్పాలో తోచనట్టుగా, మౌనంగా వుండిపోయింది హరిత.

కాసేపటికి అతనే ఆలోచించుకుని చెప్పాడు- ''ఇస్తానన్న యాడ్‌ను పోగొట్టుకోకూడదు. నువ్వెళ్లి యాడ్ పట్టుకురా. డబ్బు విషయం తర్వాత ఆలోచిద్దాం''

తలూపి బయటకు నడిచింది హరిత.

రమేష్ కాసేపు ఆలోచించుకుంటూ వుండిపోయాడు. ఎంతసేపు ఆలోచించినా చేయగలిగిందేమీ లేదు. అందరికీ వాయిదా చెప్పడమే.

డబ్బు సమస్యయి, మిత్రులకు సారీ చెప్పుకోవడం జీవితంలో అతనికి అదే మొదటిసారి. అందుకే అతడు అంతలా ఫీలయిపోతున్నాడు. ఎంత ఫీలయినా చెప్పక తప్పదు.

రమేష్ ఫోన్ అందుకున్నాడు. నెంబర్ డయల్ చేశాడు. అది అశోక్ ఫోన్ నంబర్.

''హలో అశోక్! నేనూ... రమేష్‌ని''

''హలో! ఏమిటి విశేషం?''

''సారీ అశోక్! ఎలా చెప్పాలో నోరు పెగల్లేదు... మీరు నేను అడిగిన వెంటనే, వేరోచోట తీసుకువచ్చి డబ్బు ఇచ్చారు. కాని నేను మీకు చెప్పిన టైమ్‌కి అందించలేకపోతున్నాను''

''ఏమయింది... ఆ చెక్కు కేష్ కాలేదా?''

''అకౌంట్‌లో బేలన్స్ లేదని రిటన్ వచ్చింది''

''అలాగా! మరెలా చేస్తావు?''

రమేష్ తను కృష్ణారావుకి ఫోన్ చేసిన విషయం, ఆయన చెప్పిన పరిస్థితులు అశోక్‌కు వివరించి చెప్పాడు. అంతా విన్న తరువాత అశోక్ మందలింపు ధోరణిలో అన్నాడు- ''నువ్వు తెలివితక్కువపని చేశావేమో అనిపిస్తుంది రమేష్! ఇలా చేబదులు తీసుకుని యాడ్స్‌కు పంపటం సరయినపని కాదు... అఫ్‌కోర్స్! నా డబ్బు ఇరుక్కుందన్న ఉద్దేశంతో కాదు నేను చెప్పేది. యాజ్ ఏ ఫ్రెండ్‌గా అడ్వయిజ్ ఇస్తున్నాను''

అసలే రిస్కులో వున్నాడు. దానికితోడు ఇలాంటి స్నేహితుల ఉచిత సలహాలు. అశోక్ మాటలు అతనికి వినుగనిపించాయి. కాని వినుక్కునేందుకు తగిన సమయం కాదు. అందుకే మౌనంగా వుండిపోయాడు

''సరేలే రమేష్! నేను మరెక్కడయినా అడ్జస్ట్‌చేసి వారికి ఇచ్చి పంపిస్తాను. నీకు రాగానే నాకు పంపుదువులే!'' అశోక్ చెప్పాడు.

''థాంక్యూ అశోక్! కేష్ రాగానే మొదట నీకే పంపుతాను''

''ఇట్సాల్‌రైట్'' ఫోన్ పెట్టేశాడు అశోక్.

'ఒకరికి సమాధానం చెప్పుకోగలిగాను' దీర్ఘంగా నిట్టూర్చాడు రమేష్. 'ఇంకా ఇలాంటివారు ఇద్దరు ముగ్గురు. వారికి కూడా సమాధానం చెప్పుకోవాలి- తప్పదు' ఎవ్వరికీ, ఏ శక్తికీ భయపడనివాడు కూడా అప్పులవాళ్లకి భయపడాలి. ఒకడి దగ్గర అప్పు తీసుకున్నామంటే, వాడికి మనమీద అధికారం ఇచ్చినట్టే.

రమేష్ మరో నంబర్‌మీద డయల్ చేశాడు. అవతలి వ్యక్తికి ప్లీజింగ్‌గా జవాబు చెప్పాడు. అలా ఇంకొకరు, మరొకరు. చివరి వ్యక్తికి ఫోన్‌చేసి రిసీవర్ క్రెడిల్ చేశాడు.

అప్పటికే అతని మనస్సంతా చిరాకుగా అనిపించింది. సమస్యలన్నవి చుట్టుముట్టినప్పుడు, మనిషి ఎంతగా డీలా పడిపోతాడో ఒక

గంటలోనే అతనికి అనుభవమయిపోయింది. వ్యాపారం ప్రారంభించిన తర్వాత అతడికి తగిలిన మొట్టమొదటి ఎదురుదెబ్బ అది. అందుకే అతను అంతగా క్రుంగిపోయాడు.

అలా విసుగ్గానే అతడు ఇంటికి బయలుదేరాడు.

గేటు తీసి స్కూటర్‌ని ఇంట్లోకి పోనిచ్చాడు.

స్కూటర్ స్టాండ్‌వేసి లోపలికి నడిచాడు.

మనస్సంతా చికాకుగా వుంది.

తన గదిలోనికి నడిచి, ప్యాంట్‌తీసి పక్కనే పడేశాడు. లుంగీ కట్టుకున్నాడు.

ఇవతలకు వచ్చి బాత్‌రూమ్‌లో దూరాడు. ముఖం కడుక్కుని, హాలులోనికి అడుగుపెట్టేసరికి టేబుల్‌మీద ప్లేటువుంచి అన్నం వడ్డిస్తోంది జానకమ్మ.

నిజానికతనికి ఆకలిగా లేదు. ఆ మాట ఆమెతో అంటే అందుకు ఇరవైనాలుగు ప్రశ్నలు వేస్తుంది. ఆ ప్రశ్నలన్నింటికీ సమాధానం చెప్పే ఓపిక తనకిప్పుడు లేదు.

అతడు అయిష్టంగానే టేబుల్‌ముందు కూర్చున్నాడు.

జానకమ్మ అన్నం వడ్డించింది. రమేష్ మెల్లగా కలుపుకుని ఒక్కో ముద్దా తినసాగాడు.

అతడలా తింటుండగా ఆమె అన్నది- "నేను మీ మామయ్యకు జాబు వ్రాశాను"

రమేష్ తలెత్తి ఆమెవంక చూశాడు- "ఏమని రాశావు?"

"పదిరోజులపాటు కోటూరువల్లెలో వుండేందుకు వస్తున్నానని. మీ మామయ్యను వచ్చి తీసుకువెళ్లమని రాశాను"

అతడేమీ జవాబు చెప్పలేదు. అప్పటికే వ్యాపార సమస్యతో సతమతమవుతున్న అతడు కుటుంబసమస్యను పట్టించుకునే స్థితిలో లేడు.

"ఈరోజు మీ మామయ్య నీకేమీ కాకపోవచ్చు. కాని అతడు నాకు తోడబుట్టినవాడు. నువ్వు అతడికి కాదనుకున్నా, నేను ఆయనను పోగొట్టుకోలేను. పుట్టింటిని ఎలా దూరం చేసుకునేది. అందుకే ఆయన కోపం తగ్గించేందుకు పదిరోజులు వాళ్లింట్లో గడిపివస్తాను"

"అలాగే- వెళ్లిరా" అన్నాడు రమేష్. ఆమె అలా దూరంగా వెళ్లడం ద్వారా తనను కాళ్లబేరానికి వచ్చేలా చేయాలన్నది ఆమె ఉద్దేశమని అతడికి అర్థమవుతూనే వుంది.

"ఆమె అలా దూరమయితే తిండి విషయంలో తాను ఇబ్బంది పడుతానని, అప్పుడయినా పెళ్లాం అవశ్యకతను తెలుసుకుంటానని అమ్మ భావిస్తున్నట్టుంది" అంత బాధలో కూడా అతడు నవ్వుకున్నాడు.

అతడలా అంగీకారం తెలిపిన తర్వాత ఆమె ఇంకేమీ మాట్లాడలేదు. మౌనంగా వడ్డన చేయసాగింది.

అతనికి అన్నం నయించడంలేదు. కాని ఏదో తిన్నాననిపించేందుకు, రెండు ముద్దలు తిని చెయ్యి కడిగేశాడు.

తన రూమ్‌లోకి వెళ్లి బెడ్‌మీద వాలిపోయాడు. ఆలోచనలను బలవంతంగా ఆపి, కన్నులు మూసుకున్నాడు.

అతనికి అనిపిస్తుంది- 'కష్టాలన్నీ ఒక్కసారిగా చుట్టుముడుతాయని... ఛా! అలాంటిదేమీ జరగదు' తనకు తాను సర్ది చెప్పుకున్నాడతను.

అయితే ఎంత ప్రయత్నించినా అతనికి నిద్ర మాత్రం రాలేదు.



రెండురోజులు కాదు నాలుగురోజులు గడిచిపోయాయి. కె.యమ్.టి. వారి అకౌంట్‌లో కేష్ క్రెడిట్ కాలేదు. రమేష్ ప్రతిరోజూ కృష్ణారావుకు ఫోన్ చేస్తూనే వున్నాడు. ఆయన 'ఈ రోజు- రేపు' అంటూనే వున్నాడు.

ఒకపక్క అతడికివ్వవలసిన అప్పులవాళ్లు 'ఇంకా ఎప్పుడు రమేష్' అని వత్తిడి చేస్తున్నా




రు. అంతకుముందు అతనికి ఎంతోమంది ఫ్రెండ్స్ వుండేవారు. వారు అప్పుడప్పుడు 'రమేష్! ఎప్పుడయినా డబ్బు అవసరమయితే అడిగి తీసుకో. మళ్లీ వున్నప్పుడు తిరిగి ఇద్దువు' అనేవారు. కాని అప్పుడెప్పుడూ డబ్బు అవసరపడలేదు. ఇప్పుడు అవసరపడితే ఇచ్చే ఫ్రెండే కనుపించలేదు. కొత్త అప్పుచేసి పాతఅప్పు కట్టేస్తూ రొటేషన్ చేద్దామంటే మిత్రులు 'సారి రమేష్! నిన్ననే పదివేలుంటే వేరే అవసరానికి వాడేశాను' అని చెప్పడం మొదలుపెట్టేశారు. ఎవరైనా ఒకటీ రెండువేలు ఇస్తే అత్యవసర పరిస్థితులలో ఉన్న పాత అప్పులవాళ్లకి కట్టడం మొదలుపెట్టాడు రమేష్.

అమ్మ మెడలో, పెట్టెలో బంగారునగలున్నాయని తెలుసు. కాని అసలే తనమీద కోపంగా ఉన్న ఆమె ఇలాంటి పరిస్థితిలో అవి ఇచ్చి ఆదుకుంటుందన్న నమ్మకం అతడికి లేదు.

కష్టాలు చుట్టుముట్టాయని అతడికి తెలిసిపోయింది. ఈ కష్టాలు తొలగిపోవాలంటే కృష్ణారావు డబ్బు వెంటనే ఇవ్వాలి. ఆ డబ్బు వచ్చిననాడు ఈరోజు కారుమేఘాల్లా కనిపించే కష్టాలు, ఒక్కసారిగా దూదిపింజల్లా ఎగిరిపోతాయని అతడికి తెలుసు.

ఆ ఘడియకోసమే అతడు ఎదురుచూస్తున్నాడు.

అయితే అనుకోని పరిస్థితి అతడికి ఎదురయింది.

రోజూ నిద్రలేవగానే మొదట పేపర్ చూడటం రమేష్‌కు అలవాటు. అయితే అతడు మొదట చూసేది వార్తలు కాదు- యాడ్స్. ఆరోజు ప్రచురింపబడిన యాడ్స్ ఎన్ని, ఏ కంపెనీ ఎన్ని యాడ్స్ ప్రచురించింది, యాడ్స్ డిజైన్స్ ఎలా వున్నాయి' అన్న విషయాలు చూసి ఆ తర్వాత వార్తలలోనికి వస్తాడతను.

ఆదినంకూడా అతడు నిద్రలేచి పేపర్ చేతికి అందుకున్నాడు. యధాప్రకారమే అతడి చేతులు రెండు పేజీలు తిప్పాయి. ఆపేపర్‌లో ప్రచురించిన యాడ్స్‌ను చూశాడు రమేష్. ప్రచురింపబడిన యాడ్స్ అన్నీ పోటీ సంస్థలవే. తన సంస్థది ఒక్కయాడ్ కూడా లేదు. ఎలా ఉంటుంది? పెట్టుబడి పెట్టేందుకు డబ్బు లేక ఒక్కయాడ్ కూడా పంపలేదు. అసలు ఎగ్జిక్యూటివ్‌లని ఫీల్డ్‌మీదకే పంపలేదు...తన బిజినెస్ పూర్తిగా దెబ్బతిన్నది.తమకు పర్మినెంట్‌గా యాడ్స్ ఇచ్చే సంస్థలు, తన ఎగ్జిక్యూటివ్‌లు రెండురోజులు కనుపించకపోయేసరికి, వారి అవసరార్థం మరో కంపెనీని వెతుక్కుంటాయి. ఒక్కసారి సంస్థ మరోకంపెనీ చేతిలోకెళితే, ఆ ఖాతాను తిరిగి రాబట్టుకోవడం చాలా కష్టం. ఈ మూడురోజుల వ్యవధిలో ఎన్నిఖాతాలు తమ చేజారిపోయాయో! నిట్టూర్చాడతను.

పేపర్ తిప్పాడతను. మొదటపేజీలో ఏవో రాజకీయ విశేషాలు వ్రాసి ఉన్నాయి. మరో రెండుపేజీలు హెడ్డింగ్స్ చూస్తూ వచ్చాడతను. నాలుగవ పేజీలో ఉన్న ఆ వార్తను చూసి కాస్త ముందుకి తూలాడు.

'కె.యమ్.టి సంస్థ ఛైర్మన్ కృష్ణారావు మృతి'

రమేష్ గుండె వేగం పెరిగింది. అతడి కన్నులు వేగంగా ఆ వార్తను చదివాయి.

'గత దినం మధ్యాహ్నం కృష్ణారావు తన గృహంలో భోంచేస్తుండగా గుండెపోటు రావడంలో ఆయనను హాస్పటల్‌కు తరలించారు. మార్గమధ్యంలోనే కృష్ణారావు మృతి చెందాడు.'

పేపర్‌విసిరి మూలకొట్టాడు రమేష్. చేతులు రెండూ పిడికిళ్లుగా బిగించి మంచానికేసి కొట్టుకున్నాడు. కొద్దిసేపటి వరకూ మెదడు పనిచేయడం ఆగిపోయింది. ఏం చేయాలో పాలుపోని పరిస్థితి ఏర్పడింది.

పదినిముషాలకుగాని అతడు మామూలు పరిస్థితికి రాలేకపోయాడు. కొద్దిసేపటికి ఆ షాక్ నుండి తేరుకుని 'బాత్‌రూమ్‌వైపు నడిచాడు. ముఖం కడుక్కువచ్చేసరికి జానకమ్మ వేడి కాఫీ అందించింది.

కాఫీ తాగుతూ జరగవలసిన కార్యక్రమం గురించి ఆలోచించాడతను.

కృష్ణారావు మరణంతో, అతని సీట్లోకి మరొకరు వస్తారు. ఆ వచ్చినవారు కంపెనీని ఉంచుకుంటారో లేక మరెవరికైనా అమ్మివేస్తారో. కంపెనీ నష్టాలతో నడుస్తోందని తాను రెండురోజులక్రితం విన్నాడు. ఒకవేళ అతని వారసులు ఐ.పి పెడితే? తలవిదిలించాడు రమేష్. సమస్యలతో బుర్ర తిరిగిపోతుంది.

అన సమస్యలు ఎలా ఉన్నా తాను కృష్ణా రావు దహనసంస్కారాలకు హాజరుకావాలి. అది కనీస మానవత్వం.

అతడు పైకి లేచి తన గదిలోనికి నడిచాడు. టవల్, లుంగీ అందుకుని స్నానానికి వెళ్లాడు.

స్నానం చేసి, డ్రస్ మార్చుకున్నాడు. టిఫిన్ పెడుతూ జానకమ్మ అడిగింది "ఆఫీసు కేనా రమేష్".

"లేదమ్మా తెలిసిన వ్యక్తి చనిపోయాడు. చూసేందుకు వెళ్తున్నాను" చెప్పాడు రమేష్.

టిఫిన్ తిని, స్కూటర్ స్టార్ట్ చేశాడు. వీధిలో నికి వచ్చి ఎదురుగా ఉన్న షాపులోనికి వెళ్లాడు. తన పక్క ఆఫీసుకు ఫోన్‌చేసి, తాను ఆఫీసుకు రావడంలేదనీ, తన ఎగ్జిక్యూటివ్‌లను ఇంటికి పంపివేయమని చెప్పాడు కారణం అడిగితే తాను ఏదో అర్జంట్ పనిమీద వెళ్తుతున్న ట్టు చెప్పమని చెప్పాడు. ఫోన్ పెట్టేసి ఇవత లకు వచ్చాడు రమేష్.

అతని స్కూటర్ కృష్ణారావు ఇంటివైపు సాగింది.

కృష్ణారావు ఇల్లు ఉండే స్ట్రీట్ ఏదో పేపర్‌లో వేశారు. కాబట్టి ఆస్ట్రీట్‌కి వెళితే శవం ఉండే ఇల్లు తేలిగ్గా తెలిసిపోతుంది. అడ్రసు తెలియ కున్నా ఆ ఉద్దేశ్యంతోనే కృష్ణారావు ఇంటికి బయలుదేరాడు రమేష్.

అతడి నమ్మకం కరక్టయింది. ఆ ఏరియా లోకి ఒక వీధిలోనికి వెళ్లగనే ఓఇంటి ముందు జనం గుంపుగా ఉన్నారు. గేటు లోపలకు తొంగిచూస్తే ఒక డెడ్‌బాడీ బయట పరుండబె ట్టి ఉంది.

రమేష్ స్కూటర్ ఆపి ఓ మూలగా ఉంచాడు.

నెమ్మదిగా గేటు లోపలికి నడిచాడు.

శవం మీద తెల్లని గుడ్డకప్పి ఉంది. ఆ శవం మీద పడి కొందరు ఆడవాళ్ళు ఏడుస్తు న్నారు. మరికొందరు మగవాళ్ళు కాస్తదూరంగా నిలబడి దుఃఖిస్తున్నారు. వారంతా అతని బంధుమిత్రులు కాబోలు.

రమేష్ శవం దగ్గరగా నడిచాడు. కృష్ణారావు ముఖం వంక పరిశీలనగా చూశాడు.

అతని ముఖం ప్రశాంతంగా ఉంది. జీవన సమరంలో పోరాడిపోరాడి అలసిపోయిన సైని కుడు, ఆదమరచి నిద్రపోతున్నట్లుగా ఉంది.

నిజంగా చావు ఎంతటి భయంకరమైనదో, అంతటి సుఖకరమైనదికూడా. చనిపోయిన వ్యక్తికి ఏ బాధలూ ఉండవు. బిజినెస్‌లో కష్టమర్ల తలనొప్పి ఉండదు. అప్పులవాళ్ళ సమస్య ఉండదు. పోటీ సంస్థల గురించి ఆలోచన ఉండదు. అసలు... ఏబాధా ఉండ దు. మరే ఆలోచన ఉండదు. అన్ని బాధలకు దూరంగా, మరే ఆలోచనా లేకుండా ఆదమ రచి శాశ్వతంగా నిద్రపోవడం ఎంత ఆనంద కరం.

రమేష్‌కి ఆశ్చర్యం వేసింది. ఏమిటి ఈరోజు తనకు ఇలాంటి వైరాగ్యభావనలు కలుగుతున్నాయి. ఇంతకు ముందుకూడా తా ను ఎన్నోచావులు చూశాడు. మరి ఆనాడు రాని ఇలాంటి ఆలోచనలు ఈనాడు తనకు ఎందుకొ స్తున్నాయి.

బహుశా తన బాధలు తనను అలా ఆలో చింప చేస్తుండవచ్చు. మనిషికి వేదన కలిగిన ప్పుడే శ్మశానవైరాగ్యం కలుగుతుంది.

ఏడుపులు ఒక్కసారిగా అధికంకావడంతో ఆలోచనలు ఆపి, అటు చూశాడు రమేష్. పాడెమీద ఉన్న శవాన్ని నలుగురు కలసి భుజాలకెత్తుకుంటున్నారు. ఆ భౌతికకాయా న్ని తామిక చూడబోము అన్న ఆలోచన రావ డంతో దుఃఖం ఎక్కువయ్యి అక్కడివారు మరింత బిగ్గరగా ఏడుస్తున్నారు.

శవం బయలుదేరింది. నిన్నటి వరకూ నాలుగు వందల మందికి ఆధారం చూ పించిన ఆ వ్యక్తి ఈ రోజు నలుగురి ఆధారంతో శ్మశానం వైపు సాగిపోతున్నాడు. శవం రోడ్డె క్కింది.

శవాన్ని చూసి తిరిగి వెళ్ళిపోవాలన్న ఉద్దే శ్యంతో అక్కడికి వచ్చాడు రమేష్. కాని అనాలో చితంగానే అతని కాళ్ళు శవం వెనుకే నడువ సాగాయి.

తన సమస్యల వలన జనించిన వేదన, అతడిని అలా దుఃఖితుల మధ్య గడిపేందుకే ఇష్టపడేలా చేస్తుంది. తనకన్నా బాధలలో ఉన్న వ్యక్తిని చూసి, సాటి వ్యక్తి ఊరట చెందడం లాంటిదది. శవం వెనుకే అందరితో

పాటు శ్మశానం వైపుగా నడిచాడు రమేష్.

శవం శ్మశానంలో ప్రవేశించింది.

అప్పటికే ఒకచోట కట్టెలు ఎత్తుగా పేర్చబడి ఉన్నాయి. కృష్ణారావు భౌతికకాయాన్ని ఆ కట్టెల మీద ఉంచారు. కొరివి పట్టుకొచ్చిన ఆయన పెద్దకొడుకు చిల్లుకొట్టబడిన కొత్త కుండతో శవం చుట్టూ మూడుసార్లు తిరిగాడు. వక్కవారందించిన కొరివితో ఆ కట్టెలు అంటించాడు.

కట్టెలు అంటుకున్నాయి. జ్వాలలు పైకి లేచాయి. రేగిన జ్వాలలలో కృష్ణారావు భౌతిక కాయం తగలబడుతోంది.

అరవైఏళ్ళుగా అపురూపంగా పెంచుకున్న శరీరం; ప్రతిరోజూ స్నానపానాదులతో శుభ్రంగా ఉంచుకున్న శరీరం. ఒక్క గడియలో అగ్నికి ఆహుతయిపోతోంది.

అయిపోయింది! శవం పూర్తిగా కాలిపోయింది. వచ్చినవారి పని పూర్తయిపోయింది.

అందరూ వెనుతిరిగారు. ఎందుకో రమేష్‌కు ఆ చోటును వదిలి వెళ్ళాలనిపించ లేదు. కాని అప్పటివరకూ తప్పదన్నట్టుగానే వేచి ఉన్నవారంతా వెళ్ళిపోతున్నారు. తానూ వారిని అనుసరించక తప్పదు.

వారిని అనుసరించాడు రమేష్. వారంతా తిరిగి కృష్ణారావు ఇంటికి చేరారు. కాళ్ళు కడుక్కుని ఎవరిళ్ళకు వారు బయలుదేరారు.

రమేష్ మనస్సంతా వైరాగ్య భావనలతో నిండిపోయింది.

అతడు స్కూటర్ స్టార్ట్ చేశాడు. "ఆఫీసుకు శెలవు ప్రకటించాడు! కాబట్టి అటు వెళ్ళనవసరంలేదు. కాని ఇంటికి వెళ్ళాలనిపించడంలేదు.

ఒక్క నిముషం ఆలోచించాడు రమేష్. ఆఫీసుకే వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. అతని స్కూటర్ ఆఫీసువైపు పోసాగింది.

ఆఫీసు గది తలుపు తీసి, సీట్లో కూర్చున్నాడు. ఏకాంతంగా ఏవో ఆలోచించుకుంటూ గడపసాగాడు.

★ ★ ★

కృష్ణారావు మరణంతో అతని కొడుకు రవీంద్ర ఆ సీట్లోకి వచ్చాడు.

కృష్ణారావు చనిపోయిన పదిరోజుల తర్వాత రమేష్ రవీంద్రను కలిశాడు.

అతడిని కలిసేందుకు వెళ్తుంటే రమేష్ గుండె వేగంగా కొట్టుకోసాగింది. అంతవరకూ జీవితంలో ఎన్నడూ అంతటి ఆందోళన ఫీల్‌కాలేదు అతడు.

విజిటింగ్ కార్డు లోపలకు పంపిన తర్వాత, లోపల నుండి రమ్మని పిలుపు వచ్చింది. రమేష్ లోపలకు వెళ్ళాడు

"కూర్చోండి" చెప్పాడు రవీంద్ర.

కూర్చున్నాడు. రమేష్.

రవీంద్రకు ముప్పై ఏళ్ళకు మించి ఉండవు. సీటుకు తగిన హుందాతనం అతనిలో ఉంది. ముఖంలో పట్టుదల కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. చూపులలోనే వ్యాపారదక్షత స్పష్టంగా కనిపిస్తుంది.

"చెప్పండి! ఏంకావాలి" అడిగాడు రవీంద్ర.

"నా పేరు రమేష్. నేను సత్యాయాడ్స్ ప్రొప్రయిటర్‌ని. నేను మీ నాన్నగారి మరణానికి ముందు వారంరోజుల క్రితం ఒక యాడ్‌ని మీ కంపెనీ తరపున ప్రచురించాను. దానికిగాను మీ నాన్నగారు మాకు హాఫ్ అమౌంట్‌కి చెక్కు రాసి ఇచ్చారు. బట్ అకౌంట్‌లో కేష్ లేనందున చెక్కు తిరిగొచ్చింది. మీ నాన్నగారిని అడిగితే ఈరోజు-రేపు అంటూ వాయిదాలు వేస్తూ వచ్చారు. ఇంతలో ఈ అనర్థం జరిగిపోయింది. అప్పటినుండీ ఇప్పటివరకూ ఈ సీట్లోకి వచ్చే వ్యక్తి కోసం ఎదురుచూస్తున్నాము.... మా కంపెనీ పరిస్థితే మమ్మల్నిలా ఇం[illegible] త్వరగా మీ దగ్గరకు వచ్చేలా చేసింది" చెప్పటం ఆపాడు రమేష్.

అతని మాటలు విని కొద్దిసేపు తలపట్టుకు కూర్చుండిపోయాడు రవీంద్ర. కొద్దిసేపు తర్వాత రమేష్ వంక చూస్తూ చిన్నగా అడిగాడు. "మీకివ్వవలసిన అమౌంట్ ఎంత?"

అమౌంట్ ఎంతో చెప్పాడు రమేష్.

రవీంద్ర మెల్లగా తలూపాడు. తర్వాత చేతిలోని పేపర్ వెయిట్ తిప్పుతూ చెప్పాడు. "మిస్టర్ రమేష్" ప్రస్తుతం మా కంపెనీ పరిస్థితి మేడిపండు చందంలా ఉంది. ఈ నెలాఖరుకు వర్కర్స్‌కి ఇవ్వాల్సిన జీతాలు

లా చేయాలా అని ఆలోచిస్తూ కూర్చుని న్నానిప్పుడు. అఫ్‌కోర్స్ మరో నెలరోజులలో ఈ కంపెనీ పరిస్థితులన్నీ చక్కదిద్దేయగల ను. లాస్ ఎక్కడి నుండి వస్తుందో వెతికి, లాస్ రాకుండా మేనేజ్ చేయగలను... సో! మీరు మరో రెండు నెలలపాటు మమ్మల్ని ఇబ్బందిపెట్టకండి. రెండునెలల తర్వాత హాఫ్ అమౌంట్ ఇచ్చేస్తాను. ఆ తర్వాత మరో రెండునెలలకు మిగిలిన సగం అమౌంట్ ఇచ్చేస్తాను.''

ఆ మాటలలో రమేష్ ముఖం పాలిపోయింది.

"మిస్టర్ రవీంద్ర! నా డబ్బు మరో ఆరునెలలపాటు మీ దగ్గరున్నా ఆ తర్వాతైనా మీరిస్తారని నాకు తెలుసు. కాని మరో నాలుగునెలలు కాదు కదా... నాలుగురోజులు కూడా ఓర్చుకోగలిగిన పరిస్థితిలోలేదు మా కంపెనీ. నా పెట్టుబడి మొత్తం యాభైవేలు. అయితే లక్షరూపాయలు మించిన మీ యాడ్‌ను ప్రచురించేందుకు ఫ్రెండ్స్ దగ్గర అప్పు తీసుకున్నాను. కొంతమొత్తాన్ని పత్రికలకు అప్పుపెట్టాను... చెప్పిన వాయిదాకన్నా రెండురోజులు ఎక్కువ గడిచేసరికి అప్పులవాళ్ళు చుట్టుముట్టి ఉన్నారు. అటు పెట్టుబడి లేక బిజినెస్ ఆగిపోయి ఉంది. ఇటు అప్పులవాళ్ళు. నా పరిస్థితి ఎలా ఉంటుందో మీరే ఊహించండి.రిక్వెస్టింగ్‌గా చెప్పాడు రమేష్.

అవతలివ్యక్తి మౌనంగా తలాడించాడు. "ఊహించగలను... ఎందుకంటే ఇంచుమించుగా నా పరిస్థితీ అదే కాబట్టి. ఆఖరు స్టేజ్‌లో నాన్నగారు చేసిన అప్పులు చూస్తుంటే నాకే తలతిరిగిపోతోంది. పరిస్థితి ఇంతగా విషమించేంతవరకూ ఆయన మౌనంగా ఎందుకుండిపోయారో నాకే అర్థంకావడంలేదు. బిజినెస్‌మాన్ వ్యాపారంలో లాస్ ఎక్కడౌ స్తోందో తెలుసుకోవాలి లేదా బిజినెస్ క్లోజ్ చేసేయాలి. ప్రతినెలా లక్షన్నరరూపాయల లాస్ భరిస్తూ వ్యాపారం చేయడం సరయిన పద్ధతి కాదు... అందుకే రెండునెలలపాటు బాగా ప్రయత్నిస్తాను. లాస్‌ను కవర్‌చేయగలిగితే బిజినెస్ ఉంచేస్తాను లేదా కంపెనీ క్లోజ్ చేసేస్తాను'' చెప్పాడు రవీంద్ర.

"ఇప్పుడు మీరు డబ్బు ఇవ్వకపోతే నా పరిస్థితి కూడా... బిజినెస్ క్లోజ్ చేసేయడమే. కారణం నా పెట్టుబడి, నాపరపతి అంతా మీ దగ్గరే ఉండిపోయింది కాబట్టి నవ్వేటు బల వంతంగా.

రవీంద్ర చేతిలోని పేపర్‌వెయిట్‌కింద పెట్టాడు "మిస్టర్ రమేష్! మీ పరిస్థితి అర్థమవుతూవున్నా ఏమీ చేయలేని స్థితిలో ఉన్నాను నేను. మీరు నమ్మకపోవచ్చు - మా కుటుంబసభ్యులలో ఎవ్వరివద్దా వందరూపాయలకు మించిలేవు. రేపు వర్కర్స్ జీతాలకోసం నా కారుని అమ్మేస్తున్నాను... కొన్ని పరిస్థితులు చెప్పినా ఎదుటివారు నమ్మగలిగేట్టుగా ఉండవు. ఇంతపెద్ద సంస్థకు అధిపతిని. నా పరిస్థితి అది అంటే ఎవ్వరూ నమ్మలేరు...''

రూమ్‌బాయ్ కాఫీ తేవడంతో అతడు మాటలు ఆపేశాడు. బాయ్ రెండుకప్పులలో కాఫీ టేబుల్ మీదుంచాడు. "తీసుకోండి'' ఓ కప్పు అతని ముందుకు జరిపాడు రవీంద్ర. కాఫీ కప్పు చేతిలోనికి తీసుకుని సిప్‌చేయసాగాడు రమేష్.

ఇద్దరిమధ్యా కొద్దిసేపు మౌనం ప్రవహించింది. ఇద్దరూ ఎవరి ఆలోచనలలో వారు ఉండిపోయారు.

బాయ్ ఖాళీచేసిన కాఫీకప్పులను తీసుకెళ్ళిపోయాడు.

"చూడండి రమేష్! మీకు సహాయం చేయాలని ఉన్నా చేయలేని పరిస్థితి నాది. నన్ను అర్థంచేసుకోండి... ఏ విధానైనా నాకు డబ్బు సమకూరినరోజు ముందుగా మీ డబ్బు పంపిస్తాను. అది రెండునెలలే అవసరంలేదు. పదిరోజుల తర్వాతైనా కావచ్చు. సో! ప్రస్తుతం దయచేసి నన్ను ఇబ్బంది పెట్టకండి. ఇబ్బందిపెట్టినా ప్రస్తుతం మీకు ప్రయోజనం ఏమీ ఉండదు''

ఇబ్బంది పెట్టడం అన్న పదం రవీంద్ర ఎందుకుపయోగించాడంటే లీగల్‌గా ప్రొసీడ్‌కావద్దు అని చెప్పడానికేనని అర్థం చేసుకున్నాడు రమేష్.

అది కూడా నిజమే. చెక్కును డిజ్‌ఆనర్ చేయించి లాయర్ నోటీసు ఇప్పించినా ప్రస్తుతం ప్రయోజనం ఏమీఉండదు. కోర్టుద్వారా న్యాయం జరగడం చాలా ఆలస్యం కాబట్టి

అంతకన్నా వారు చెప్పిన వాయిదావరకూ వేచిఉండటమే నరయినవని. కాని మరో రెండునెలలు అంటే... అయిపోతుంది... తన బిజినెస్ పూర్తిగా దెబ్బతింటుంది. అప్పులవాళ్ళతో యాతన పెరిగిపోతుంది. ఎలాచేయాలి?... ఎలా చేయాలి. తల పగిలిపోతున్నట్టుగా అనిపించింది. చేతివేళ్ళలో నుదుటిని అదిమిపెట్టుకున్నాడు.

రవీంద్ర రమేష్‌వంక జాలిగా చూశాడు. "సారీ" చెప్పాడు రవీంద్ర.

రవీంద్రను చెడుగా అనుకునేందుకు వీలు లేదు. తన వరిస్థితి ఎలాఉందో అతని వరిస్థితీ అలాగే ఉంది. తన పెట్టుబడి ఒకచోట ఇరుక్కుపోయిందన్న బాధ మాత్రమే తనది. అతనిది నష్టాలతో నడుస్తున్న వ్యాపారం. ఇలాంటి వరిస్థితిలో తనలాంటి అప్పులవాళ్ళు గట్టిగా వత్తిడిచేస్తే అతను తన వ్యాపారాన్ని క్లోజ్ చేసుకోవలసి ఉంటుంది. లేదా పి.పి పెట్టాల్సి వస్తుంది.

అతడు నిట్టూర్చాడు. చేయగలిగింది ఏమీ లేదు... అయినా చేతిలో డబ్బు లేకుండా, ఎలా తీర్చాలో తెలియకనే కృష్ణారావు ఈ యాడ్‌ను ఎందుకు ప్రచురించినట్టు? అదే ప్రశ్నను అడిగాడు రవీంద్రను.

"నాన్నగారికదో నమ్మకం - తాను కోరుకుంటే డబ్బు ఎలాగైనా అడ్జస్ట్ చేయగలనని అనుకున్నారే కాని నమయానికి అడ్జస్ట్ చేయ లేదు... ఇక ఇలాంటి నష్టాలమధ్య అంత ఖర్చుతో అంతపెద్ద యాడ్ ఎందుకు ప్రచురించారు అన్నదానికి - డబ్బు తరిగిపోతున్నప్పుడే మనిషి డాబుగా కనిపించాలి. నష్టపోతున్నప్పుడే, కంపెనీ ప్రతిష్ట ఇలాంటి వాటిద్వారా నిలబెట్టుకోవాలి. అది బిజినెస్ టెక్నిక్."

"ఆ బిజినెస్ టెక్నిక్‌కు నేను బలయిపోయాను" అన్నాడు రమేష్.

"మిమ్మల్ని ఇబ్బంది పెట్టాలని ఆయన కోరుకోలేదు. తనవల్ల మీరింతగా ఇబ్బంది వడతారని ఆయన ఊహించి కూడా ఉండరు. లక్ష రూపాయలు ఒకచోట నిలబడిపోయినా రొటేషన్ చేసుకోగలరని అనుకుని ఉంటేనే ఆయన మీకే యాడ్ ఇచ్చి ఉంటారు".

"ఇట్సాల్‌రైట్" పైకి లేచాడు రమేష్.

"మిస్టర్ రమేష్... ఐ యామ్ వెరీ సారీ టు సే లైక్ దిస్. బట్ ఐ యామ్ నాట్ ఏబుల్ టు డూ ఎనీ హెల్ప్ టు యూ" రవీంద్ర పైకి లేచి చేయందించాడు. రమేష్ చేయి అందుకుని తిరిగి చెప్పాడు. "వీలయినంత త్వరలో మీకు కేష్ వంపిస్తాను. ప్లీజ్ యాక్సెప్ట్ మై అపాలజీస్".

"ఫర్వాలేదు... ఎవ్వరు మాత్రం చేయగలిగింది ఏముంది? వరిస్థితులు మనల్నిలా చేశాయి. మనసు మంచిదయినా చేయగలిగింది ఏమీ లేదు .— సీయూ!" తలుపు తీసుకుని ఇవతలకు వచ్చాడు. కారిడార్‌లో నడిచి, మెట్లు దిగాడు.

స్కూటర్ పార్క్ చేసిన వైపు నడుస్తూంటే మెదడంతా మొద్దుబారినట్టయిపోయింది. ఏంచేయాలో దిక్కుతోచని స్థితి.

రమేష్ స్కూటర్ స్టార్ట్ చేశాడు. స్కూటర్ రోడ్డెక్కింది.

అనాలోచితంగానే చాలాసేపు రోడ్లమ్మట స్కూటర్‌ను తిప్పాడు. ఇంటికి వెళ్ళడానికి మనస్సంగీకరించలేదు. ఆఫీసుకు వెళ్ళి చేసేదేముంది? తిరిగి తిరిగి అలసి, ఓ హోటల్ ముందు ఆపాడు స్కూటర్‌ని.

స్కూటర్ దిగి లోపలకు నడిచాడు. ఓ టేబుల్ ముందు కూర్చుని తలపట్టుకున్నాడు. ఏం చేయాలి? ప్రస్తుత వరిస్థితి ఏమిటి? రవీంద్ర మరో రెండునెలలకయినా ఇస్తాడా? లేక ఆ మొత్తం డబ్బు ఇక పోయినట్టేనా?—

వచ్చిన సప్లయర్‌కి కాఫీ చెప్పాడు. సప్లయర్ కాఫీ తెచ్చి టేబుల్ మీద పెట్టాడు. వేడివేడి కాఫీ కొద్దికొద్దిగా తాగుతుంటే మెదడు మెల్లగా పనిచేయటం మొదలుపెట్టింది. అప్పటివరకూ వడిన ఆందోళన కొద్దిగా తగ్గింది. వరిస్థితులను ఎలా ఎదుర్కోవాలా అన్న ఆలోచన మొదలయింది. ఆలోచనలు నక్రమ మార్గంలో సాగసాగాయి.

ప్రస్తుతం తాను రవీంద్రను ఇబ్బందిపెట్టి చేయగలిగింది ఏమీలేదు. మరింత బలవంతపెట్టినా ఇచ్చే పొజిషన్‌లో లేడు. కోర్టు ద్వారా ప్రొసీడ్ అయ్యేందుకు అది చాలా లేట్ అవుతుంది. అంతకన్నా రవీంద్ర చెప్పిన టైము




వరకూ వేచి ఉండటమే సరి అయినది. అంతకన్నా చేయగలిగింది ఏమీలేదు.

ఇక బిజినెస్-రవీంద్ర నుండి డబ్బు అందే వరకూ తాను వ్యాపారం చేయలేడు—ప్రస్తుతం తనకు అప్పు దొరకటం కష్టం. దొరికి చేసినా మనశ్శాంతి ఉండదు. ఇతరుల పెట్టుబడితో చేసే వ్యాపారం ఎల్లప్పుడూ ఆందోళన కలిగిస్తుంది. సో కొద్ది రోజుల పాటు బిజినెస్ స్టాప్ చేయడమే సరయిన పని.

బిజినెస్ ఆపడం గురించిన ఆలోచన రాగానే, రమేష్ మనస్సంతా ఏదోలా అయింది. ఎన్నో రాత్రులు అవిరామంగా నిద్రలేకుండా శ్రమపడి డిజైన్స్ చేసి యాడ్స్‌పంపే వారు. అన్ని వందల రోజుల శ్రమ ఒక్క రోజులో నాశనమయిపోతోంది—అయిపోతోంది. బిజినెస్ క్లోజ్ అయిపోతోంది.

బాధ నుదులు తిరుగుతోంది. అయినా ఏం చేయగలడు? తమాయించుకున్నాడు రమేష్.

మరో సమస్య-అప్పులవాళ్లనేం చేయాలి? మనిషికి అప్పు ఉన్నప్పుడు మనశ్శాంతి ఉండదు. వీలయినంతవరకూ అప్పు కట్టెయ్యాలి. అలాగే మరో రెండునెలలపాటు శెలవు తీసుకోమని స్టాఫ్ కు చెప్పెయ్యాలి. వారి జీతాలు క్లోజ్ చేయాలి. సమస్యలన్నీ తగ్గించుకోవాలి.

తిరిగి తన చేతికి డబ్బు అందినపుడు బిజినెస్ స్టార్ట్ చేయొచ్చు.

అసలు బిజినెస్ క్లోజ్ చేస్తే తనకు మనశ్శాంతి లభిస్తుందా? భవిష్యత్తును గురించిన వేదన మరింతా పెరిగిపోదూ?

ఆలోచనలను ఆపేశాడు రమేష్. కుర్చీలో నుండి పైకి లేచాడు. కౌంటర్‌లో బిల్లు కట్టేసి బయటకు నడిచాడు.

స్కూటర్ దగ్గర నిలబడి ఒక నిముషం పాటు ఆలోచించాడు. తక్షణం చేయాల్సిన కర్తవ్యం ఏమిటి? కొన్ని ముఖ్యమైన అప్పులు కట్టెయ్యాలి! స్టాఫ్‌కు జీతాలు ఇచ్చి పంపెయ్యాలి! ఆ రెండు పనులకు తనకు డబ్బు కావాలి. పూర్తి మొత్తం కాకున్నా కొద్ది కొద్దిగానైనా ఇచ్చి సర్ది చెప్పాలి.

ప్రస్తుతం తనకు కొద్దిగానైనా డబ్బు కావాలి. డబ్బు ఎలా వస్తుంది?

దిక్కు తోచలేదు. పిడికిలి బిగించి బలంగా స్కూటర్ సీట్ మీద కొట్టాడు—— సరిగ్గా అప్పుడే అతని దృష్టి పడింది—స్కూటర్ మీద!

ఈ స్కూటర్‌ని అమ్మేస్తే? బాధగా అనిపించింది. ఇష్టపడి కొనుక్కున్న స్కూటర్. మంచి కండిషన్ గల ఇంజన్. ఎప్పుడూ ఇబ్బంది పెట్టలేదు—అయిష్టమైనా అమ్మక తప్పదు. పరిస్థితి తారుమారైనపుడు ప్రియమైన వాటిని దూరం చేసుకోకతప్పదు.

స్కూటర్‌ని స్టార్ట్ చేశాడు రమేష్. పది నిముషాల తర్వాత అతని స్కూటర్ ట్రేడ్ లింక్స్ ముందు ఆగింది. ఆ ట్రేడ్ లింక్స్ యజమానితో మాట్లాడాడు రమేష్. ధర నిర్ణయం జరిగింది. మరో పార్టీ కొనుక్కొనేందుకు సిద్ధంగా ఉంది. మర్నాడు పార్టీని కన్సల్ట్ చేసి, వెహికల్ చూపించి డబ్బు తీసుకోవడమే. అందుకు అంగీకరించాడు రమేష్.

స్కూటర్‌ని అక్కడ పెట్టేసి, బస్సులో ఇంటికి బయలుదేరాడు.

ఎందుకో ఆ క్షణాన తన పరిస్థితి మీద తనకే జాలివేసింది రమేష్‌కు.

★ ★ ★

స్టాఫ్ అందరినీ గదిలోనికి పిలిచాడు రమేష్. స్టాఫ్ అంతా ఆ గదిలో సమావేశమయ్యారు. ఒక ఆర్టిస్ట్, ముగ్గురు ఎగ్జిక్యూటివ్‌లు, ఒక ఆఫీస్‌బాయ్. ఇదీ ఆ కంపెనీ స్టాఫ్. వారంతా ఎదురుగా కూర్చున్న తర్వాత గొంతు సవరించుకుని నవ్వాడు.

"డియర్ ఫ్రెండ్స్ నేటి సమావేశానికి కారణం మీకందరికీ తెలుసు. కె. యమ్.టి. సంస్థకు ప్రచురించిన యాడ్‌తో మన డబ్బుంతా వారి దగ్గరే చిక్కుకుపోయింది. ప్రస్తుతం మీరు యాడ్స్ తెచ్చినా పెట్టుబడి పెట్టేందుకు వందరూపాయలు కూడా లేకుండా పోయాయి... కె.యమ్.టి. వారు మరో రెండు నెలలలో డబ్బు ఇస్తామంటున్నారు. ఈ రెండు నెలలలో మీరు, నేను ఆఫీసులో కూర్చోవలసిందే తప్ప యాడ్స్ ఎలాగూ పంపలేము. కాబట్టి ఈ రెండు నెలలపాటు నేను మన ఆఫీసును క్లోజ్ చేద్దామనుకుంటున్నాను" చెప్పి వారందరి ముఖాలవంక ఒకసారి పరీక్షగా



చూశాడు. వారందరూ కేవలం స్నేహితుల్లానే వింటున్నారు తప్ప ఎవరూ అతని మాటలకు అడ్డు తగలడంలేదు. ఇంకా అతడేదైనా చెబుతాడేమోనని ఎదురుచూస్తున్నారు.

"నేను ప్రస్తుతం మీకు ఒకింత ఎక్కువ మొత్తం ఇచ్చి అడ్వాన్సుగా ఉంచుకోమని చెప్పేందుకు కూడా నా దగ్గర తగినంత డబ్బు లేదు. కాబట్టి నేనిప్పుడు మీ జీతాలవరకు మాత్రమే ఇవ్వగలుగుతున్నాను" హరిత వంక చూశాడు.

"ఫర్వాలేదు సార్... కానీ... " ఆగిందామె నందేహంగా





"ఫర్వాలేదు– చెప్పు" అన్నాడతను.

"మనం మరో రెండునెలలపాటు ఫీల్డ్ మీదకు వెళ్ళకుండా ఉంటే మనకు యాడ్స్ ఇచ్చే కంపెనీలు మరో యాడ్స్ కంపెనీకి ఇవ్వడం మొదలుపెడతాయి. కాబట్టి..."

అతడు తలూపాడు– "అది నాకూ తెలుసు. కాని ప్రస్తుతం చేయగలిగింది ఏమీలేదు"

అందరూ మౌనంగా ఉండిపోయారు.

అతడు ఆ తేదీవరకు లెక్కచేశాడు. డబ్బు లెక్కపెట్టి వారి చేతిలో ఉంచాడు.

"గుడ్‌బై ఫ్రెండ్స్. ఈ రెండునెలలలోపు మీరు మరో కంపెనీలో చేరకుంటే మనం

మళ్ళీ కలుద్దాం"
వారంతా వెళ్ళిపోయారు.



గదిలో పడుకొని దీర్ఘాలోచనలో మునిగిఉన్నాడు రమేష్. కళ్ళు మూసుకుని తన గత జీవితాన్ని సమీక్షించుకోసాగాడు.

ఏదో అలికిడయింది. కన్నులు విప్పి చూశాడు. ఎదురుగా తన తల్లి.

"ఏం కావాలమ్మా?" అడిగాడు రమేష్.

"పది గంటలయింది కదా! ఇంకా ఆఫీనుకు బయలుదేరకపోయేసరికి ఏమిటా అని ఇలా వచ్చాను"

"ఆఫీనుకు ఇంకో రెండునెలలపాటు వెళ్లనవసరం లేదమ్మా! బిజినెస్ రెండునెలలపాటు అవుచేశాను" అన్నాడతను.

"ఏం... ఎందుకని?" ఆశ్చర్యంగా అడిగిందామె.

జరిగిన సంగతులన్నీ క్లుప్తంగా చెప్పాడతను. అంతావిని బుగ్గలు నొక్కుకుందామె. "అంటే మన డబ్బంతా పోయినట్టేనా?" వెంటనే అనుమానంగా అడిగిందామె.

"లేదమ్మా! మరో రెండు నెలల తర్వాత మన డబ్బు మనకు తప్పక వచ్చేస్తుంది"

"వచ్చేంతవరకూ నమ్మకం ఏముంది?"

"వ్యాపారం అన్న తర్వాత ఎదుటివాడిని నమ్మకతప్పదు. ఎదుటివారిని నమ్మినపుడు వారు న్యాయంచేసినా, మోసం చేసినా భరించాలి" విరక్తిగా అన్నాడతను.

"అందుకే నేను నెత్తీనోరు కొట్టుకున్నాను - మనకీ వ్యాపారాలు వద్దుబాబూ అంటూ. వ్యాపారాలలో లాభాలుంటాయి - మోసాలు ఉంటాయి. మోసగించబడితే నడిసముద్రంలో పడవమునకగా నిట్టనిలువునా మునిగిపోతాం. ఇన్ని చెప్పినా వినలేదు నువ్వు. ఉద్యోగం చేయమంటే కాదన్నావు. పొలంవుట్రా అమ్మి పాతికవేలు జమచేసుకుని వ్యాపారం మొదలుపెట్టావు. సాగినంతకాలం సాగించావు. ఇప్పుడు నష్టేట్లో ముంచి చేతులు కట్టుక్కూర్చున్నావు" కోపంగా అన్నదామె.

తల్లి మాటలు చాలా చికాకుగా అనిపించాయి అతడికి. తనసలే వేదనలో ఉన్నాడు. ఇలాంటి సమయాలలో ఆమె ఊరడించాల్సింది పోయి విసుగు కలిగించడం అతడికెంతో బాధ కలిగించింది. 'ఛీ... ఏమిటీ బతుకు? మనిషి ఆర్థికంగా చితికిపోయినపుడు తల్లికూడా తనయునిలో తప్పులు వెతుకుతుందా?'

అలాంటి పరిస్థితిలోనే మనిషికి ఆత్మపరిశీలన మొదలయ్యేది 'తాను ఎందుకు బతుకుతున్నాడో? ఎవరికోసం కష్టపడుతున్నాడో—ఆలోచించుకుని వెనుతిరిగి చూసుకునే క్షణం అదే!

"ఆ డబ్బు రాకపోతే మరేం చేయాలనుకుంటున్నావు?" ప్రశ్నించింది జానకమ్మ.

"ఇప్పటివరకూ నేనేమీ అనుకోలేదమ్మా. ఏంచేయాలా, ఎలా చేయాలా అని ఆలోచించుకుంటున్నాను" జవాబు ఇచ్చాడు రమేష్.

ఆమె కొద్దిసేపు మౌనంగా నిలబడి, దీర్ఘాలోచనలో పడింది. "ఇలాంటి పరిస్థితిలో మీ మామయ్య ఉన్నా నీకు సరయిన సలహా ఇచ్చి ఉండేవాడు. ఆయనను కూడా దూరం చేసుకున్నావు నువ్వు"

ఆమె మాటలకు జవాబు చెప్పలేదు రమేష్.

ఆమే తిరిగి అంది- "నాకసలు దిక్కుతోచడంలేదు. ఇంత పెద్ద సంసారం. ఖర్చులకు ఇక ఎలా చేయాలో ఏమో? ఉన్న ఒక్క ఆధారం పోయింది. దానితోపాటు మన దగ్గరున్న కాస్త డబ్బు కూడా పోయింది"

"మన డబ్బు పోయిందని అప్పుడే ఎలా అనుకుంటున్నావు?" విసుగ్గా అన్నాడతను.

"ఒకరి చేతులలో ఇరుక్కుపోయిన డబ్బు




తిరిగి వస్తుందని ఎలా నమ్మమంటావు? ఇక అది వారి దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి ఉంటుంది''

''లేదు... వస్తుందన్న నమ్మకం నాకుంది''

''ఏమో! నాకా నమ్మకం లేదు''

మనస్తాపాన్ని పెంచే ఆమె మాటలు అతని కి కోపాన్ని తెప్పించాయి. ''సరే! ఎలా జరగాల్సి ఉంటే అలా జరుగుతుంది. నన్ను విసిగించక అవతలికెళ్లు'' చిరాకును అణచుకుంటూ అన్నాడు తను.

ఆమె ఏదో గొణుగుతూ అవతలకు వెళ్ళింది.

అతడు బోర్లా పడుకున్నాడు. తలదిండులో ముఖందాచుకున్నాడు. విపరీతమైన దుఃఖం ముంచుకు వస్తోందతనికి. ఏమిటి తన పరిస్థితి? తన భవిష్యత్తేమిటి? ముందుముందు ఏం కానున్నాడు తను? అతని వేదన దుఃఖం స్థాయిని మించిపోయింది.

ఆ స్థితిలో తనను ఎవరైనా ఊరడిస్తే బాగుణ్ణు అనుకున్నాడతను. తన మనసులోని బాధ ఎవరికైనా చెప్పుకుంటే వేదన కొద్దిగానైనా తగ్గుతుందనిపించింది. కాని తన బాధ వినేందుకు ఎవరున్నారు? తన గురించి పట్టించుకునేందుకు ఎవరున్నారు?... ఎందుకు లేరు! అశోక్‌లాంటి మిత్రుడున్నాడు.

అమ్మ ఉంది. ఆమెకు తనమీద ప్రేమ ఉంది. కాని ఆమె తన పరిస్థితిని అర్థం చేసుకోగలిగిన స్థాయిలో లేదు. ఆమె పరిధి చాలా చిన్నది. కొడుకు ఉద్యోగం చేస్తూనో-లేదా వ్యాపారం చేస్తూనో కొంత డబ్బు తెస్తుంటే కుటుంబాన్ని జరపడం మాత్రమే తెలుసామెకు. ఒకవేళ అవతలివారి వల్ల పొరపాటు జరిగితే, ఆ పొరపాటుకు కారణాలు వెతికి చెపుతుంది. అలా చెప్పే సమయంలో అవతలి వారి మనఃస్థితి గురించి ఆలోచించదు. ఎలాంటి పరిస్థితిలో అలాంటి పొరపాటు జరిగిందో తెలుసుకుని అర్థం చేసుకోదు.

అది ఆమె తప్పని తాను అనలేదు. బహుశా జనరేషన్ గేప్ ఆమెనలా ఆలోచింపచేస్తుంది. ఆమె ఇంకా పాతకాలంనాటి పరిస్థితులకే అన్వయించుకుని ఆలోచిస్తుంది. అలా ఆలోచించి ప్రవర్తించడంలో సొంత కొడుకునే బాధిస్తున్నట్టుగా ఆమె అనుకోదు. అది ఆమె మనస్సుకు తట్టదు. అలాకాక ఆపత్సమయంలో ఆమె తనను దగ్గరకు తీసుకుని ఊరడించగలిగితే, తల్లి ఓదార్పుకన్నా మించిన మనశ్శాంతి ఈ లోకంలో ఎక్కడా దొరకదు. ప్చ్! అలాంటి అదృష్టం ఈ లోకంలో ఎంతమంది కొడుకులకి దక్కుతోంది?

అది తల్లుల తప్పు కాదు. జనరేషన్ గేప్. అంతే.

రమేష్ పైకి లేచాడు. డ్రస్ ఛేంజ్ చేసుకున్నాడు. అద్దంలో ముఖం చూసుకుని, తల దువ్వాడు.

బయటకు నడుస్తుంటే జానకమ్మ అడిగింది ''ఎక్కడికి?''

''అలా లైబ్రరీ వరకూ'' చెప్పాడు రమేష్.

''పేపర్‌లో ఏవైనా ఉద్యోగ ప్రకటనలు ఉంటాయి. చూసి వేసుకోకూడదూ?''

ఆ క్షణాన తన పరిస్థితి మీద తనకే జాలి వేసిందతడికి. మౌనంగా తలూపి బయటకు నడిచాడు.

వాకిలి దాటిన తర్వాత అలవాటు ప్రకారం అతని చూపులు స్కూటర్ కోసం వెదికాయి. మళ్ళీ వెంటనే జ్ఞాపకంవచ్చింది. తాను స్కూటర్‌ని అమ్మివేసినట్టు.

అతడు వీధిగేటు దాటి రోడ్డు పక్కనే నడవసాగాడు. నిన్నటివరకూ స్కూటర్‌లో ఆ రోడ్డమ్మటే కొన్నివందలమార్లు వెళ్ళి ఉంటాడు. ఈ రోజు కాలినడక.

రమేష్ రెండు వీధులు దాటి ఆ వీధిలో ఉన్న లైబ్రరీకి వెళ్ళాడు. పేపర్ తీస్తే అలవాటు ప్రకారమే అతని చూపులు మొదట యాడ్స్ మీదకు మళ్ళాయి.

ఎన్నడూ లేనిది ఆరోజు మధ్యాహ్నం వరకు పుస్తకాలతోనే కాలం గడిపేశాడు.

రెండు గంటలవేళ ఇంటికి బయలుదేరాడు.

అతడొచ్చేవరకూ అతడి కోసమే ఎదురుచుస్తున్నట్టుగా ఉంది జానకమ్మ. ''ఈవేళ వరకు లైబ్రరీలోనే ఉన్నావా?'' వాకిట్లోనే నిలదీసిందామె.

''అవునమ్మా''

వ్యాపారాలు చేసప్పుడయితే ఏవేళకంటే ఆవేళకు వచ్చేవాడివి. అప్పుడంటే సరి. మరి ఇప్పుడు కూడా వేళాపాళా లేని తిండేనా?"

ఆమె ఆ మాటలు సాధారణంగా సంభాషించినట్టే అని ఉండవచ్చు. ఆ పరిస్థితిలో అతనికి ఆ మాటలు ములుకుల్లా గుచ్చుకున్నాయి. ఆ మాటలు దెప్పి పొడుస్తున్నట్టుగా అనిపించాయి.

అతడామెకు బదులేమీ ఇవ్వలేదు. ఆమె కూడా జవాబు ఆశించినట్టులేదు. "రా భోంచేద్దాం" అన్నది డైనింగ్ టేబుల్ వైపు నడుస్తూ.

అతడు బాత్‌రూమ్‌లోకెళ్ళి కాళ్ళు ముఖం కడుక్కున్నాడు. లుంగీ కట్టుకుని వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

జానకమ్మ రెండు ప్లేట్లలో అన్నం, కూర వడ్డించింది. రమేష్ తన ప్లేట్ దగ్గరకు లాక్కుని అన్నంకలుపుకోసాగాడు.

ఆమె కూడా కుర్చీలో కూర్చుని అన్నం కలుపుకుంటూ అతడితో అన్నది: "నాలుగేళ్ళనాడే నేను నీకు చెప్పాను. ఈ వ్యాపారాలు మనకొద్దు, హాయిగా ఏదైనా ఉద్యోగం చూసుకోమని. ఆనాడు నువ్వు వినలేదు ఈ రోజు అనుభవిస్తున్నావు"

సమయానుకూల సంభాషణ కాదది. అసలే మనఃస్థిమితం లేనివాణ్ణి మరింత బాధించే మాటలవి. ఉద్యోగ ప్రయత్నాలలో విసిగిపోయేకదా తాను వ్యాపారంలోనికి దిగింది- అర్థం చేసుకోదేం ఆమె!

ప్రస్తుత పరిస్థితిలో ఆమెతో మాటలు పంచుకోవడం తెలివైన పనికాదని అర్థం అయిందతడికి. అందుకే మౌనంగా భోంచేసి పైకి లేచాడు.

గదిలోకెళ్ళి పక్కమీద వాలాడు. చాలాసేపు ఆలోచనలతో దొర్లాడిన తర్వాత ఎప్పటికో నిద్ర పట్టింది. ఏనాడూ మధ్యాహ్నవేళ నిద్రపోవడం అలవాటులేదతనికి. కాని ఆరోజు సాయంత్రం ఐదుగంటలవరకూ గాఢంగా నిద్రపోయాడు.

ఐదు గంటలవేళ లేచి స్నానం చేశాడు. జానకమ్మ అందించిన కాఫీ తాగాడు.

ఇంట్లో కాసేపు కూర్చునేసరికి బోర్‌గా అనిపించింది. లేచి ఎక్కడికైనా వెళ్దాం అని పించింది- కాని ఎక్కడికి వెళ్ళాలి? సినిమాకా? షికారుకా? సినిమాల్లో ఇంట్రస్ట్‌లేదు. షికారు - ప్రస్తుత పరిస్థితిలో బయటతిరిగేందుకు ముఖం చెల్లడంలేదు.

అందుకే ఇంట్లోనే కూర్చోవాలి- తప్పదు. 'ఈసమయంలో ఎవరైనా తోడుంటే బాగుండును' మనసులోనే అనుకున్నాడతను. ఆ తోడు 'స్త్రీ' అయితే మరింత బాగుంటుందేమో!

జీవితంలో మొట్టమొదటిసారిగా అతనికి అనిపించింది– 'తనకూ ఒక స్త్రీ తోడుంటే బాగుండునేమోనని!'

అయితే పరిస్థితుల దృష్ట్యా స్త్రీతోడు గురించి ఆలోచించాడే కానీ, అతడికింకా తన ప్రశ్నకు జవాబు మాత్రం దొరకలేదు.

అంతేకాదు, ప్రస్తుతం అతడు తన మదిలో మెదలాడే ఆ ప్రశ్నను గురించి ఆలోచించే స్థితిలో కూడా లేడు...

మరికొద్దిసేపు కూర్చునేసరికి, అలవాటులేక పోవటంవలన ఇక ఇంట్లో కూర్చోలేకపోయాడు. రమేష్ లేచి డ్రసప్ అయ్యాడు.

అశోక్ ఇంటివైపు బయలుదేరాడు రమేష్. అశోక్ ఇంటికెడితే మునుపటంత ఫ్రీగా తనుండలేడు. వారికి సమయానికి డబ్బు తిరిగి ఇవ్వలేదని మనసులో ఉండొచ్చు. అలాగే బిజినెస్ తీసేసి పాపరయిన ఫీలింగ్ తనలో ఉంటుంది. అందుకే వారు ఎలా మాట్లాడినా తను మనస్ఫూర్తిగా ఏవిషయం మాట్లాడలేడు- అలా అని వారింటికి పోకుండానూ ఉండలేడు. ఎవరితోనైనా మాట్లాడకుండా నాలుగుగోడల మధ్య ఎంతసేపు కూర్చోగలడు?

"సార్... సార్"

రోడ్డువారగా నడుస్తున్న అతను ఆగాడు. తనను పిలిచిన ఆ పరిచయమైన గొంతు వినిపించిన వైపు చూశాడు.

హరిత రిక్షాలోనుండి దిగి, అతడి వైపు వచ్చింది.

"హలో హరితా" అన్నాడు రమేష్ చిరునవ్వుతో.

"ఎక్కడికి సార్ బయలుదేరారు?" అతడి దగ్గరగా వచ్చి అడిగిందామె.

"ఇంట్లో ఏమీ తోచకపోతే, అలా షికారుగా ఫ్రెండ్ ఇంటికి బయలుదేరాను... ఇంతకీ




# ఇతర డైలు అన్నీ కలిపి ఎంతమంది వాడుతారో అంతకంటే ఎంతో ఎక్కువ మంది తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైనే వాడుతారు.

ఇవిగో 3 మంచి కారణాలు:




రెండు నైసర్గిక రంగులలో లభ్యం— బ్లాక్ మరియు డార్క్ బ్రౌన్.

**1** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై మీ జుట్టుకు అందిస్తుంది నైసర్గిక రంగు, రూపం. జుట్టును మృదువుగాను, ఎలా కావలిస్తే అలా చక్కగా వుంచుకోడానికి దీనిలో కండిషనర్ కూడా వున్నది.
నిజానికి, వేసుకొన్నారని మీరు చెప్పితే తప్ప ఎవరికీ తెలియదు.

**2** ఇతర హేర్ డైలలాగా కాకుండా, తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైని సులభంగా, అనుకూలంగా వేసుకోవచ్చు.
అవును, జుట్టును షాంపూ చేసుకోవడం లాగే ఎంతో సులభం.

**3** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై నాణ్యత సంబంధంగా మీరు నిశ్చింతగా వుండవచ్చు. ఎందుకంటే, మీ జుట్టును, చర్మాన్ని సంరక్షించడానికి ఇది ప్రత్యేకం తయారు చేయబడినది.
పరిపూర్ణ రక్షణ—ఇదే గోద్రెజ్ వాగ్దానం.

**గోద్రెజ్®** తనంతట తానే వ్యాపించే పర్మనెంట్ హేర్ డై.



CLARION/B/GS/50/173/TL

నువ్వెక్కడికి?''

''నా సమస్యా అదే... ఆఫీసుకు శెలవుకదా! తోచక సినిమాకు బయలుదేరాను''

అవతల రిక్షా ఆమె కోసం వెయిట్ చేస్తోంది. ఆమె రిక్షావ్యక్తిని పిలిచి డబ్బులిచ్చేసింది. ''సినిమాకు టైమ్ అవుతున్నట్లుంది. వెళ్ళకూడదూ'' అన్నాడు రమేష్.

''సినిమా అన్నది కాలక్షేపం కోసమేకదా సార్! చూడాలని పెద్ద ఇంట్రెస్టేంలేదు... రండి సార్ అలా వెళ్దాం''

''ఎక్కడికి?'' అడిగాడు రమేష్.

''అలా పార్కుకు వెళ్దాం రండి''

''పార్కుకా... వద్దులే హరితా'' ఆమె వెంట నడవటం అతనికి ఇష్టంలేదు. ఓ పెళ్ళికాని అమ్మాయితో తనకు షికార్లేంటి?

''పోనీ సినిమాకు వెళ్దాం''

ఆమె తనను వదిలేలా లేదనిపించింది రమేష్‌కు. కొద్దిసేపు ఆలోచించి మెల్లగా తలూపాడు- ''అలాగే''

వెళ్తున్న ఆటోను పిలిచింది హరిత. ఇద్దరూ ఆటోలో కూర్చున్న తర్వాత ఆమె అడిగింది. ''ఏసినిమాకు వెళ్దాం సార్?''

''నీ ఇష్టం'' చెప్పాడతను.

ఆమె ఆటో డ్రైవర్‌తో ఓ థియేటర్ పేరు చెప్పింది.

కొద్ది నిమిషాల తర్వాత ఆటో ఆ థియేటర్ ముందు ఆగింది. ఆమె ఇవ్వబోతున్నా వారించి తనే ఆటోచార్జి చెల్లించాడు రమేష్. ఇద్దరూ లోపలకు నడిచారు.

లేడీస్ క్యూ చిన్నదిగా ఉండటంతో ఆమె వెళ్ళి రెండు టిక్కెట్లు తెచ్చింది. టిక్కెట్ల డబ్బు ఇవ్వబోతుంటే ఆమె గట్టిగా వారించింది.

''రండి సార్'' ఆమె హాలువైపు నడుస్తూ అంది.

అతడు ఆమె వెనుకే హాలు లోపలికి నడిచాడు- ఇద్దరూ పక్కపక్కనే కూర్చున్నారు. ఇంకా సినిమా బిగిన్‌కాలేదు.

''ఈరెండు నెలలు ఏం చేయాలనుకుంటున్నారు సార్'' అడిగింది హరిత.

''ఏం చేయాలా అన్నదాని గురించి నేనింతవరకూ ఆలోచించలేదు... ఏదో చేయాలని కూడా నాకు లేదు. ఈ రెండు నెలలు ఇంట్లోనే ప్రశాంతంగా గడపాలని ఉంది... మరి నువ్వేం చేయాలనుకుంటున్నావు. మరో ఉద్యోగమేదైనా చూసుకుంటున్నావా?'' ప్రశ్నించాడు రమేష్.

''ఉద్యోగం చేయడమన్నది నాకు కంపల్సరీ ఏంకాదు సార్! ఏదో ఇంట్లో ఖాళీగా కూర్చోలేక మీ దగ్గర చేరాను. ఇప్పుడు మరెక్కడైనా చేరాలని మాత్రం లేదు. రేపు మీరు మళ్లీ ఆఫీసు ఓపెన్ చేస్తే మీదగ్గర చేరతాను... చేర్చుకుంటారా?'' నవ్విందామె.

''తప్పకుండా'' సీరియస్‌గా జవాబిచ్చాడతను.

హాలులో లైట్లు డిమ్ కాసాగాయి. తెరపై స్లయిడ్స్ పడసాగాయి. ఇద్దరూ మాటలు ఆపేశారు.

స్లయిడ్స్ తర్వాత సినిమా బిగిన్ అయింది.

అంతవరకూ జీవితంలో ఆడపిల్ల పక్కన కూర్చుని సినిమాచూసి ఎరుగడు. వ్యాపారపరంగా తప్ప, మరేవిధంగానూ ఆడపిల్లలతో పలికికూడా ఎరుగడు. ఇప్పుడు ఓ ఆడపిల్ల పక్కన కూర్చుని సినిమా చూస్తుంటే ఏదో కొత్తగా, అనిర్వచనీయమైన భావన కలిగిందతనిలో.

రమేష్ సినిమా తెరవంక చూడసాగాడు. రెండున్నర గంటలసేపు హాలులో కూర్చోవాలంటే అతనికి చాలా విసుగు. ఎప్పుడోకాని అతడు సినిమాకి రాడు. అదీ ఏ స్నేహితుడైనా బలవంతపెడితే, అతని తృప్తికోసం ఆ తలనొప్పి భరిస్తుంటాడు.

ప్రస్తుతం హరిత కోసం ఆ బాధ భరిస్తున్నాడతను.

సినిమా చూస్తుండగా జరిగిందది – ఆమె చేయి తన చేతికి తగిలింది. చప్పున చేతిని వెనక్కులాక్కున్నాడతను. ఆమె సన్నగా నవ్విన చప్పుడు. అర్థమయిందతడికి. ఆమె ఇష్టపూర్వకంగానే తన చేతికి ఆమె చేతిని తగిలించిందని.

ఇప్పుడు తను చొరవచేస్తే? ... ఇష్టంలేదతనికి.




సాధారణంగా ఎక్కువమంది మగవాళ్లు ఇలాంటి పరిస్థితిలో అవతలి స్త్రీనుండి ఏం కోరుకుంటారు? ... సెక్స్.ఇప్పుడు తను చొరవ చేస్తే ... ఆమెతో శారీరకంగా కలవవచ్చు. తనున్న పరిస్థితులలో – ఈ బాధను కొద్దిసేపు మరచిపోవచ్చు ... కాని ఎందుకో సెక్స్ ద్వారా బాధను మరచిపోవడం తనకిష్టంలేదు. అది తాత్కాలిక ఉపశమనం మాత్రమే.

తనకిప్పుడు కావలసింది తాత్కాలిక ఉపశమనంకాదు. బాధను మరిపించేందుకు సెక్స్, నిద్ర, మత్తు వీటన్నింటికన్నా గొప్పది మరోటి ఉంది. చాలా గొప్పది అది. అదే – ఓదార్పు. ఆ ఓదార్పే తనకిప్పుడు కావాలి.

అమ్మ తనను ఓదార్చగలదు. కాని ఆమె తనను అర్థంచేసుకోలేదు. మరి తనను ఓదార్చే వారెవరు? ... ఊరడించి ధైర్యంచెప్పే వారెవరు?

హరిత తనమీద ఉన్న అభిమానంతో, తనను మరోవిధంగా ఆనందింపచేయాలనుకుంటోందేమో! కానీ అది తనకిష్టంలేదు. సారీ హరితా! ... అనుకున్నాడతను.

సినిమా ఇంటర్వెల్ అయింది. ఆలోచనలను ఆపేశాడు రమేష్. ఇద్దరూ బయటకు నడిచారు.

కేంటీన్‌లో రెండు డ్రింక్స్ తీసుకున్నాడు రమేష్. ఆమెకు ఒకటిచ్చి, తనొకటి అందుకున్నాడు.

"మీరు సినిమా చూస్తున్నారా?" డ్రింక్ సిప్ చేస్తూ అడిగింది హరిత.

అతడు కాస్త తడబడ్డాడు. "చూస్తూనే ఉన్నాను"

ఆమె చిరునవ్వు నవ్వింది. "నేను మిమ్మల్ని గమనిస్తూనే ఉన్నాను. మీరు సినిమా తెరవైపు చూస్తున్నా పూర్తిగా ఏవో ఆలోచనలలో మునిగి ఉన్నారు."

"అలా అని ఎందుకనుకుంటున్నావు?"

"గమనించాను కాబట్టి" చెప్పిందామె.

అతడు మౌనంగా ఉండిపోయాడు.

తాగిన సీసాలు టేబుల్‌మీద ఉంచి, హాలు లోపలికి నడిచారిద్దరూ.

ఏమనుకున్నదో ఏమో, ఆ తర్వాత చిలిపిపనులేమీ చేయలేదు హరిత.

సినిమా పూర్తయిన తర్వాత ఇద్దరూ బయటకు వచ్చారు.

ఆమెను ఆటో ఎక్కించాడు రమేష్.

"మళ్లీ ఎప్పుడు కనిపిస్తారు సార్" అడిగిందామె సీట్లో కూర్చుని.

"మళ్లీ ఎప్పుడో – ఇలాగే, లేదా రెండునెలల తర్వాత మన ఆఫీసులో"

"గుడ్‌నైట్ సర్"

"గుడ్ నైట్"

ఆటో ముందుకు సాగింది.

ప్యాంట్ జేబులు రెండింట్లో చేతులు వేసుకుని ముందుకు నడకసాగించాడు రమేష్.

ఒంటరివాడు తను. తనకుతోడు తన ఆలోచనలు – తనబాధలు. అంతే–

నవ్వుకున్నాడతను.

అతని అడుగులు ఇంటివైపుగా సాగాయి.

★ ★ ★

"నీ గురించి నేను ఎన్నో కలలుకన్నాను. తెలివైనవాడు నా కొడుకు. ప్రతి క్లాస్ ఫస్ట్ క్లాస్‌లో పాసవుతున్నాడు. రేపు ఉద్యోగం సులభంగా సంపాదించుకుంటాడు. భార్యాబిడ్డలతో కళ కళలాడుతుంటే చూడగలననుకున్నాను. కాని నీ బ్రతుకును నువ్విలాచేసి పెట్టుకున్నావు. అటు ఉద్యోగం లేదు. ఉద్యోగంవచ్చే వయస్సుకూడాఇంచుమించుగా దాటిపోతోంది. ఇటుచూస్తే వ్యాపారమనిపెట్టి ఉన్న కాస్తోకూస్తో పాడు చేశావు . ఇప్పుడు సంసారం గడవడం కూడా మనకు కష్టమే ... ఇక నీకు పెళ్లవుతుందని నాకు నమ్మకంలేదు. వ్యాపారం దెబ్బతిన్నదని తెలిసిన తర్వాత మీ మామయ్య మాత్రం తన కూతుర్ని ఎలా ఇస్తాడు? ... ప్చ్! పోయింది. మన బ్రతుకే నాశనమయిపోయింది"

కుర్చీలో రమేష్‌కు ఎదురుగా కూర్చుని ఉన్నది జానకమ్మ. ఆమె అలా అంటుంటే రమేష్ ఏమీ అనలేకపోయాడు. ఆమెను వినుక్కునే ఓపిక కూడా లేదతనికి.

ఇంట్లో తల్లిపోరు ఎక్కువయింది. అసలీ బాధలు, బాధ్యతలకు దూరంగా – సన్యసించి

ఏదైనా ఆశ్రమంలో చేరిపోవాలని ఉంది. ఆ ఇంట్లో నుండి వెళ్లిపోవాలని ఉంది. కాని కన్నతల్లిని వదిలి ఎలా?

తనమీద తనకే జాలివేసిన క్షణమది.

జానకమ్మ ఇంకా ఏదేదో అంటుంది. "నీకు నేను ఆరోజే చెప్పాను. వ్యాపారాలు మనకు అచ్చిరావని. మీనాన్నగారు కూడా వ్యాపారం చేశారు. చేసి మనలను ఇలాచేసి వెళ్లిపోయారు. ఇప్పుడు మళ్లీ నువ్వు మొదలుపెట్టావు".

ఆమె మాటలు సరిగా వినడంలేదు రమేష్. వినీవిననట్టుగా ఉండిపోయాడు. ఆమె చాలాసేపు అలాగే మాట్లాడి తర్వాత వంటగదిలోకి వెళ్లిపోయింది.

రమేష్ కిటికీలోనుండి బయటకు చూశాడు. అప్పుడే ఆకాశంలో చీకట్లు మునురుకుంటున్నాయి.

అతడు పైకిలేచి గదిలోకెళ్లి డ్రస్ మార్చుకున్నాడు. జానకమ్మతో షికారు వెళ్తున్నానని చెప్పి బయటకు వచ్చాడు.

అశోక్ ఇంటివైపుగా నడక సాగించాడు.

వారింటికి వెళ్ళాలని లేకపోయినా వెళ్ళకపోతే అపార్థం చేసుకుంటారేమోనన్న ఉద్దేశంతోనే అటు బయలుదేరాడతను.

వాకిట్లోనే నిలబడి ఉంది లక్ష్మి. అతడిని చూసి చిరునవ్వుతో ఆహ్వానించింది- "రా అన్నయ్యా"

గేటు తీసుకుని లోపలకు అడుగుపెట్టాడు రమేష్. "ఏం చేస్తున్నాడు మా వాడు?" అడిగాడతను.

"ఏం చేయట్లేదు. గదిలో కూర్చుని ఏదో పుస్తకం చదువుకుంటున్నారు. పిలుస్తానుండు"

అతడు వాకిలికివతలే అరనిముషం నిలబడ్డాడు. తర్వాత అశోక్ వచ్చాడు. "ఇక్కడే నిలబడ్డావేం రమేష్... రా లోపలకు" అన్నాడు.

"లోపలకు వద్దు. ఇక్కడే బయట కుర్చీలు వేసుకుందాం" చెప్పాడు రమేష్.

అశోక్ లోపలకు వెళ్ళి రెండు కుర్చీలు పట్టుకు వచ్చాడు. ఇంటి ముందున్న ఆరుబయట స్థలంలో కుర్చీలు వేసుకు కూర్చున్నారిద్దరూ.

"నిన్ను కలవాలని నిన్నా మొన్నా నేనెంతో ట్రై చేసాను. కాని బిజీవల్ల కలవలేకపోయాను" చెప్పాడు అశోక్.

మౌనంగా తలూపాడు రమేష్.

"ఆఫీసు కూడా లేదు కదా! ఇంట్లో ఏం చేస్తున్నావు?"

"ఏముంది? పుస్తకాలు చదువుకుంటూ టైమ్ పాస్ చేస్తున్నాను" బలవంతంగా నవ్వాడు రమేష్.

లక్ష్మి రెండు కప్పుల్లో కాఫీ తీసుకువచ్చి వారి ముందుంచింది. "లోపల పని ఉందన్నయ్యా. మళ్ళీ వస్తాను" వారి దగ్గర వెయిట్ చేయకుండా లోపలకు వెళ్ళిపోయిందామె.

ఇద్దరూ కాఫీ సిప్ చేయసాగారు. "మరి ఇప్పుడేం చేయాలనుకుంటున్నావు?" అడిగాడు అశోక్.

"మరో రెండు నెలలపాటు ఏమీ చేయకుండా ఉందామనుకుంటున్నాను" చెప్పాడు రమేష్.

"అది సరయినదే. ఈ బాధ తట్టుకునేందుకు రెండు నెలలు పడుతుంది — మరి ఆ తర్వాతయినా ఏం చేస్తావు?"

"భవిష్యత్ గురించి నేను ఇంకా ఏమీ ఆలోచించుకోలేదు. కె.యమ్.టి.వారు డబ్బు ఇస్తే యాడ్స్ తిరిగి స్టార్ట్ చేస్తాను లేదా అప్పటి పరిస్థితిని బట్టి ఏదో ఆలోచిస్తాను"

ఇద్దరి మధ్యా కొద్దిసేపు నిశ్శబ్దం.

రమేష్‌కు ఏదో గుర్తుకు రావడంతో, అశోక్ వంక చూసి అపాలజిటిక్‌గా అన్నాడు "సారీ అశోక్! నీ డబ్బు తీసుకుని నిన్ను చాలా ఇబ్బందిపెట్టాను... ఇలా జరుగుతుందని నేను ఊహించలేదు"

"ఫర్వాలేదు లేవోయ్. ఎలాగో అడ్జస్ట్ చేసుకున్నాను"

"చేసుకోగలవనే నేను నీ డబ్బు ఆపి, మిగతా వారికి కట్టేశాను"

"అయినా నువ్వు స్కూటర్ అమ్మకుండా ఉండాల్సింది"

"తప్పని పరిస్థితి అయింది" చెప్పాడు రమేష్.




"సరే... కానివ్వు. ఏం చేయగలం !" స్నేహితుడిచ్చిన ఊరడింపు అది.

ఆ టాపిక్‌ను అంతటితో కట్ చేయదలచుకున్నాడు అశోక్. అతనికి వెంటనే తోచింది ఒకనాటి తమ సంభాషణ. రమేష్ అడిగిన ఓ ప్రశ్న. రమేష్ ఆ ప్రశ్న అడిగిన రెండు మూడు రోజుల వరకూ తాను కూడా ఆ ప్రశ్నకు జవాబు గురించి ఆలోచించాడు. తనకు జవాబు దొరకలేదు. మరి రమేష్‌కు జవాబేమయినా దొరికిందా? అదే అడిగాడు అశోక్.

"రమేష్! చాలా రోజుల క్రితం నువ్వు నన్నో ప్రశ్న అడిగావు గుర్తుందా?"

"ఏం ప్రశ్న?" అడిగాడు రమేష్.

"అదే ... 'మగాడికి పెళ్లి అవసరమా'? అని..."

"ఓ... అదా?... అయితే?"

"నువ్వు ఆ ప్రశ్న అడిగిన తర్వాత రెండు మూడురోజుల పాటు ఆ ప్రశ్నకు జవాబు గురించి ఆలోచించాను. జవాబు తోచలేదు. ఆ తర్వాత మెల్లగా ఆ ప్రశ్నను మరచిపోయాను. ఇప్పుడు అనుకోకుండా గుర్తొచ్చింది. -- ఆ ప్రశ్నకు నీకు జవాబు తట్టిందా?"

రమేష్ తల అడ్డంగా ఊపాడు. "ఇంతవరకూ జవాబు తెలియలేదు"

అశోక్ అదోలా నవ్వాడు. "ఆ ప్రశ్నకు జవాబు ఇంతవరకూ తెలియలేదు. జవాబు దొరుకుతుందన్న నమ్మకమూ నాకు లేదు. మరి ఆ ప్రశ్నకు జవాబు తెలుసుకోకుండా నువ్వు పెళ్లిచేసుకోవు. ఇక ఆ ప్రశ్నకు జవాబు తెలుసుకునేది ఎప్పటికి? నువ్వు పెళ్లి చేసుకునేది ఎప్పటికి?"

సమాధానం చెప్పకుండా నవ్వేశాడు.మనసులో మాత్రం నాకు ఇక పెళ్లి అవుతుందా? అమ్మాయినిచ్చేవారు ఎవరైనా ఉన్నారా? నిన్నటివరకూ నేను మంచి పొజిషన్‌లో ఉన్నాను. కాబట్టి చాలామంది తమ అమ్మాయిలను చేసుకోమని నా వెంటపడ్డారు. అయితే నా ప్రశ్నకు సమాధానం అన్వేషించడంలో నేను పెళ్లిని తిరస్కరించాను. కాని ఈరోజు పరిస్థితి తిరగబడింది. నాకు ఉద్యోగం లేదు. పరిస్థితి సరిగా లేదు. మరి నాలాంటి వాడికి అమ్మాయినెవరిస్తారు?— అఫ్‌కోర్స్... తన మనస్సు ఈనాటికీ పెళ్లిపట్ల విముఖత కలిగే ఉంది—తన ప్రశ్నకు సమాధానం తెలుసుకోకుండా పెళ్లి చేసుకోవడం తనకెంత మాత్రం ఇష్టం లేదు'

అశోక్ మాటలు అతని ఆలోచనలను చెదరగొట్టాయి.

"రమేష్! ఈ పరిస్థితిలో నువ్వు పెళ్లి చేసుకోవడం మంచిదేమోనని నా ఉద్దేశం"

"ఎందుకని" అడిగాడు రమేష్.

"పెళ్లంటూ చేసుకుంటే నీకు కట్నం వస్తుంది. నీ మామగారు నీకు ఆర్థికంగా సహాయపడతారు" చెప్పాడు అశోక్.

పెదవి విరిచాడు రమేష్. "ఏదో స్వార్థంతో పెళ్లి చేసుకోవడం నాకిష్టంలేదు. డబ్బు ఆశించి నేను పెళ్లి చేసుకోలేను" స్థిరంగా పలికాడు రమేష్.

"ఈ జన్మకు నువ్వు బాగుపడవు" సన్నగా విసుక్కున్నాడు అశోక్.

జవాబుగా నవ్వేశాడు రమేష్.

మరికొద్దిసేపు అక్కడ కూర్చున్నాడు. చాలా పొద్దుపోయింది.

అశోక్ దగ్గర శెలవుతీసుకుని, ఇంటికి బయలుదేరాడు రమేష్.

★ ★ ★

ఆఫీసు క్లోజ్ చేసేసినప్పటినుండి, రోజూ పొద్దెక్కేవరకూ నిద్రపోవడం అలవాటయింది రమేష్‌కు.

ఆరోజు కూడా ఏడు గంటలకు నిద్రలేచాడు. కళ్లు నులుముకుంటూ హాలులో కొచ్చేసరికి సోఫాలో కూర్చుని కాఫీతాగుతున్న రఘురామయ్య కనిపించాడు. అప్పుడు గుర్తొచ్చిందతడికి... కొద్దిరోజుల క్రితం అమ్మ, మామయ్యగారి ఊరువెళ్తానంది. అందుకు జాబు వ్రాసిందట కూడా. అంటే మామయ్య ఇప్పుడు అమ్మను ఊరుతీసుకెళ్ళేందుకు వచ్చాడా?...

ఆలోచనలను కట్టిపెట్టి, మామయ్యను పలుకరించాడు రమేష్.

"ఎప్పుడొచ్చారు మామయ్యా?" ఆయన పక్కనే సోఫాలో కూర్చుంటూ అడిగాడు.

"ఇప్పుడే! ఒక గంటయిందిరా" చెప్పాడాయన.

జానకమ్మ రమేష్ గొంతు విని అతడికి కాఫీతెచ్చి ఇచ్చింది. కాఫీ కప్పు అందుకున్నాడతను.

"అత్తమ్మ, శ్వేత బాగున్నారా?"

"బాగున్నారు"

ఇద్దరిమధ్యా అరనిముషం మౌనం తర్వాత ఆయన అడిగాడు— "ఆఫీసు క్లోజ్ చేసేసేవటకదా?"

ఆ ప్రశ్నకు రమేష్ ముఖం వివర్ణమయింది "అవును" మెల్లగా అన్నాడతను. మామయ్య ఆ విషయం గురించి మరిన్ని వివరాలు అడుగుతాడేమో అనుకున్నాడతను. కాని ఆయన దాన్ని గురించి తిరిగి ప్రశ్నించలేదు.

"లేచి స్నానం చేయండి మామయ్యా" చెప్పాడు రమేష్.

"అలాగేలేరా" ఆయన పైకి లేచాడు. ఆయనను తనగదిలోకి తీసుకెళ్లాడు రమేష్.

ఆయన తన జరీఅంచు కండువాని కుర్చీ మీద వేసి, ఖద్దరుచొక్కా విప్పి హేంగర్‌కు తగిలించాడు.

"స్నానానికి నీళ్ళు పెట్టమని అమ్మకు చెప్పి వస్తాను" ఆయనతోచెప్పి వంటగదివైపు నడిచాడతను.

వంటగదిలో టిఫిన్‌చేసే ప్రయత్నాలలో ఉందామె. రమేష్ అరుదుగా ఆ గదిలోనికి వస్తుంటాడు.

రమేష్ వంటగదిలోపలికివెళ్ళి జానకమ్మ వక్కగానిలబడ్డాడు. "ఏంకావాలి?" అడిగింది జానకమ్మ.

"బాత్రూంలో మామయ్యకు నీళ్ళుపెట్టు— స్నానం చేస్తాడు."

"అలాగే" చెప్పిందామె.

అతడు కొద్దిగా తటపటాయించి, ఆమెను అడిగాడు.

"అమ్మా! మామయ్యా వచ్చి గంటకాకముందే ఆఫీసు క్లోజ్‌చేసిన సంగతి చెప్పేశావా? ... ఎందుకమ్మా చెప్పడం"

"ఎప్పటికైనా తెలియాల్సిందేకదా రమేష్. అందుకే ముందుగానే చెప్పేశాను" అన్నదామె.

అందులో రీజన్ కనుపించడంతో, మరింక మాట్లాడలేకపోయాడు రమేష్.

రఘురామయ్య స్నానం చేశాడు.

టిఫిన్ పూర్తయిన తర్వాత రమేష్ ఆయనతో అన్నాడు—

"మామయ్యా! రాత్రంతా ప్రయాణంచేసి అలసిపోయి ఉంటారు. కాసేపు నిద్రపోండి"

"అలాగే లేరా"

ఆయన పక్కమీద వాలాడు. అలసిపోయి ఉన్నాడేమో కొద్దిసేపటికి గాఢంగా నిద్రపట్టేసింది. ఆదమరచి నిద్రపోయాడాయన.

ఆయన నిద్రపోయేవరకూ ఆ గదిలోనే పేపర్ చూసుకుంటూ కూర్చుని ఉన్నాడు రమేష్. ఆయన నిద్రపోయిన వెంటనే పైకి లేచి హాలులో కొచ్చాడు. "అమ్మా! లైబ్రరీ వరకు వెళ్లొస్తాను" వంట గదిలోని తల్లికి వినపడేలా చెప్పాడు రమేష్.

"త్వరగా వచ్చెయ్యి. మీమామయ్య నీకోసమే భోంచేయకుండా ఉండిపోతాడు" చెప్పిందామె.

"అలాగే" బయటకు నడిచాడు రమేష్.

తిన్నగా లైబ్రరీకెళ్లాడు రమేష్. రెండు గంటలసేపు పుస్తకాలు చూస్తూ గడిపాడు.

తిరిగి ఇంటికి వచ్చేసరికి రఘురామయ్య లేచి, పేపర్ చూస్తున్నాడు. జానకమ్మ వంట పూర్తిచేసి, ఆయన ఎదురుగా కూర్చునిఉంది. మధ్యమధ్యలో ఆమె ఊరి విశేషాల గురించి అడుగుతోంది. ఆయన పేపర్ చూస్తూనే ఆమె ప్రశ్నలకు జవాబు చెబుతున్నాడు.

రమేష్ ఆయన పక్కనే నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

కొద్దిసేపటి తర్వాత ఆయన పేపర్ పక్కన పడేశాడు. జానకమ్మ అడిగే వివరాలకు సావధానంగా సమాధానం చెప్పసాగాడు.

మరో గంట గడిచింది.

జానకమ్మ పైకిలేచి, వారిద్దరిని భోజనానికి పిలిచింది. ఇద్దరూ డైనింగ్ టేబుల్‌ముందు కూర్చున్నారు.

ఆమె వారిద్దరికి వడ్డించి, ఎదురుగా కూర్చుంది.

భోంచేస్తూ రఘురామయ్య రమేష్‌తో అన్నా



డు—

"రమేష్! క్రితంసారి తిరిగి వెళ్లేప్పుడు, ఇక ఈ ఇంటికి ఎప్పటికీ రాకూడదని అనుకున్నాను. కాని తోడబుట్టిన చెల్లెలు పదిరోజులు పుట్టింట్లో ఉంటాను తీసుకెళ్లమనిరాస్తే ఏ అన్న మాత్రం రాకుండా ఉంటాడు? ఎంత రాకూడదని అనుకున్నా, రాకుండా ఉండలేక పోయాను" ఆయన గొంతు జీరబోయింది.

రమేష్ నిశ్శబ్దంగా ఉండిపోయాడు. ఆ అన్నాచెల్లెళ్లమధ్య ఉండే అనుబంధం అతనికి తెలుసు. ఆ చెల్లెలంటే ఆయనకు విపరీతమైన ప్రేమ. ఆ ప్రేమతోనే ఆయన చెల్లెలు భర్తను కోల్పోయినపుడు, ఎంతో సహాయంచేసి ఆ కుటుంబాన్ని నిలబెట్టాడు. తన చదువు విషయంలోనూ, ఆ తర్వాత వ్యాపారం కోసం ఆర్థికంగానూ ఎంతో సహాయంచేశాడు. ఇదంతా చెల్లెలిమీద ప్రేమతో చేశాడు తప్ప, తనను అల్లుడిని చేసుకోవాలన్న స్వార్ధంతో మాత్రం కాదు ... నిజానికి ఆయనకున్న ఆస్తికి, ఆయన తనకన్నా అన్నివిధాల గొప్పవాడినే అల్లుడిగా చేసుకోగలడు...

"నేనీరోజు ఇలా వస్తుంటే మీ అత్తయ్య అభ్యంతరపెట్టింది. మనలను కాదన్నవారింటికి మనం వెళ్లడం ఏమిటి? అన్నది కాని ఆమెకు నర్దిచెప్పి ఇలా వచ్చాను" అన్నాడాయన.

"రక్తసంబంధం విలువ మనకు తెలుసు కాని వారికేం తెలుసు అన్నయ్యా" నిట్టూర్చిందామె.

భోజనాలు పూర్తయ్యాయి. ఆయన చేతులు కడుక్కుని లేచాడు.

"ఏమ్మా జానకీ! ఎప్పుడు బయలుదేరతావు?"

జానకమ్మ కొద్దిసేపు మౌనంగా ఆలోచించింది. తర్వాత చెప్పిందామె "నేనిప్పుడు రాలేనులే అన్నయ్యా. ఆ రోజేదో రమేష్ మీద కోపంతో నీకలా జాబు రాశాను. కాని ఇంతలో అనుకోకుండా వాడి బతుకిలా అయిపోయింది. వ్యాపారం దెబ్బతినేసింది. ఈ పరిస్థితులలో నేను కూడా వాడిని వదిలివచ్చేస్తే... వాడు పిచ్చివాడయిపోతాడు"

"మరి నిన్ను తీసుకువస్తానని ఇంటి దగ్గర చెప్పివచ్చాను" అన్నాడు రఘురామయ్య.

"అందుకే నేనొకటి ఆలోచించాను. రమేష్‌ని కోటూరువల్లె పంపిద్దామనుకుంటున్నాను".

"నన్నా?" ఆశ్చర్యపోయాడు రమేష్.

"అవును-నిన్నే" చెప్పింది జానకమ్మ.

"వద్దులేమ్మా... ఎప్పుడో చిన్నప్పుడు వెళ్లాను ఆ పల్లెటూరు. ఆ కొత్త ప్రదేశం, కొత్త వ్యక్తులు.... ఉండలేనేమోనమ్మా" తడబాటుగా అన్నాడతను.

"హాయిగా ఉండగలవు. కొత్త ప్రదేశం, కొత్త వ్యక్తులు- నీ మనస్సు కుదుటపడుతుంది. పల్లెటూరు వాతావరణం ప్రశాంతంగా కూడా ఉంటుంది" చెప్పింది జానకమ్మ.

"మీ అమ్మ చెప్పింది నిజంరా. వ్యాపారంలో దెబ్బతిని నీ మనసు దెబ్బతిని ఉంది. అలాంటి ప్రదేశంలో గడిపితే నీ మనసు కాస్త నరిఅవుతుంది" రఘురామయ్య జోక్యం చేసుకుంటూ అన్నాడు.

"పట్నంలో పెరిగిన నేను, ఒక్కరోజైనా ఆ పల్లెలో ఉండగలనా? అక్కడకు ఇవ్వాల్టి పేపర్ రేపు వస్తుంది, ఎలాంటి కాలక్షేపం ఉండదు. ఉండలేనేమోనని అనుమానంగా ఉందమ్మా" చెప్పాడు రమేష్.

"ఇక్కడికన్నా అక్కడే ప్రశాంతంగా ఉండగలవు. నా మాటవిని మీ మామయ్యతో కోటూరు పల్లె వెళ్లు. ఓ నెలరోజులపాటు అక్కడే గడుపు. ఈ లోపల నీకు రావలసిన మొత్తం వస్తుందో లేదో తేలిపోతుంది. ఆ తర్వాత పట్నం వచ్చి ఏదో ఒక నిర్ణయం తీసుకుందువు"

ఆమె చెప్పింది కూడా సరయినదేనని అనిపించింది రమేష్‌కు. కాని ఎన్నడూ వెళ్లని ఆ పల్లెటూరుకు, అత్తామామల మధ్యకు వెళ్లాలంటే ఏదో బిడియంగా ఉంది. ముఖ్యంగా తన పొజిషన్ డౌన్ అయినపుడు వెళ్లాలంటే గిల్టీగా ఉంది. కాని అమ్మ మాటను కాదనలేకపోతున్నాడు. అందుకే తన అంగీకారం తెలియచేశాడు.

"అలాగేనమ్మా! నీ ఇష్టప్రకారమే కోటూరుపల్లె వెళ్తాను... అలాగే మామయ్యా... మనం మీ ఊరికి వెళ్దాం"

జానకమ్మ ముఖాన రిలీఫ్ కనిపించింది.




రఘురామయ్య కూడా అల్లుడి రాకపట్ల ఆనందంగా కనిపించాడు.

"వాడితోపాటు నువ్వూ ఊరికి రావచ్చుకదమ్మా" చెల్లెల్ని అడిగాడాయన.

"ఇద్దరం ఒకేసారి రావడం అపోహలకు దారితీస్తుందో ఏమో! అంతగా అయితే నేను తర్వాత వస్తాను" చెప్పింది జానకమ్మ.

"సరే-నీ ఇష్టం" అన్నారాయన.

కొద్దిసేపు నిశ్శబ్దం తర్వాత ఆయన అడిగారు "రమేష్! మరి మనం ఎప్పుడు బయలుదేరదాం?"

"రేపు రాత్రికి బయలుదేరదాం" జవాబిచ్చాడు రమేష్.

"పొలం కోతకు వచ్చివుంది. త్వరగా వెళ్లి వరికోత కోయించాలి. ఏదో మీ అమ్మ జాబు రాసిందని ఎక్కడి పనులక్కడ వదిలేసి ఇలా వచ్చాను. మనం త్వరగా వెళ్లడం మంచిది. రేపు వేకువనే ట్రైన్ ఉంది. ఆ ట్రైన్‌కి బయలుదేరదాం. రేపు సాయంత్రానికి ఊరు చేరుకోవచ్చు"

"నీ ఇష్టం మామయ్యా" అంగీకరించాడు రమేష్.

"సరే... వేకువనే బయలుదేరదాం. తయారయివుండు"

తలూపాడు రమేష్.

మరికొద్దిసేపు సంభాషణ తర్వాత ఆయన పైకిలేచి, నిద్రపోయేందుకు పక్కగదిలోకెళ్లాడు.

జానకమ్మ ముఖం ఇప్పుడు చాలా సంతోషంగా ఉంది. రమేష్ అంత తేలిగ్గా అంగీకరిస్తాడని ఆమె అనుకోలేదు. అతడు కోటూరుపల్లె వెళ్లేందుకు అంగీకరించడంతో ఆమె ఉత్సాహంగా ప్రయాణానికి ఏర్పాట్లు చేయసాగింది.

రమేష్ ఆ పల్లెకు వెళ్లడం గురించి కొద్దిసేపు ఆలోచించాడు. అది సరయిన పనిగానే తోచింది. కాని.... తన స్థితి తగ్గిన తర్వాత వెళ్తున్నాన్నదే కాస్త గిల్టీగా అనిపించింది. అయినా ఇక తప్పదు...

లేచి రేపటి ప్రయాణానికి తయారుకాసాగాడు.

బట్టలు తల్లికి ఉతికేందుకు ఇచ్చాడు. ఉతికిన బట్టలు సాయంత్రం ఇస్త్రీ చేసుకున్నాడు. ఇస్త్రీ బట్టలు సూట్‌కేస్‌లో ఉంచాడు. అప్పటికి చీకటిపడింది.

అతడు అశోక్‌కు ఫోన్‌చేసి తను గ్రామం వెళ్తున్న సంగతి చెప్పాడు. అదిసరయిన నిర్ణయమే అన్నాడు అశోక్.

సాయంత్రానికి బట్టలు సర్దుకోవడం దగ్గర నుండి అన్నీ రెడీ చేసుకున్నాడు రమేష్.

ఆ రాత్రి కాస్త ముందుగానే భోంచేసి పడుకున్నారు వారు.

రమేష్ పెందలకడ పడుకున్నాడే కాని నిద్రరాలేదు. అతడికి కోటూరుపల్లెలోని సుందరమ్మత్త, శ్వేత గుర్తుకువచ్చారు. ఎప్పుడో చిన్నప్పుడు చూసిన ఆ పల్లె పరిసరాలు గుర్తుకువచ్చాయి.

రేపు తను ఆ పల్లెకు వెళ్తున్నానంటే ఎగ్జయిటింగ్‌గా అనిపించింది. ఏదో కొత్త లోకంలోకి వెళ్ళబోతున్నట్లుగా తోచింది.

ఆ రాత్రి నిద్రపట్టేందుకు అతడు చాల కష్టపడవలసివచ్చింది. పక్కమీద దొర్లాడి ఎప్పటికో నిద్రపోయాడతను.



వేకువనే నిద్రలేపింది జానకమ్మ వారిని. ఆమె ఏ అర్ధరాత్రివేళనో నిద్రలేచినట్టుంది. అప్పటికే నీళ్ళు వేడిచేసివుంది.

ఇద్దరూ స్నానం చేశారు. స్నానం పూర్తయి వెంటనే వారికి కాఫీ అందించింది ఆమె.

కాఫీ తాగి డ్రసప్ అయ్యాడు రమేష్. సూట్‌కేస్ తీసుకుని హాలులోనికి వచ్చాడు. అప్పటికే చేతిసంచితో సోఫాలో కూర్చుని ఉన

డు రఘురామయ్య. అతడు సోఫా పక్కనే నిలబడ్డాడు.

రఘురామయ్య చేతినంచీ పట్టుకొని నిలబడ్డాడు.

"వస్తానమ్మా" జానకమ్మతో చెప్పాడు రమేష్.

"వస్తాను జానకీ" రఘురామయ్య ఆమెకు చెప్పాడు.

ఆమె తలూపింది.

ఇద్దరూ బయటకు నడిచారు.

కొద్దిదూరం నడిచి సెంటర్ చేరుకున్నారు. రైల్వే స్టేషన్‌కు రిక్షా మాట్లాడారు.

స్టేషన్ చేరుకున్న తర్వాత రఘురామయ్య టిక్కెట్లు తీసుకున్నాడు. ఇద్దరూ ప్లాట్‌ఫారం మీదకు చేరారు.

రైలు వచ్చేందుకు ఇంకా పదినిమిషాలు వ్యవధి ఉంది. రమేష్ బుక్‌స్టాల్‌లో రెండు పుస్తకాలు కొన్నాడు.

పదిహేను నిమిషాల తర్వాత రైలు వచ్చి ప్లాట్‌ఫారం మీద ఆగింది. పెద్దగా జనం లేరు. ఇద్దరూ కంపార్ట్‌మెంట్‌లోనికి ఎక్కి కిటికీ పక్కగా, ఎదురెదురుగా కూర్చున్నారు.

అది ప్యాసింజెర్ బండి. స్టేషన్‌లో పది నిమిషాలు ఆగింది. అంతసేపు ఆగివున్నా బోర్‌గా అనిపించలేదు రమేష్‌కు. అదే వ్యాపారనిమిత్తం బయలుదేరినప్పుడు ఎప్పుడూ స్పీడ్. ఒక్కనిమిషం ఆలస్యమైనా విసుక్కునే వాడు తను. మరి ఇప్పుడేమిటి తనకింత నిశ్చింత జీవితంలోని మరోకోణంలోనికి అడుగుపెడుతున్నట్లుగా ఉంది. అతడికి ఆ కొత్తజీవితం తాలూకు అనుభవం చాలా గమ్మత్తుగా ఉంది.

రైలు కూతవేసి మెల్లగా కదిలింది.

చీకటిని విడగొట్టి వెలుతురు ప్రసరిస్తూ ఉంది. వెలుగురేఖలు తూర్పు దిక్కునుండి పైపైకి వస్తున్నాయి.

వెలుగురేఖలతోపాటు రైలు ముందుకుపోతూ ఉంది. కిటికీ పక్కనుండి దూసుకుని వెనక్కుపోతున్నాయి. నేల, చెట్లు, కొండలు అన్నీ రైలు... వెనక్కు వెళ్ళిపోతున్నాయి.

ప్రాతఃకాలంవేళ ప్రకృతి సౌందర్యం అపురూపంగా ఉంది.

అతడు జీవితంలో ఎన్నో ప్రయాణాలు చేశాడు. ఎప్పుడూ అతనికి ఇటువంటి అనుభూతి కలుగలేదు. నిజమే! తనకప్పుడు ప్రకృతిని ఇంత తీరికగా చూసే సమయం ఎక్కడిది?

రైలు ఒక చిన్నస్టేషన్‌లో ఆగినప్పుడు రఘురామయ్య కిందకుదిగి రెండు ఆపిల్‌పళ్ళు కొనుక్కొచ్చాడు. రమేష్‌కు ఒకటిచ్చి, తానొకటి ఉంచుకున్నాడాయన.

తిరిగి రైలు కదిలింది. ఎప్పటిలానే చెట్లు, కరెంట్ స్థంభాలు అన్నీ వెనక్కు పరిగెడుతున్నాయి.

మధ్యాహ్నం వేళకు ఓ చిన్నస్టేషన్‌లో రైలు ఆగింది. రఘురామయ్య ముందు దిగాడు. ఆయన వెనుకే ప్లాట్‌ఫారంమీద అడుగుపెట్టాడు రమేష్.

అతిచిన్న స్టేషన్ అది. ఓ పదిపల్లెలు ఆ స్టేషన్ పరిధిలో ఉన్నాయి.

రైలు కదిలి వెళ్ళిపోయేవరకూ వారిద్దరూ ప్లాట్‌ఫారం మీదే ఉన్నారు. రైలు ముందుకు వెళ్ళిపోయిన తర్వాత ప్లాట్‌ఫారం దిగి రైలు పట్టాలను దాటుకుని అవతలకు నడిచారు వారు.

రైల్వే స్టేషన్ నుండి సన్నని కాలిబాట మొదలయింది. బహుశా ఏ రెండుమైళ్ళో ఉంటుంది, వెళ్ళవలసిన కోడూరుపల్లె గ్రామం.

వారిద్దరూ నడక సాగించారు.

కొద్దిదూరం నడిచిన తర్వాత ఆ కాలిబాట పచ్చని పొలాలమధ్యకు దారితీసింది.

పచ్చనిపొలాలమధ్య వారి నడక సాగింది. గట్టు వెంబడి నడుస్తుంటే పాదాలకు తగులుతోంది పచ్చనిగడ్డి. ఎర్రని ఎండవేళన కూడా పైరగాలి చల్లగా సోకుతుంది.

గంట ప్రయాణం తర్వాత వారు గ్రామంలో ప్రవేశించారు.

మిట్టమధ్యాహ్నం కావటంతో వీధుల్లో జనం ఎవ్వరూ తిరగటంలేదు.

ఎవరైనా ఒకరిద్దరు కనుపిస్తే రఘురామయ్యను పలకరిస్తున్నారు. "ఎక్కడినుంచండయ్యా" అంటూ,




ఆయన నిలబడి తనెక్కడనుండి వస్తున్నది చెపుతున్నాడు.

"ఆయన ఎవరయ్యా" అడుగుతారు వారు.

"మన జానకమ్మ కొడుకు"

"చాలా పెద్దవాడు అయ్యాడే" ఆశ్చర్యపడ్డారు వాళ్ళు.

మధ్యాహ్నంవేళ అవడంతో ఎంతో మంచిదయింది అనుకున్నాడు రమేష్. అదే సాయంత్రం అయి ఉంటే పొలాలనుండి తిరిగి వచ్చేవారికి ఆయన సమాధానం చెపుతుంటే, వెయిట్ చేయలేక తను చచ్చి ఉండేవాడు.

వారు రెండువీధులు దాటారు.

ఆ వీధిలోనే మామయ్య ఇల్లు... ఇంటిని సమీపించారు.

విశాలమైన ఆవరణ అది. వీధిగేటు దాటితే ఎత్తయిన అరుగులు, అరుగులమీదకు వాలి పెంకులవరండా, ఘనమైన వాకిలి, బలమైన తలుపులు...

ఆ లోగిలిలో అడుగుపెడుతుంటే ఉద్వేగం ఏర్పడింది అతడిలో. చిన్ననాడు అక్కడ గడిపిన బాల్యస్మృతులు గుర్తుకువచ్చాయి.

అతడు వీధిగేటు దాటి లోపలికి అడుగుపెట్టబోయి ఒక్కక్షణం సందేహంగా ఆగాడు. రెండు అడుగులు ముందుకువేసి, అల్లుడు తనను అనుసరించటంలేదని తెలుసుకుని వెనుతిరిగి చూశాడు రఘురామయ్య.

వీధి వాకిట దగ్గరే ఆగి ఉన్నాడు రమేష్.

ఆయన చిన్నగా నవ్వి "రా రమేష్" అన్నాడు.

రమేష్ మెల్లగా తలాడించాడు. ఎడమచేతిలోని సూట్‌కేస్ కుడిచేతిలోనికి మార్చుకుని లోపలికి అడుగుపెట్టాడు.

సరిగ్గా అప్పుడే అతడి కనులముందు ఒక మెరుపుమెరసి మాయమయింది.

తండ్రి గొంతువిని బయటకు వస్తోందికాబోలు ఆమె అతడిని చూసి చప్పున లోపలకు వెళ్ళిపోయింది.

సుందరమ్మ లోపలనుండి ఇవతలకు వచ్చింది. రమేష్‌ను చూసి ఆమెముఖం విప్పారింది. "రా బాబూ!" అతడి చేతిలోని సూట్‌కేస్ తీసుకుని పక్కనే ఉన్న పాలేరుకు అందించింది.

అక్కడే ఉన్న బక్కెట్‌లోని నీళ్లు చెంబుతో ముంచి అతడికి అందించింది.

అతడు కాళ్ళు కడుక్కుని వరండాలోకొచ్చాడు.

రఘురామయ్యకూడా కాళ్ళు కడుక్కుని లోపలికి వచ్చాడు.

"మంచినీరు తీసుకురారా రంగా" పక్కనే ఉన్న పాలేరుకు చెప్పిందామె.

పాలేరు లోపలికి వెళ్ళి చెంబునిండా నీళ్ళు, రెండు గ్లాసులు పట్టుకొచ్చాడు. ఆమె అవి అందుకుని వారిద్దరికీ నీళ్ళందించింది.

"అమ్మ బాగుందా బాబూ?" అడిగింది సుందరమ్మ.

"బాగుందత్తమ్మా" చెప్పాడతను.

"చిన్నప్పుడెప్పుడో వచ్చావు ఈ పల్లెకు- తిరిగి ఇప్పుడు వస్తున్నావు"

జవాబుగా నవ్వాడు రమేష్.

"ఎర్రటి ఎండలోపడి వచ్చారు. రండి భోంచేద్దురుగాని! భోంచేసి విశ్రాంతిగా పడుకుందువుగాని"

రమేష్ హాలులోపలికి నడిచాడు.

అందెల చప్పుడు ఒకగదిలోనుండి మరో గదిలోకి వెళ్తున్న ధ్వని.

సుందరమ్మ రమేష్‌ను తీసుకుని ఓ గదిలోకి వెళ్లింది. "సూట్‌కేస్ ఈ గదిలో వుంది బాబు. బట్టలు మార్చుకుని రా- అన్నం వడ్డిస్తాను"

తలూపాడు రమేష్.

రమేష్ ప్యాంటువిప్పి గోడకున్న హేంగర్‌కు తగిలించాడు. సూట్‌కేసులోనుండి లుంగీతీసి కట్టుకున్నాడు.

దూరంగా అందెల చప్పుడు వినిపిస్తోంది అతడికి వీనులవిందుగా. 'ఆ క్షణం' ఆమె రూపం లీలగా కనిపించింది అంతే.

తన కళ్లముందు నిన్నటివరకూ చిన్ననాడు తను చూసిన పిలకజడ శ్వేత మాత్రమే గుర్తుంది. ఆమె ఇంత చక్కని ఆకారం సంత

రించుకుని వుంటుందని తను ఊహించనేలేదు.

అడుగుల చప్పుడు విని అతడు వాకిలి వంక చూశాడు. రఘురామయ్య వాకిలివరకూ వచ్చి పిలిచాడు- "రమేష్! భోంచేద్దాంరా"

మౌనంగా మామ వెనుకే నడిచాడు రమేష్. ఇద్దరూ వంటగదిలోకి వెళ్లారు.

అప్పటికే పీటలువేసి, విస్తళ్లువేసి వుంది సుందరమ్మ.

"రండి! ఉదయం టిఫిన్ కూడా చేయలేదటకదా! ఇప్పుడు కూరలు కూడా ఏమీలేవు. తయారుచేయాలంటే ఆలస్యమవుతుంది. ఇప్పటికే ఆకలిమీద వుండి ఉంటారని వడ్డించేస్తున్నాను" అన్నది సుందరమ్మ.

ఇద్దరూ పీటలమీద కూర్చున్నారు. డైనింగ్ టేబుల్ అలవాటేమో, పీటమీద కూర్చోవటం సరిగా కుదరలేదు రమేష్‌కు. మామయ్యను చూసి అనుకరించాడతను.

గడ్డపెరుగు, గోంగూరపచ్చడి, కూర, ఆమ్లేట్, రసం ముందుంచి అన్నం వడ్డించిందామె.

భోజనం ముగిసింది.

"నీ గదిలోనే మంచం వేసివుంది పడుకో రమేష్! ప్రయాణంచేసి అలసిపోయి వుంటావు"

అతడు లేచి వంటగదిలోనుండి ఇవతలకు వస్తుంటే అప్పుడు తన గదిలోనుండి మరో గదిలోనికి వెళ్తున్న అందెల చప్పుడు విని



పించింది.

ఆమె ఒకసారి ఎదుటపడితే బాగుండునని పించింది. ఈ మధ్యకాలంలో ఆమె ఎంతగా అందాలు సంతరించుకుందో తనివితీరా చూడాలనిపించింది... కాని ఎక్కడ? ఆమె తన కంటికి కనిపించకనే తప్పుకు తిరుగుతోంది.

అతడు గదిలోనికి అడుగుపెట్టాడు. అప్పటికే ఆ గదిలోనికి ఒక మంచం చేర్చబడి వుంది. దానిమీద పరువు, తెల్లని దుప్పటి పరచివున్నాయి.

ఆ ఏర్పాట్ల పర్యవేక్షణ ఆమేనని అతడు ఊహించాడు.

కిటికీ పక్కగా వేసివుంది మంచం. మంచంమీద కూర్చుంటే దూరంగా వున్న పశువులపాక, గడ్డివాము, వేపచెట్టు కనిపిస్తున్నాయి.

అతడు పక్కమీద వాలాడు.

ఆఫీసు గురించిన ఆలోచనలు చుట్టుముట్టాయి.

'కె.ఎం.టి. వారు డబ్బు ఇస్తారా...? ఒకవేళ ఇవ్వకపోతే అప్పులు ఎలా తీర్చాలి? తన భవిష్యత్తు ఎలా...'

ఆలోచనలతోనే నిద్రపట్టింది అతడికి.

నిద్ర లేచేసరికి సూర్యుడు పశ్చిమదిక్కున అస్తమిస్తున్నాడు.

కిటికీలోనుండి ఆవైపు చూశాడతను. అతని కళ్లు మిలమిల మెరిశాయి.

పట్టుపావడ నేలను జీరాడుతోంది. పైట గాలికి మెల్లగా కదులుతుంది. నల్లని ముంగురులు ముఖానపడుతున్నాయి.

పాలేరు రంగన్న పాలు పితుకుతున్నాడు.

నెల కూడా నిండని కోడెదూడ గంతులేస్తోంది. ఆ కోడెదూడను తరుముకుని పట్టుకుని ముద్దాడుతోందామె.

ఆ సన్నివేశం చూసేందుకు చాలా అద్భుతంగా అనిపించింది అతడికి. రెప్పవేయకుండా అటే చూడసాగాడు అతడు.

'ఈ పదేళ్లలో శ్వేత చాలా అందంగా తయారయింది' మనసులోనే అనుకున్నాడతను. ముఖ్యంగా ఆ వారదేసి కన్నులు చాలా అపురూపంగా వున్నాయి.

కోడెదూడను ముద్దాడుతున్న ఆమె ఎందుకో తిరిగి అటువైపుగా చూసింది. కిటికీలో నుండి తననే గమనిస్తున్న అతడిని చూడగానే సిగ్గు ముంచుకు వచ్చింది.

మోకాళ్లమీద కూర్చుని వున్న ఆమె ఒక్క ఉదుటున పైకిలేచి ఇంటిలోపలికి పరుగెత్తింది.

అతడు మెల్లగా నవ్వుకున్నాడు. మరికొద్ది సేపు కిటికీ దగ్గరే నిలబడ్డాడు.

కాసేపు తరువాత హాలులోనికి వచ్చాడు. సుందరమ్మ కాఫీ తీసుకుని వచ్చి అతడికి ఇచ్చింది.

కాఫీ తాగాడతను.

బయట వరండాలో వున్న వాలుకుర్చీలో కూర్చుని పుస్తకం చదువుకోసాగాడు.

చుట్టూ చీకటి ముసురుకుంటోంది.

పాలేరు రంగన్న వచ్చి అతడిముందు నిలబడ్డాడు. "స్నానానికి నీళ్లు తోడాను బాబయ్యా" అన్నాడు.

"వస్తున్నాను" పైకి లేచాడు రమేష్.

పుస్తకం మూసి పక్కన పెట్టేసి, తన గదిలోకి వెళ్లాడు. మరో కొత్త లుంగీ అందుకుని బాత్‌రూమ్‌వైపు నడిచాడు.

స్నానంచేసి వచ్చి తిరిగి వరండాలో కూర్చుని ఆ పుస్తకం అందుకున్నాడు.

చాలా పొద్దుపోయిన తరువాత రఘురామయ్య ఇంటిలోపలికి వస్తూ కనిపించాడు.

"పొలంలోకి వెళ్లానురా. రేపో, ఎల్లుండో కోత కోయాలి. కూలీలను చూడమని మేస్త్రీకి చెప్పి వచ్చాను"

రఘురామయ్య స్నానం చేశాడు.

ఇద్దరూ భోజనానికి కూర్చున్నారు.

చాలారకాల కూరలు వడ్డించింది సుందరమ్మ.

భోంచేసి వచ్చి గదిలో పడుకున్నాడు.

చాలాసేపటివరకూ నిద్రపట్టలేదు. పక్కనే ఉన్న పుస్తకం అందుకున్నాడు రమేష్.

చదువుకుంటున్న అతడికి సన్నగా అందెల చప్పుడు వినిపించింది. అడుగులో అడుగు




వేసుకుంటూ సవ్వడి రాకూడదన్నట్లుగా కిటికీ వైపుగా నడిచి వస్తోందామె.

బహుశా నిద్రపోయాడేమోనని చూసే ఉద్దేశం!

రమేష్ చప్పున పుస్తకం అడ్డుతొలగించి, కిటికీవంక చూశాడు. ఆమె ముఖం చప్పున తప్పుకుంది.

అతడు మెల్లగా నవ్వుకున్నాడు.

వెంటనే అందెల సవ్వడి దూరంగా వెళ్ళిపోయింది.

★ ★ ★

ప్లేట్‌లో ఇడ్లీలుపెట్టుకుని అతడి గదిలోనికి వచ్చింది సుందరమ్మ.

పక్కనే ఉన్న టీపాయ్ మంచం దగ్గరగా లాగి దానిమీద టిఫిన్ ప్లేట్ పెట్టింది.

"ఎందుకత్తమ్మా! నేనే వచ్చేవాడిని కదా!" నొచ్చుకుంటూ అన్నాడతను.

"ఫర్వాలేదులే"

అతడు ఇడ్లీతుంచి చట్నీ అద్దుకుని నోట్లో పెట్టుకున్నాడు. కారంగా అనిపించింది. మంచినీళ్ళకోసం చూస్తే లేవు.

అది గుర్తించిన ఆమె శ్వేతను పిలిచింది– "శ్వేతా! తొందరగా ఓ గ్లాసు నీళ్ళు తీసుకురామ్మా"

వంటగదిలోని శ్వేత బిందెలోని నీరు ముంచిన చప్పుడు. ఆమె అతడి గది వాకిలివరకూ పరుగెత్తుకొచ్చింది. ఆమె అందెల చప్పుడు అక్కడ ఆగిపోయింది.

కూతురు సిగ్గుపడుతోందని గ్రహించిన సుందరమ్మ సన్నపాటి నవ్వుతో అంది "ఫర్వాలేదురామ్మా... మీ బావే కదా!"

అరనిముషం నిశ్శబ్దం తర్వాత ఆమె ఆ గదిలోనికి అడుగుపెట్టింది తలవంచుకుని.

ఆమె చేతిలోని నీళ్లగ్లాసు అందుకుని గటగటా త్రాగేశాడు రమేష్.

అతడు చేతిలోని గ్లాసు అందుకోగానే తుర్రున పారిపోయింది శ్వేత. అతడు మనసులోనే నవ్వుకున్నాడు.

సుందరమ్మ మెల్లగా నవ్వుకుని ఆ గ్లాసు తీసుకుని వెళ్ళి, మరో గ్లాసు నీళ్ళు పట్టుకు వచ్చింది.

అతడు టిఫిన్‌తిని ఆ నీళ్ళతో చేయి కడుక్కున్నాడు.

సుందరమ్మ ప్లేట్ తీసుకెళ్ళింది. కొద్దిసేపటి తర్వాత కాఫీపట్టుకుని మళ్ళీ గదిలోనికి వచ్చింది.

కాఫీ అతడికి అందించి, అతనికి ఎదురుగా కుర్చీలో కూర్చుంది. రమేష్ ఆమెవంక చూశాడు. ఆమె ఏదో చెప్పేందుకు తటపటాయిస్తుందని గమనించి అతడే అడిగాడు

"ఏంటత్తమ్మా! ఏదో చెప్పాలనుకుంటున్నట్టున్నావు?"

ఆమె మెల్లగా తలూపింది. తర్వాత చిన్నగా అన్నది "రాత్రి మీ మామయ్య నీ గురించి అంతా చెప్పాడు. ఆఫీసు తీసేశావట! వ్యాపారంలో నష్టం వచ్చిందట కదా"

"నష్టంకాదు అత్తమ్మా. డబ్బంతా ఒక కంపెనీ చేతిలో ఇరుక్కుపోయింది.

"ఏదో... నాకు చాలా బాధవేసింది"

అతడు మౌనంగా ఉన్నాడు. ఇప్పుడీ ప్రస్తావన ఎందుకో అతడికి అర్థంకాలేదు. అది గమనించినట్టుగా ఆమె అంది–

"ఇప్పుడీ ప్రస్తావన ఎందుకంటే శ్వేతగురించి చెప్పేందుకు"

అతడు ఆసక్తిగా ఆమెవంక చూశాడు. ఆమె శ్వేతగురించి ఇప్పుడేం చెప్పబోతోంది. తన ఆస్తిపోయి బికారి అయ్యాడు కాబట్టి శ్వేత జోలికి రావద్దంటుందా? లేక తనకు అనుకూలంగా చెబుతుందా?

"బాబూ రమేష్! మాకు నలభై ఎకరాల ఆస్తి ఉంది. ఈ లంకంత ఇల్లు, నగానట్రా ఉన్నాయి. ఆ ఆస్తి మొత్తానికి ఏకైక వారసురాలు శ్వేత. శ్వేతను చాలా గారాబంగా పెంచారాయన. మగబిడ్డలు లేరన్న కారణంగానో, చెల్లెలి కొడుకువన్న మమకారంతోనో నిన్నుకూడా అంతే గారాబంగా పెంచారాయన. అంతేకాదు ఆయనకు మీ అమ్మ అంటే పిచ్చి ప్రేమ. ఆ చెల్లెలిమీద ప్రేమవల్ల నయితేనేమీ, నీమీది మమకారం వల్లనయితేనేమి శ్వేతను నీకిచ్చి పెళ్ళిచేసి ఈ ఆస్తంతా పరాయివారికి పోకుండా చేయాలని ఆయన అనుకున్నాడు. అందుకే చిన్నప్పటినుండి శ్వేత, రమేష్‌లు

భార్యాభర్తలు అని ఆయన అందరితో అనసా గాడు. ఆ మాటలు శ్వేతమీద బాగా పనిచే శాయి. చిన్నప్పటినుండి నీమీద పెద్ద అభి మానం పెంచుకుంది.

తీరా పెళ్ళిప్రయత్నాలకోసం ఆయన నీ దగ్గరకు వస్తే నువ్వు ఇప్పుడే పెళ్లి చేసుకోనన్నా వట. శ్వేతను మరెవరికైనా ఇచ్చేయమని కూడా సలహా ఇచ్చావట...''

అతడు మౌనంగా వింటున్నాడు. ఈ సంభా షణ సారాంశం ఏమిటోనని ఊహించసాగాడు.

''... ఆ మాటలు విన్న ఆయన పూర్తిగా క్రుంగిపోయారు. ఇంత ఆస్తిని పరాయివారిపా లు చేయాలంటే విపరీతమైన బాధవేసింది మాకు. కనీసం నావైపు బంధువులు కూడా ఎవరూలేరు. మా ఇద్దరి బాధకన్నా శ్వేత బాధ అధికంగా ఉంది. ఆ పిల్ల చిన్నప్పటినుండి నీ మీద ఆశలుపెంచుకుంది... ఆ రోజు నీ నిర్ణయం ఇంతమందిని బాధపెట్టింది...''

కొద్దిసేపు మౌనంగా ఉండిపోయింది సుంద రమ్మ. తర్వాత అందామె...''నిన్న నిన్ను చూడ గానే శ్వేత ముఖంలోపోయిన కళ తిరిగివ చ్చింది. నిన్నటినుండి చాలా ఉత్సాహంగా తిరుగుతోంది.

రాత్రి మీ మామయ్య నీ వ్యాపారం గు రించి నాతో అన్నాడు. నష్టం వచ్చి, మొత్తం పొయ్యేలా ఉందని చెప్పాడు... కాని ఈ పరిస్థి తిలో కూడా ఆయనకు నీమీద అభిమానమే. ఆస్తిలేదని నిన్ను ఆయన దూరంచేసుకోదల చుకోలేదు. నీమీద ప్రేమ ఈరోజు కూడా ఒకింత తగ్గలేదు. అయితే ఆయన లోతైన మనిషి. అంతకుమించి పట్టుదల కలిగిన మనిషి. కాదన్నవ్యక్తిని బతిమలాడటం ఆయ నకు అలవాటులేదు... బాబూ! ఈరోజు మా అమ్మాయిని పరాయిచోట ఇవ్వదలచుకుంటే ఏ డాక్టరుకో, ఇంజనీరుకో ఇవ్వగలిగినస్థితి మాది. అయినా నేను ఈ విధంగా నీకు ఎందుకు చెపుతున్నానంటే మీ మామయ్య, శ్వేతలను దృష్టిలో పెట్టుకునే. దయచేసి వాళ్ల మనసులు నొప్పించకుబాబూ...''

జవాబివ్వలేదు రమేష్ తాగిన కాఫీగ్లాసు టేబుల్‌మీద ఉంచాడు. మనసులో మాత్రం చాలా ఆనందంగా ఉంది. ఆమె మాటలు ఎంతో సంతోషాన్ని కలిగించాయి. ఆగిపోతున్న గుండె, తిరిగి కొట్టుకోవడం ప్రారంభించింది. కాని... కాని ఏమీచెప్పలేని స్థితి తనది.

సుందరమ్మ కూడా అతని జవాబు ఆశించ కనే, కాఫీగ్లాసు తీసుకుని వెళ్ళిపోయింది.

* * *

ఆరోజు వరికోత కోస్తున్నారు.

రఘురామయ్య హడావుడిగా ఉన్నాడు. కూలీలను ట్రాక్టర్ ఎక్కించి పంపారు. వెనుకనే ఆయన రెండెడ్ల బండి కట్టుకుని బయలుదే రారు.

ఇంట్లో బోరుగాఉంది. అందుకే అతడు మామయ్యను అడిగాడు— ''మామయ్యా! నేనూ పొలానికి వస్తాను''

ఆయన రమేష్‌వంక అదోలాచూసి నవ్వా డు— ''నువ్వెందుకురా పొలానికి'' అన్నాడు.

''ఇంట్లో ఏమీ తోచడంలేదు''

''సరే వెళ్దాంరా''

రమేష్ బండెక్కి కూర్చున్నాడు. రఘురామ య్య బండిని ముందుకు తోలాడు. బలంగాఉ న్న ఒంగోలు గిత్తలు మువ్వలు చప్పుడుచేస్తూ ముందుకు పరుగెత్తాయి.

బండి ఊరు దాటింది. చెరువు గట్టున్నే సాగి, పొలాలమధ్యకు చేరుకుంది.

అప్పటికే కూలీలు పొలంలో దిగి వరిని కోస్తున్నారు. పెదపాలేరు అజమాయిషీ చేస్తు న్నాడు.

బండిదిగాడు రమేష్. పొలంగట్టుమీద నిలబడి, వేగంగా పనిచేసుకుపోతున్న కూలీ ల వంకచూశాడు. ఎప్పుడూ పట్టణాలలో బతి కిన అతడికి, ఆ దృశ్యం కొత్తగా కనిపించింది. కాసేపు అలాగేచూసి, తర్వాత పొలంగట్టున ఉన్న ఓ వేపచెట్టుకింద కూర్చున్నాడు.

అతడికి ఆ ఉదయం అత్తమ్మ చెప్పిన విషయాలే గుర్తుకువస్తున్నాయి.

''తన ఆస్తి అంతాపోయినా కూడా, శ్వేతను పెళ్లిచేసుకునేందుకు తనకు అవకాశం ఈనాటి కీ ఉంది. తను కోరితే మరో సంవత్సరంపాటైనా సరే శ్వేతను తనకోసం అట్టే ఉంచిపెడుతాడు మామయ్య. శ్వేత కూడా ఆనందంగా తనకోసం వేచిఉంటుంది... మరో సంవత్సరం తర్వాత




యినా తన ప్రశ్నకు జవాబు దొరుకుతుందా?..."

'మగాడు ఎందుకు పెళ్లిచేసుకోవాలి?' అది తెలియకుండా తను మాత్రం పెళ్లిచేసుకోడు.

పెళ్ళి చేసుకుంటే ఈరోజు తనకున్న కష్టాలు, ఒక్కరోజులో తీరిపోతాయి. మామయ్య కట్నం రూపేణా చాలా మొత్తం అందిస్తాడు. ఆ డబ్బుతో అప్పులు తీర్చేసి, తిరిగి వ్యాపారం మొదలుపెట్టొచ్చు... కాని... తన స్వార్థంకోసం తనీపెళ్లి చేసుకోడు. స్వార్థం కోసం చేసుకునే పెళ్లిళ్ళకు తను వ్యతిరేకి.

మళ్ళీ అతడి మదిలో అదే ప్రశ్న మెదలాడింది.

'మగాడికి పెళ్లి అవసరమా?... మగవాడు ఎందుకు పెళ్లిచేసుకోవాలి?'

అడుగుల సవ్వడి వినిపించడంతో అతడు తలెత్తిచూశాడు.

ఎదురుగా రఘురామయ్య.

ఆయన తన చేతిలోని కొబ్బరికాయ అందించి చెప్పాడు "నీ కోసం తోటలో నుండి తెప్పించాను– తాగు"

చిరునవ్వుతో ఆయన చేతిలోని కాయను అందుకున్నాడు రమేష్.

ఆయన తిరిగి కూలీల దగ్గరకు వెళ్ళిపోయాడు.

రమేష్ కొబ్బరినీళ్ళు తాగి కాయను దూరంగా పడేశాడు.

సరిగ్గా అప్పుడే అడుగుల సవ్వడి అయింది. అతడు తలెత్తిచూశాడు.

ఎదురుగా ఎవరో అపరిచిత వ్యక్తి!

"హలో! మీరు రఘురామయ్యగారి అల్లుడుగారా?"

అవునన్నట్టుగా తలూపాడు రమేష్.

"మీరు చిన్నప్పుడు ఈ ఊరు వచ్చినపుడు, కలసి ఆడుకుంటుండేవారం... మీ పేరు రమేష్‌కదూ?"

"అవును... మీ పేరు?" ప్రశ్నించాడు రమేష్.

"నా పేరు చిరంజీవి... ఈ వక్కపాలమే నాది"

"అలాగా"

"రండి ... అలా వెళ్దాం"

రమేష్ పైకిలేచాడు. చిరంజీవి వెనుకే నడిచాడు.

చిరంజీవి పైరు ఇంకా కోతకు రాలేదు. వెన్ను తీసిఉంది. పొలంగట్ల వెంబడి నడుస్తుంటే పైరు కాళ్ళకు తగులుతూఉంది.

"మీ మామయ్యకు మీరంటే చాలా అభిమానం. ఎప్పుడయినా మీ ప్రస్తావన వచ్చినప్పుడు ఆయన మీ గురించి చాలా ఉన్నతంగా, గొప్పగా చెప్పుకుంటుంటారు" ముందుకు నడుస్తూ అన్నాడతను.

రమేష్ నవ్వి ఊరుకున్నాడు.

"మీరేదో యాడ్ కంపెనీ పెట్టారట కదా! ఎలా ఉంది?"

ఏం జవాబివ్వాలో అర్థంకాక "బాగుంది" అన్నాడు రమేష్.

"మీ మామయ్య మీ గురించి అన్ని వివరాలు చెపుతుంటాడు నాకు"

"అయితే మీకు నా గురించి అంతా తెలుసున్నమాట" ఏదో మరీ క్లుప్తంగా మాట్లాడటం బాగుండదని అన్నాడతను.

"మీ గురించి నాకంతా తెలును... మీ మామయ్య మీకు శ్వేతను ఇవ్వాలనుకోవడం కూడా తెలును—అన్నట్టు శ్వేత నా క్లాస్‌మేట్. చాలా మంచి అమ్మాయి"

ఇద్దరూ మోటార్ షెడ్‌లోనికి నడిచారు.

అక్కడున్న ఫ్లాస్క్‌లోకి కాఫీ రెండు గ్లాసుల్లో పోసి, ఒకటి రమేష్‌కి ఇచ్చాడు చిరంజీవి. గ్లాసందుకున్నాడు రమేష్.

"నేనూ టౌన్‌లో డిగ్రీ వరకూ చదివాను. ఉద్యోగం కోసం వెతుకులాటకన్నా వ్యవసాయమే బెటరని ఉన్న నాలుగెకరాలు సేద్యం చేయడం మొదలుపెట్టాను." తన వివరాలు అడగకపోయినా తనే చెప్పాడు చిరంజీవి.

"మంచిపని చేశారు" అన్నాడు రమేష్.

"ఇది మనకు మంచిగానే ఉంది కాని మన పెద్దలకు మనం ఓ చేతగానివాళ్ళలా కనిపిస్తున్నాం. 'ఫలానావాడు ఇంతవరకూ చదివాడు, అంత పెద్ద ఉద్యోగం చేస్తున్నాడు. నువ్వు చదివిన చదువు వృధా అయింది.' అంటూ

చంపుకు తింటున్నారు. వారికి నిరుద్యోగం గురించి తెలియదు—"

ఎదుటివ్యక్తి చాలా కలుపుగోలు మనిషని అర్థమయింది రమేష్‌కు. కొత్తాపాతా లేకుండా తేలికగా మనుమల్లో కలసిపోతాడు.

"నిరుద్యోగం గురించి తెలిసినా, వారి ఆశ వారిది. అసలు వారు మనల్ని చదివించేది ఉద్యోగం కోసమే, విజ్ఞానం సంపాదించు కుంటారన్న ఉద్దేశ్యంతో కాదు"

"ఆ తెలివితక్కువతనమే మనల్ని చంపు కుతింటుంది" నవ్వుతూ అన్నాడు చిరంజీవి.

రమేష్ కూడా నవ్వి ఊరుకున్నాడు.

మరి కొద్దిసేపు అతడితో గడిపిన తర్వాత రమేష్ పైకి లేచాడు.

"సాయంత్రం మీ ఇంటికి వస్తాను. ఇంట్లో బోర్‌గా ఉంటుంది కదా! అలా షికారుగా వెళ్దాం" అన్నాడు చిరంజీవి తనూ పైకి లేస్తూ.

"అలాగే తప్పకుండా రండి."

రమేష్ రఘురామయ్య దగ్గరకు నడిచాడు.

మరికొద్దిసేపటి తర్వాత కూలీలు భోజనాలు కోసం పని ఆపు చేశారు.

"పద రమేష్! మనం ఇంటికెళ్ళి భోంచేసి వద్దాం" చెప్పాడు రఘురామయ్య.

బండి కట్టాడు ఆయన. బండెక్కి కూర్చు న్నాడు రమేష్.

"మామయ్యా! బండిని నేను తోలుతాను" బండి మొదట్లోకి వచ్చాడు రమేష్.

రఘురామయ్య సన్నగా నవ్వాడు. "స్కూటరో, కారో తోలుకునే నీకు ఈ రెండెడ్ల బండి ఎందుకురా?"

"చూద్దాం మామయ్యా"

"సరే... నీ ఇష్టం" బండి వెనక్కు వెళ్ళి కూర్చున్నాడు.

"హేయ్, హేయ్" రెండు పగ్గాలు పట్టు కుని ఎద్దులను అదిలించాడు రమేష్.

ఒంగోలు గిత్తలు హుషారుగా ముందుకు పరుగెత్తాయి.

బండి గ్రామంలో ప్రవేశించినపుడు, బండి తోలుతున్న రమేష్‌ను చూసిన ఒకరిద్దరు, రఘురామయ్యతో "ఏమిటి రామయ్యగారూ! అల్లుడ్ని బండెక్కించారే" అన్నారు నవ్వుతూ.

రఘురామయ్య నవ్వుతూ ఉండిపోయాడు బదులివ్వకుండా.

బండి ఇంటి ఆవరణలోకి ప్రవేశించింది.

"హేయ్—హేయ్" దొడ్డి లోపలకు తోలాడు బండిని.

అతడి గొంతు విని పెరట్లోకి పరిగెత్తుకొ చ్చింది శ్వేత.

బండి తోలుతున్న అతనిని చూసి కిసు క్కున నవ్వింది.

మామాఅల్లుళ్ళిద్దరూ అటుగా చూశారు.

ఆమె సిగ్గుపడి లోపలికి పరుగెత్తింది.

వారిద్దరూ మెల్లగా నవ్వుకున్నారు.

★ ★ ★

పల్లెటూరు కావడం వలన తొమ్మిది గంటల కే ఊరంతా సద్దుమణిగిపోయింది.

పక్కమీద అటూ ఇటూ దొర్లాడు రమేష్. ఎంతసేపటికీ నిద్రపట్టడంలేదు.

ఆగిపోయిన తన వ్యాపారం గురించిన ఆలోచనలే చుట్టుముడుతున్నాయి.

పైకి లేచాడతను.

సూట్‌కేస్‌లో నుండి కాగితం తీసి, రవీంద్రకు ఉత్తరం రాయసాగాడు.

తన వ్యాపారం క్లోజ్ చేసిన దగ్గర నుండి తను కోడూరుపల్లె వచ్చేవరకూ పరిస్థితులు వివరించాడు.

చివరగా వీలయినంత త్వరలో తన డబ్బు పంపమని రిక్వెస్ట్ చేశాడు.

ఆ తర్వాత అతడు కాస్త ప్రశాంతంగా నిద్రపోయాడు.

★ ★ ★

"అమ్మ—అమ్మ టిఫిన్‌కి పిలుస్తోంది" వాకి టకు అవతల నిలబడి తలదించుకుని చె ప్పింది శ్వేత.

అతడు చప్పున ఆమె వంక చూశాడు.

ఆమె అతడి వంక చూడటం లేదు. తల దించుకుని, కాలి బొటనవేలితో నేల మీద గీస్తోంది.

అతడి మనసులో కొత్తగా చిలిపిదనం ప్రవే




శించింది. "ఆకలిగాలేదు పోనీ నీ చేత్తో తిని పిస్తానంటే వస్తాను."

"ఛీపో, బావా" ఆమె పరుగెత్తింది.

అతడు చిన్నగా నవ్వుకున్నాడు. చదువుతు న్న పుస్తకం పక్కనపెట్టి లేచాడు.

సుందరమ్మ టిఫిన్ ప్లేట్‌లో పెడితే, శ్వేత చట్నీ వేసింది.

శ్వేత ఇప్పుడిప్పుడే అతడికి ఎదురుపడు తోంది. రమేష్ గదిలో ఉన్నా నరే, చిన్న చిన్న పనులతో తల్లికి సహాయం చేస్తోంది.

అలాంటి సమయాలలో ఎప్పుడైనా తమి ద్దరి చూపులు కలిస్తే చాలు, రమేష్ చిలిపిగా నవ్వేవాడు. ఆమె సిగ్గుతో తలతిప్పుకునేది.

టిఫిన్ తినేసి తనగదిలో కొచ్చాడు రమేష్.

పుస్తకం తీసుకుని కుర్చీలో కూర్చున్నాడు.

మరో పదినిముషాలు తర్వాత శ్వేత కాఫీ తీసుకుని అతడి గదిలోకి వచ్చింది.

కాఫీతోపాటు ఆమెచేయి కూడా అందుకు న్నాడు రమేష్.

"వదులు బావా" అతడి చేతిని తన మరో చేత్తో తప్పిస్తూ గింజుకోసాగిందామె. ఆమె శరీరం సన్నగా కంపిస్తోంది. ఎవరైనా చూస్తారే మోనని ఆమె కళ్ళు చుట్టూ చూస్తున్నాయి.

రమేష్ పైకి లేచాడు. "ఏయ్ శ్వేతా! ఎందుకింత భయపడతావు? ఇప్పుడు నేను నిన్నేమీ చేయబోవడం లేదు... కాసేపు ఫ్రీగా మాట్లాడుకుందాం - ఇలా కూర్చో"

"మనల్ని ఎవరైనా చూస్తారు" భయంగా అందామె.

"మనం ఏకాంతంగా మాట్లాడుకుంటుంటే చూసి సంతోషించేవారే తప్ప బాధపడేవారెవ్వ రూ లేరులే"

ఆమెను బలవంతంగా కుర్చీలో కూర్చోబె ట్టాడు. తను మంచం మీద కూర్చున్నాడు.

ఆమె కుర్చీలో ఓ మూలగా ఒదిగి కూర్చుంది. "ఏమిటి చెప్పు బావా! నేను త్వరగా వెళ్ళాలి"

"త్వరగా వెళ్ళి ఏంచేయాలి?" కళ్ళతో నవ్వుతూ అడిగాడతను.

"వెళ్ళాలి బావా" బిడియపడిపోతోంది శ్వేత.

ఆమెను అలా చూస్తుంటే, అంతవరకూ తను అనుభవించని కొత్తరకం అనుభూతి కలుగుతోంది. సిగ్గు, బిడియం కలబోసుకుని ఒదిగి కూర్చుని ఉన్న ఆమెను చూస్తుంటే ఎంతో ముద్దుగా కనిపిస్తోంది.

"చెప్పు బావా" మరోసారి అడిగిందామె.

"ఏం చెప్పను?"

"ఏదో చెప్పాలని కూర్చోబెట్టావు కదా?"

"ఏదో చెప్పాలని కాదు... ఏదైనా మాట్లాడదా మని"

"అదే... త్వరగా మాట్లాడు. నేను వెళ్ళాలి"

అతడు తలపట్టుకున్నాడు. తన ఉద్దేశం ఆమెకు అర్థంకాలేదు.

"త్వరగా మాట్లాడి పంపించేయడం కాదు శ్వేతా... ఇలా కూర్చుని కాసేపు కబుర్లు చెప్పు కుందామని" చెప్పాడు రమేష్.

"వద్దు బావా... అమ్మ చూస్తుంది."

"చూస్తే... సంతోషపడుతుంది"

"అయితే... మళ్ళీ... మళ్ళీ వస్తాను."

ఆమెను మరింత బలవంతపెట్టడం ఇష్టంలేకపోయింది రమేష్‌కు. "సరే... నీ ఇష్టం" అన్నాడు రమేష్.

అంతే ఆమె తుర్రుమని పారిపోయింది.

ఆమె భయానికి అతడు నవ్వుకున్నాడు. కాఫీగ్లాసు అందుకుని కిటికీ దగ్గరగా నిలబడ్డా డు.

'తనకు శ్వేతను పెళ్ళి చేసుకునే ఉద్దేశం ఉందా?... పెళ్లి... అసలు పెళ్లి ఎందుకు?... మరి పెళ్లికాకుండా ఆ అమ్మాయితో అలా ఎంతకాలం మాట్లాడుతూ ఉండగలను? ఒక ఆడా, మగా హాయిగా కూర్చుని కబుర్లు చెప్పుకో వాలంటే పెళ్లి అవసరమా?... ఛట్! పెద్దలు ఈ పెళ్లి అనేది ఎందుకు పెట్టారు? వాళ్ళొక ఫూల్స్, ఇడియట్స్, ఇంకా చాలా. లేకపోతే పెళ్లి పేరుతో వారు ఇన్నిరకాల సమస్యలు సృష్టిస్తారా? బ్లడీ మేరేజ్.

'అయినా కబుర్లు చెప్పుకునేందుకే పెళ్లి చేసుకోవడం తనకి మాత్రం ఇష్టంలేదు... మరి అసలు పెళ్లెందుకు చేసుకోవాలి?'

* * *

చిరంజీవిని చూసి ఇంట్లో నుండి బయటకు వచ్చాడు రమేష్.

"లోపల కూర్చుందాం రండి" పిలిచాడు రమేష్.

"ఎందుకూ... అలా చెరువుగట్టుకో, ఏటిగట్టుకో వెళ్దాం"

"సరే పదండి"

ఇద్దరూ ఏటివైపు నడిచారు.

పెన్నానది ప్రవాహం ఆగిపోయి ఉంది. అక్కడక్కడా నీటిచెలమలు ఉన్నాయి.

దిగువ ప్రాంతంవారికి పెన్నమ్మ పాట - ఆనందాల పాట అయితే, ఎగువ ప్రాంతంవారికి పెన్నేటి పాట - కన్నీటి పాట. రాయలసీమకది నిజంగా కన్నీటి పాటే.

వారిద్దరూ ఇసుక దిబ్బల మీద కూర్చున్నారు.

ఏటికి దిగువ మరికొన్ని మైళ్ళలోనే పెన్నానది బంగాళాఖాతంలో కలుస్తుంది. ఈ కొద్ది దూరం పల్లెలు ఎప్పుడూ, అన్ని కాలాలలో రకరకాల పంటలతో పచ్చగా ఉంటాయి.

చుట్టూ ఉన్న ప్రకృతిని పరిశీలించసాగాడు రమేష్. ప్రకృతి పరిశీలన అన్నది అతడికి ఈమధ్య కొత్తగా అలవడిన అలవాటు.

"సిగరెట్ తాగుతారా?" జేబులో నుండి సిగరెట్ ప్యాకెట్ తీస్తూ అడిగాడు చిరంజీవి.

"అలవాటు లేదు" చెప్పాడు రమేష్.

"అన్నట్టు మీకు చెప్పలేదు కదూ... రేపు నేను పెళ్లిచూపులకు వెళ్తున్నాను"

"పెళ్లిచూపులకా?"

"అవును"

"ఏ ఊరు?"

ఊరిపేరు చెప్పాడు చిరంజీవి.

రమేష్ కొద్దిసేపు సంకోచించి, తర్వాత అతణ్ని అడిగాడు - "చిరంజీవీ! పెళ్లిచూపులకెళ్లి ఆ అర్ధగంట వ్యవధిలో పెళ్లికూతురులో ఏం చూస్తారు?"

"ఏం చూస్తారు అని అంటే- అందం, ఆస్తి, మాట, నడక..."

"ఇవన్నీ పైమెరుగులే కదా?"

"అంటే?" అర్థంకానట్టు ముఖంపెట్టాడు చిరంజీవి.

"ఐ మీన్ - అందం చందం ఇవన్నీ పైన కనిపించేవి కాని ఆమె మనస్సు ఎలాంటిది? - ఆమె ప్రవర్తన ఎలాంటిది? అన్నవి కనుక్కోవడం చాలా కష్టం... మరి మగాడికి అందం, ఆస్తి, మాట, నడక తప్ప మనస్సు, ప్రవర్తన అవసరం లేదా?"

"అవసరం లేదా అంటే అవసరమే. కాని అలాంటి గుణాలన్నీ ఉన్నవారు మనకు దొరకాలి కదా?"

"దొరకలేదని ఎవర్నో ఒకరిని పెళ్లిచేసేసుకోవడమేనా?"

రమేష్ ఆర్గ్యుమెంట్ కొత్తగా అనిపించింది చిరంజీవికి.

"మరి పెళ్లి అన్నది కంపల్సరీ. అదీ వయస్సులోనే జరిగిపోవాలి. కాబట్టి మనస్సు, ప్రవర్తన సక్రమంగా ఉన్న ఆడదాని కోసం వెతుకుతూ ఉంటే మనం ముసలివాళ్ళమయి పోతాము. ఆ తర్వాత పెళ్లి అన్నది అనవసరం... అందుకని కుర్రాడిగా ఉండగానే ఎవరో ఒకరిని చూసి పెళ్లిచేసుకోవడమే సరయినది"

'అడ్జస్ట్‌మెంట్' మనసులోనే అనుకున్నాడు రమేష్. 'ప్రతి మనిషి అత్యధికంగా అడ్జస్ట్ అయ్యేది పెళ్లి దగ్గరే కాబోలు'.

అప్పుడే అతడికో అనుమానం కూడా వచ్చింది. 'ఒక స్త్రీ, మరో పురుషుడు కేవలం పదినిముషాలు మాత్రమే పెళ్లి చూపుల్లో చూసుకుంటారు. ఆ తర్వాత ఆ మగాడు ఆ స్త్రీ మెడలో తాళి కడతాడు. ఆ రాత్రి నుండే ఆ స్త్రీ ఆ పురుషునికి తన శరీరం మీద సర్వహక్కులు అప్పగిస్తుంది. శరీరంలోని అణువణువునూ అతనికి అర్పితం చేస్తుంది... కాని ఇదెలా సాధ్యం. పదినిముషాలు చూసుకోవడం వలన, సర్వం అతనికి అర్పితం చేయడం... బహుశా తరతరాలుగా అలవాటుపడటం వలన ఈ జనానికి అది సహజంగానే అనిపిస్తుండవచ్చు. తాళి కట్టినవాడికి ఆ స్త్రీ అంకితం అన్నది ఆచారం కావచ్చు. అయితే కొత్తగా ఆలోచించగలిగితే ఇది ఒక వింతగా అనిపిస్తుంది. 'గొప్ప అడ్జస్ట్‌మెంట్'లా కనిపిస్తుంది. తెలివైనవారు, మేధావులు కూడా పెళ్లి విషయంలో అనాలోచితంగానే అడ్జస్ట్ అయిపోతున్నారు. ఇది

 

నిజం!

నిజానికి ఈ పెళ్లిళ్ళన్నీ గొప్ప ఫార్సులా అనిపిస్తాయి. స్వార్థం, కామం, స్వప్రయోజనాలే పెళ్లిళ్ళకు మూలస్థంభాలయ్యాయి.

ఆలోచనా ఫలితమో, లేక అనాలోచితంగా చేశారో ఏమో మన పూర్వీకులు, ఎలా చేసిన ఈ పెళ్లిళ్ళన్నవి మానవజీవితానికి ఒక పెద్దమలుపు అయి కూర్చున్నాయి.

వాళ్ళ ఆలోచన ఏమో కాని...నిజానికి పెళ్లి అన్నది అవసరమా?

"రమేష్!"

ఆలోచనలు ఆపి చిరంజీవి వంక చూశాడు అతను.

"ఇంతకీ శ్వేతతో నీ పెళ్ళి ఎప్పుడు?"

'పెళ్ళెందుకు అని తను ఆలోచిస్తుంటే, పెళ్ళెప్పుడూ అని ఇతడు అడుగుతున్నాడు...తను వీరందరిలా పెళ్ళి ఎందుకో తెలుసుకోకుండానే పెళ్లి మాత్రం చేసుకోడు. అది జరగని పని.'

చిరంజీవి ప్రశ్నకు జవాబివ్వకుండా నవ్వేశాడు రమేష్. అతడి ఆలోచనలు తెలియని చిరంజీవి, రమేష్ సిగ్గుపడి జవాబు చెప్పడంలేదనుకున్నాడు.

మరికొద్దిసేపు ఏటి గట్టునే కూర్చుని, పైకి లేచారు వారు. మాట్లాడుకుంటూ ఊళ్ళోకి నడిచారు.

రమేష్‌ను రఘురామయ్య ఇంటి ముందు వదిలి, తన ఇంటివైపు కదిలాడు చిరంజీవి.

రమేష్ ఇంటి లోపలికి నడిచాడు.

మనసు నిండా పెళ్లి చూపులు గురించిన ఆలోచనలే?

ఎడతెగని ఆలోచనలు!!

★ ★ ★

రమేష్ వచ్చి నెలరోజులయింది. రోజులు చాలా వేగంగా గడుస్తున్నాయి.

అతడికి అక్కడ ఆనందంగానే గడిచిపోతోంది. కాని అప్పుడప్పుడు మనసు విపరీతమైన వేదనకు లోనవుతోంది. రేపటి తన భవిష్యత్తేమిటి? రవీంద్ర తనకు డబ్బు ఇస్తాడా? ఇవ్వకపోతే తనేం చేయాలి?...శ్వేతను పెళ్లి చేసుకుంటే తన బాధలన్నీ క్షణాల మీద తీరిపోతాయి. భవిష్యత్తు ఆనందంగా గడిచిపోతుంది. కాని అనాలోచితంగా శ్వేతను పెళ్లి చేసుకోవడం తనకిష్టంలేదు. మరేం చేయాలి?

భవిష్యత్ గురించిన వేదనకాక, ఈ మధ్య మరో బాధ తలకు చుట్టుకుంది. ఇంట్లో తోడు ఎవరూ లేని పరిస్థితిలో శ్వేతతో మాటలు కలిపాడు తను. ఇద్దరూ కబుర్లు చెప్పుకోసాగారు. అసలే ఆమెకు తన మీద అభిమానం. ఇప్పుడు తను మాటలు కలపడంతో ఆమెకు అంతరించిపోయిన ఆశలు తిరిగి చిగురించాయి. తన చనువును ఆమె ప్రేమగా భావిస్తోంది. అత్తామామలు కూడా ఇదే భావంతో ఉన్నట్టున్నారు. తను ఆమెతో చనువుగా ఉండటాన్ని పెళ్లికి ఇష్టత ప్రకటించినట్టుగానే భావిస్తున్నారు వారు.

తనిప్పుడు అప్పటిలానే 'సారీ! నేనిప్పుడే పెళ్లి చేసుకోదలచుకోలేదు' అంటే రియాక్షన్ చాలా గట్టిగా ఉండొచ్చు. ఎలా చెప్పాలి? పాపం! అమాయకురాలు శ్వేతను చూస్తుంటే జాలివేస్తుంది. కావాలని కోరితే ఆమెను జీవితాంతం దగ్గర ఉంచుకోగలడు. ఫ్రెండ్లీగా కబుర్లు చెప్పగలడు. అంతేకాని అనాలోచితంగా పెళ్లి మాత్రం చేసుకోడు. అది మాత్రం తనకిష్టంలేదు.

"బావా! ఏదో ఆలోచిస్తున్నట్టున్నావు" అతడి పక్కనే వచ్చి నిలబడింది శ్వేత.

అతడు ఆలోచనలను ఆపి ఆమె వంక చూశాడు. "ఏం లేదు" చెప్పాడతను.

"బావా! అలా తోటలోకి వెళ్దామా?" అడిగింది శ్వేత.

ఈ మధ్య ఆమె బిడియపడకుండా అతనితో చనువు పెంచుకుంది. వారి చనువు పెద్దలకు ఆనందదాయకమే అయింది తప్ప అభ్యంతరకరం కాలేదు.

"పద శ్వేతా"

ఆమెను అనుసరించాడు రమేష్.

ఇంటి ప్రహారీకి ఆనుకునే ఉంది విశాలమైన తోట. ఆ తోటలో మామిడి, జామ, సపోటా, కొబ్బరి చెట్లున్నాయి.

వారిద్దరూ తోటలోనికి అడుగుపెట్టారు.

తోట చివరగా వెళ్లిన తర్వాత శ్వేత అంది




"ఇక్కడ కూర్చుందామా బావా"

"అలాగే" అన్నాడతను.

ఇద్దరూ చెట్టుబోదెకు ఆనుకుని కూర్చున్నారు.

కొద్దిసేపు ఇద్దరిమధ్యా నిశ్శబ్దం ప్రవహించింది.

ఆ నిశ్శబ్ద వాతావరణంలో శ్వేత గొంతు మెల్లగా పలికింది.

"బావా... నాన్న నిశ్చితార్థం కోసం నీదగ్గరకు వచ్చినప్పుడు, నువ్వు నన్నుకాదన్నావనితెలిసి నేనెంతగా బాధపడ్డానో తెలుసా?"

"లేదు శ్వేతా! నేనునిన్ను కాదనలేదు. పెళ్ళి చేసుకోవడం ఇప్పుడే కుదరదని మాత్రమే చెప్పాను" వెంటనే అన్నాడు రమేష్.

"నన్ను కాదనేందుకు అదొక కుంటిసాకుగా మేము భావించాం"

"మీరు నన్ను అపార్థం చేసుకున్నారు"

"అది అపార్థమెలా అవుతుంది బావా! పెళ్ళి చేసుకోవలసిన వయస్సులో, పరిస్థితులన్నీ సక్రమంగా ఉన్నాకూడా నువ్వు అకారణంగా 'నాకిప్పుడేపెళ్ళిచేసుకోవాలనిలేదు' అని అంటే, ఎదుటివారు దాన్నిఎలా అర్థం చేసుకోగలరో చెప్పు"

రమేష్ అసహనంగా కదిలాడు. అతడికి తను పెళ్ళివద్దనటం అకారణమేమీ కాదని, అందుకు ఒక కారణం ఉందనీ, ఆ కారణం తన మనసులో మెదలాడే ఒక ప్రశ్నని చెప్పాలని ఉంది కాని ఆ కారణం ఆమెకు ఎలా వివరించగలడు? ఆ ప్రశ్న ఎలా చెప్పగలడు? నవ్వుకుంటుందేమో!

"బావా! నువ్వు నన్ను ప్రేమించడం లేదు కదూ" ఆమె చూపులలో బాధకనిపించింది.

"పెళ్లంటే ఇంట్రస్ట్ లేనప్పుడు, ప్రేమనేది ఎలా ఉంటుంది?"

" ఒక వయస్సు వచ్చినతర్వాత పెళ్ళంటే ఇంట్రస్ట్ లేకపోవడమేమిటి? నేను నమ్మను.. నేననుకోవడం నువ్వెవరినో... ప్రేమించి ఉండొచ్చని"

అతడు గలగలా నవ్వేశాడు "ఇంకానయం..ఎవరినైనా పెళ్ళి చేసుకుని ఉండొచ్చని అనలేదు"

"ఏమో... అదికూడా జరిగిఉండొచ్చుగా"గుంభనంగా నవ్వింది శ్వేత.

"అదేం లేదు" సీరియస్‌గా చెప్పాడతను.

రమేష్‌కు ఇక నిజం చెప్పాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఆమె తనను అపార్థం చేసుకుంటోంది. తను చెప్పిన కారణం నమ్మట్లేదు. ఆమె తనను నమ్మనందువలన తనకు వచ్చిన నష్టమేమీలేదు. తనకు ఈనాటికీ పెళ్ళిమీద ఇంట్రస్ట్ లేదు. కాబట్టి ఆమె నమ్మినా నమ్మకున్నా తనకు భవిష్యత్‌లో కలగబోయే బాధేమీలేదు. కాని ఆమె అపోహతొలగించడం మంచిదనిపించింది అతడికి. ఆమె అపోహ తొలగించాలంటే తను మొదటినుండీ చెప్పాలి. తన మనసులో ఉన్న ఆ జవాబు దొరకని ప్రశ్న గురించి వివరించాలి...చెపితే ఆమెనవ్వుతుందా? అసలు నమ్ముతుందా..

"నేను పెళ్ళి అంటే తిరస్కరించడానికి కారణం ఉంది" అన్నాడతను.

"ఏమిటా కారణం?"అడిగిందామె.

కొద్దిసేపు నిశ్శబ్దం. తర్వాత చెప్పటం మొదలుపెట్టాడు.

"బహుశా అది నేను కాలేజీలో చేరిన కొత్త అనుకుంటాను, మా ఇంటి పక్కనే ఖాళీగా ఉన్న ఇంట్లో ఒక జంట చేరింది. ఇద్దరూ నడివయస్సువారు. పిల్లలులేరు. వారు పొద్దస్తమానం కీచులాడుకునేవారు. అప్పుడప్పుడూ పెద్ద కొట్లాటే వారి మధ్య జరిగేది. వారి కీచులాటకు శ్రోతగా, కొట్లాటకు ప్రేక్షకుడిగా ఉండే నాలో ఏవేవో ఆలోచనలు కలిగేవి...వీరిద్దరూ భార్యాభర్తలు కదా! మరి వీరిలా ఎందుకు కొట్లాడుకుంటున్నారు? భార్యాభర్తల మధ్య ఉండాల్సింది ప్రేమ, అభిమానాలే కాని తగాదాలు కాదు కదా! మరి పెళ్ళి ద్వారా ఇలాంటి ఇబ్బందులు ఎదురవుతాయనుకుంటే అసలువీరిద్దరూ ఎందుకు పెళ్ళిచేసుకోవాలి?

అప్పుడు కలిగింది నాలో ఓ ప్రశ్న- అది ఆ పక్కింటాయనను చూసి. ఆయన మగజాతికి సంబంధించినవాడు కాబట్టి నేనూ మగాడినే అయినందున ఆయన తరఫున నేను వేసుకున్న ప్రశ్న అది...'మగాడు పెళ్లి ఎందుకు

చనుకవాల...అలా అత చిన్న మొలకలా ప్రవే శించిన ఆప్రశ్న ఆ తర్వాతి కాలంలో మహావృక్ష మై నా ఆలోచనలను తన చుట్టూ తిరిగేలా చేసుకుంది.

ఆ ప్రశ్న నాలో ఉదయించినప్పటి నుండీ అనేకమంది దంపతులను నేను పరిశీలించా ను. ఈ పెళ్లయినవారిలో అత్యధికశాతం అనా లోచితంగా పెళ్లిచేసుకున్నవారే. వారు ఏమి ఆశించి పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారో నాకర్థంకా లేదు. పెళ్ళి చేసుకుంటే కష్టాలు మొదలవుతా యని అందరికీ తెలుసు. స్వేచ్ఛగా తిరిగే మగవాడికి పెళ్లిచేయడం అంటే, కాళ్లకు సంకె ళ్ళు వేయడంలాంటిదే. మగాడు అందుకు కూడా అంగీకరించి పెళ్ళిచేసుకుంటున్నాడు ఎందుకు? ఏమాశించి పెళ్ళిచేసుకుంటున్నా డు?...అసలు మగవాడికి పెళ్ళి అవసరమా?

...ఇదే నా ప్రశ్న. ఆ ప్రశ్నకు జవాబు తెలిసే వరకూ పెళ్ళి చేసుకోవడం నాకిష్టంలేదు. అందుకే మామయ్యా పెళ్లి ప్రస్తావన తీసుకువ చ్చినా నేను తిరస్కరించాను. అంతే తప్ప పెళ్ళి అన్నది మగాడికి తప్పనిసరి అనిపిస్తే తప్పక పెళ్ళిచేసుకుంటాను..."

శ్వేత గలగలా నవ్వింది. ఎంతసేపటికీ ఆమె నవ్వుఆగలేదు.

"ఎందుకు నవ్వుతున్నావు?" అడిగాడు రమేష్.

"పెళ్లి ఒద్దనేందుకు నువ్వు చెప్పిన కారణా నికి..."మళ్ళీ నవ్విందామె.

అతడు ఉక్రోషంగా ఆమె వంక చూశాడు.

"అంటే నేను చెప్పిన కారణం నువ్వు నమ్మట్లేదా?" అడిగాడు రమేష్.

ఆమె నవ్వు ఆపింది- "నమ్ముతున్నాను బావా! కాని...చాలా అనవసరమైన ప్రశ్నకోసం విలువైన జీవితాన్ని వృధాచేస్తున్నావేమోనని పిస్తోంది" అన్నదామె.

"జీవితం విలువైనదైతే, ఆ విలువైన జీవి తంలోని ఒక ముఖ్యమైన ఘట్టం యొక్క అవసరాన్ని తెలుసుకునే ప్రశ్న ఇది. పెళ్లియొ క్క ముఖ్యప్రయోజనం తెలియకుండానే నేనెలా పెళ్ళిచేసుకోగలను?"

ఆమె కొద్దిసేపు ఆలోచించి తర్వాత అడి గింది- "బావా! ఏమీ అనుకోనంటే ఒక ప్రశ్న".

"అడుగు" అన్నాడతను.

"సుమారుగా పదేళ్ళనుండి ఈ ప్రశ్న నీమ దిలో మెదలాడుతోంది. ఇంతకాలంగా దొరకని ఆ సమాధానం, ఇక ఎప్పటికి దొరుకుతుందని నువ్వు అనుకుంటున్నావు?"

జవాబుకోసం అతడు కొద్దిసేపు ఆలోచించా డు- "శ్వేతా! గత పదేళ్ళుగా ఆ ప్రశ్న నాలో ఉందికాని ఏనాడూ దానికి జవాబు తెలుసు కునే ప్రయత్నం చేయలేదు. మామయ్యా పెళ్లి ప్రస్తావన తెచ్చినప్పటినుండే నేను జవాబు కోసం అన్వేషణ మొదలుపెట్టాను...నా నమ్మ కం-మరి కొద్దికాలంలోనే ఈ ప్రశ్నకు జవాబు దొరుకుతుందని"

"ఎలా?"

"అది ఏవిధంగానైనా కావచ్చు"

"ఒకవేళ నీ ప్రశ్నకు జవాబు చాలా సంవ త్సరాలపాటు దొరకకుంటే?"

అతడు కళ్ళుమూసుకున్నాడు. పెదాలు బిగపట్టి చూపుడువేలుతో పెదాలమీద కొట్టుకో సాగాడు. 'అవునూ! చాలాకాలంపాటు తన ప్రశ్నకు జవాబుదొరకనట్లయితే తనేం చేయా లి?...తన నిర్ణయం మాత్రం మార్చుకోడు' ఆమాట ఆమెతో చెప్పి ఆమె మనసు కష్టపె ట్టడం ఇష్టంలేకపోయిందతడికి. అందుకే చాలాసేపు మౌనంగా ఉండిపోయాడు.

ఆమె కూడా రెట్టించి అడగలేదు.

అతడికిప్పుడు కాస్త సంతోషంగా ఉంది. అంతకుమునుపు శ్వేతతో తిరిగేటప్పుడు తను కాస్త గిల్టీగా ఫీలయ్యేవాడు. 'అణగిపోయిన ఆమె ఆశలను తిరిగి చిగురింపచేస్తున్నాడా తను?' అని మనసు బాధపడేది.

ఈ క్షణం నుంచి తనకలాంటి బాధలేమీ ఉండవు. తన మనఃపరిస్థితి ఆమెకు చెప్పేశా డు. ఇక తనతో చనువుగా ఉండటం, ఉండక పోవటం ఆమె ఇష్టం. తనతో ఆమె ప్రవర్తన ఎలాఉన్నా బాధ్యత ఆమెదే అవు తుంది...అలా మనస్సుని తృప్తిపరచబోతే, మదిలోని ఏ మూలనో అపరాధ భావం మెద లాడుతోంది. అది పట్టించుకోదలచుకోలేదు రమేష్.

"వెళ్దామా?" పైకి లేస్తూ అన్నాడతను.




నిస్సత్తువుగా పైకిలేచిందామె. గత కొద్దిరోజులుగా ఆమె కట్టుకున్న ఊహాసౌధాలు తిరిగి కూలిపోయాయి.

"బావ పట్టుదల గురించి ఆమెకు బాగా తెలుసు... తండ్రి అతణ్నిగురించి చెప్పే ప్రతి సమయంలోనూ, అతడి పట్టుదలను మెచ్చుకుంటాడు-అలాంటి బావతో తనపెళ్ళి అనుమానమే!...అయినా బావ అమాయకంగా ఆలోచిస్తున్నట్టుగా తనకు అనిపిస్తోంది. ప్రపంచంలో ఎంతోమంది మేధావులు ఉన్నారు. వారందరూ అనాలోచితంగానే పెళ్లిచేసుకుంటున్నారా? అడయినా-మగయినా పెళ్లి అన్నది అవసరమే!...మరి ఆ పెళ్ళి ఎందుకంటే!...ఎందుకు?....అది పెద్దలకు తెలిసే ఉంటుంది.

ఇద్దరూ ఇంటికి తిరిగొచ్చి లోపలకు నడిచారు.



అశోక్ దగ్గర నుండి ఉత్తరం వచ్చింది.

విశేషాలేమీలేవు. క్షేమసమాచారాలు అడిగి, టౌన్‌కి ఎప్పుడొస్తున్నావని ప్రశ్నించాడంతే. కాకపోతే తన మాటగా శ్వేతను పెళ్లిచేసుకోమని, పెళ్ళిచేసుకుంటే కష్టాలు తీరిపోతాయని రాశాడు అందులో

ఉత్తరం చదివి, దానికి జవాబు అప్పుడే రాయసాగాడు రమేష్.

లెటర్ వ్రాయడం పూర్తయింది.

ఉత్తరం పోస్టుచేయుమని, పాలేరుచేత పంపించాడు.

కాసేపు కిటికీదగ్గర నిలబడిన తర్వాత విసుగనిపించింది. గదిలోనుండి పెరడులోనికి వచ్చాడు.

శ్వేత పూలమొక్కలకు పాదులు స్వయంగా అప్పుతోంది.

పనిచేస్తూ అలసిపోయింది కాబోలు, నుదుట చెమటబిందువులు నిలబడిపోయాయి. ఒ చేత్తో ముందుకుపడిన ముంగురులను సవరించుకుంటూ, పనిచేసుకుంటోందామె.

అతడు ఆమె దగ్గరగా నడిచాడు. "నేనూ సహాయంచేసేదా?" అన్నాడు.

ఆమె తలెత్తి అతనివంక చూసింది. "ఎందుకులేబావా"

"ఫర్వాలేదులే"

అతడు ఆమెపక్కనే కూర్చున్నాడు. ఆమె చేతిలోని సన్నని ఇనుపకడ్డీ అందుకుని చెట్టు చుట్టూ బోదె చేయసాగాడు. శ్వేత మట్టిని సరిచేయసాగింది.

గత రెండురోజులుగా ఆమె ముభావంగా ఉండటం అతను గమనించాడు. కారణంకూడా ఊహించాడు... నిజానికి ఆమె అలా ఉండటమే ప్రస్తుతం అతనికి ఆనందంగా ఉంది. అందరికీ ఆశలు కలిగించటం అతనికి ఇష్టంలేదు.

కాసేపు పనిచేసిన తర్వాత ఇద్దరూ చేతులు కడుక్కున్నారు.

"రాబావా! కాఫీ తాగుదాం"

ఇద్దరూ ఇంట్లోకి నడిచారు.

రమేష్ బయట వరండాలోని కుర్చీలో కూర్చున్నాడు. శ్వేత రెండు కప్పుల్లో కాఫీ పట్టుకువచ్చి, అతడికి ఒకటిచ్చి తనొకటి ఉంచుకుంది.

అతడికి పక్కనేఉన్న కుర్చీలో కూర్చుందామె.

వారు కాఫీ సిప్‌చేస్తుండగా తలుపు చప్పుడయింది. చిరంజీవి లోపలికి వస్తున్నాడు.

"హలో చిరంజీవి... రండి కూర్చోండి" అన్నాడు రమేష్.

చిరంజీవిని చూడటంతోనే శ్వేత లోపలకు వెళ్లిపోయింది. అతడు మెట్లెక్కివచ్చి రమేష్‌పక్కనే ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

ఏమీతోచని ఆ పల్లెటూర్లో శ్వేత, చిరంజీవి లేనట్లయితే ఎప్పుడో పట్టణానికి పారిపోయేవా

డు రమేష్. ఈమధ్యకాలంలో రమేష్‌కు ఓ చక్కని కాలక్షేపం అయ్యారు చిరంజీవి.

"నేనొచ్చి మిమ్మల్ని డిస్టర్బ్ చేసినట్టున్నాను" చిలిపిగాచూస్తూ అన్నాడు చిరంజీవి.

"అలాంటిదేమీలేదు" నవ్వుతూ చెప్పాడు రమేష్.

లోపల నుండి పనిపిల్ల కాఫీ తీసుకువచ్చి చిరంజీవికి అందించింది. అతడు కప్పు చేతిలోకి తీసుకున్నాడు.

కాఫీ తాగిన తర్వాత చిరంజీవి అన్నాడు "అలా బయటకు వెళ్దామా"?

"అలాగే"

ఇద్దరూ బయటకు నడిచారు.

అప్పుడే పశువుల మందలు ఇంటికి వస్తున్నాయి. వాటికాలి రాపిడితో రేగినదుమ్ము పైకెగసిపోతోంది.

"ఎటువెళ్దాం" అడిగాడు రమేష్.

"ఈరోజు మాఇంటికి వెళ్దాం!"

"మీఇంటికా? వద్దులే మరోరోజు వెళ్దాం"

"చాలారోజులనుండి అలాగే అంటూ ఉన్నావు. కాని ఒక్కరోజు కూడా రాలేదు... ఈరోజు నువ్వు రాకతప్పదు"

కొత్త మనుమల మధ్యకు వెళ్లాలంటే తగని సిగ్గు రమేష్‌కు. కాని ఈరోజు తప్పేట్టులేదు.

"నరేపద"

ఇద్దరు పక్కసందుకు తిరిగారు.

రెండు సందులు దాటిన తర్వాత ఓ ఇంటి ముందు నిలిచాడు రమేష్- "ఇదే మా ఇల్లు" లోపలికి నడుస్తూ అన్నాడతను.

చిన్న రేకుల ఇల్లు అది. చుట్టూ ప్రహరీ, మధ్యన ఆఇల్లు చూడముచ్చటగానే ఉంది.

చిరంజీవి వెనుకే లోపలికి నడిచాడు రమేష్. బాటకు ఇరువక్కలా పూలమొక్కలు అందంగా పెంచబడివున్నాయి.

వరండామెట్లు ఎక్కబోతూ ఆవంక చూశాడు రమేష్.

ఆ వరండాలో ఒకమూలగా మంచంవేసి ఉంది. ఆ మంచంమీద ఓ ముదునలి పడుకొని ఉన్నాడు. ఆ మంచం పక్కేమీద ఒక ముసలామె కూర్చుని ఉంది.

అతడు విపరీతంగా దగ్గుతున్నాడు. ఆమె అతడి గుండెలమీద చేయివేసి నిమురుతోంది. అతడి ముఖంలో కనిపించే వేదనకన్నా ఆమె ముఖంలో ఎక్కువ దుఃఖం కనపడుతోంది.

"ఈ దగ్గు భరించలేకుండా వున్నానే రాజ్యం! నేను చచ్చినా బాగుణ్ణు" దగ్గుతూనే అన్నాడతను.

"ఊరుకోండయ్యా- ఏంమాటలయ్యి" అందామె.

అతడు మరేదో మాట్లాడబోయాడు.

ఎందుకో చిరంజీవి మెల్లగా దగ్గాడు. వారిద్దరూ తలతిప్పి వారివంక చూశారు.

తమ అబ్బాయితో పాటు మరో కొత్తవ్యక్తిని చూడటంతో అతను అనబోయిన మాటలు గొంతులోనే ఉండిపోయాయి.

"లోపలకురా రమేష్"

రమేష్ వాకిలివరకూ వెళ్లి ఆగాడు.

అప్పటివరకు లోపల పొయ్యివెలిగిస్తున్న నడివయస్సు స్త్రీ లేచివచ్చి రమేష్‌ను చూసింది.

చిరంజీవి ఆమె వంకతిరిగి చెప్పాడు "నేను రమేష్ అంటూ చెవుతుంటానే రఘురామయ్యగారి అల్లుడు... ఇతనే.

"రాబాబూ!" అందామె.

రమేష్ లోపలికి అడుగుపెట్టాడు. చిరంజీవి చూపించిన కుర్చీలో కూర్చున్నాడు.

"మా అబ్బాయి నీగురించి అప్పుడప్పుడూ చెవుతుంటాడు" చెప్పిందామె.

"అలాగా" అన్నాడు రమేష్.

చిరంజీవి పక్కనేఉన్న మంచంమీద కూర్చున్నాడు.

" మీ అమ్మ నాకు బాగా పరిచయం. ఈ ఊరు వచ్చినప్పుడల్లా మా ఇంటికి వస్తుంది. బాగుందా ఆమె.

"బాగుందండి"

ఆమె పక్కకు తిరిగి అల్మెరాలోఉన్న డబ్బాలోనుండి తినుబండారం తీసి ప్లేట్‌లో పెట్టి అతడి ముందుంచింది.

"ఎందుకండీ" మొహమాటపడ్డాడతను.

"ఫర్వాలేదులే తీసుకోబాబు"




అయిష్టంగానే ప్లేట్‌లో చేయిపుంచాడు రమేష్.

"శ్వేత చాలా మంచి అమ్మాయి. ఆ అమ్మాయిని చేసుకునేవాడు తప్పకుండా సుఖపడతాడు. ఆమె నీ భార్య కావడం నిజంగా నీ అదృష్టం నాయనా"

తింటున్నది గొంతుకు అడ్డుపడినట్లయింది.

"ఈ సంవత్సరం మా చిరంజీవికి కూడా పెళ్లిచేసెయ్యాలని అనుకుంటున్నాము... మొన్నొక సంబంధం చూసి వచ్చాము. కాని ఆ అమ్మాయివారి కుటుంబ పరిస్థితి మాకు నచ్చలేదు. అందుకే వద్దనుకున్నాము"

ఆ విషయం ఆ మర్నాడే చిరంజీవి తనతో అన్నాడు.

"ఆ అమ్మాయివారిది చాలా పేద కుటుంబం అట. కట్నకానుకలు ఎక్కువగా ఇచ్చుకోలేరు. అందుకే అతడి పెద్దలు అంగీకరించలేదు. ఆ అమ్మాయి పెద్ద అందగత్తె కాదు. ఆ కారణాన అతడికీ నచ్చలేదు'

'ఒక అమ్మాయికి-ఒక అబ్బాయికి పెళ్లి జరగాలంటే చాలామందికి చాలా నచ్చాలి. అబ్బాయి తండ్రికి కట్నం నచ్చాలి. అతడి తల్లికి ఆ ఇంటిలోని హంగులు-ఆడంబరాలు నచ్చాలి. పెళ్లి కొడుక్కేమో అమ్మాయి అందం నచ్చాలి. ఈ పైమెరుగులు చూసుకోబట్టే పెళ్లయిన మర్నాటి నుండి ఆ దంపతుల మధ్య కీచులాటలు మొదలవుతాయి. తమిద్దరిలో ఎవరు గొప్ప అన్నది తేల్చుకోవడం మొదలవుతుంది.... అసలు పెళ్లికూతురిలో చూడాల్సింది అందం, ఆస్తి కాదు- ఆమె మనస్సు, ప్రవర్తన. కాని అవి గుర్తించాలంటే పెళ్లిచూపులు పేరుతో ఒక గంట చూస్తే చాలదు. కొంత వ్యవధి తీసుకోవాలి...'

"నీ ఎరుకలో ఎక్కడైనా మంచి అమ్మాయి ఉంటే చూడు. మీ స్నేహితుడికి పెళ్లిచేసేద్దాం"

అతడికి పొలమారింది. ఆమె మంచినీళ్ళ గ్లాసు అతడికి అందించింది. అతడు తల మీద తట్టుకుంటూ, మంచినీళ్ళు తాగాడు..

"పెళ్ళెందుకు చేసుకోవాలి? అని తను ప్రశ్నించుకుంటూ, జవాబు కోసం అన్వేషిస్తుంటే, ఈ మహాతల్లి తనను పెళ్ళిళ్ళ పేరయ్యా పనిచేయమంటోంది- బాగుంది' మనసులోనే అనుకున్నాడు రమేష్.

పైకి మాత్రం "అలాగేలెండి" అన్నాడు.

ఆ తర్వాత ఆమె పొయ్యి దగ్గరకు వెళ్ళింది.

"ఎలా ఉంది మా ఇల్లు" అడిగాడు చిరంజీవి.

"సింపుల్‌గా, అందంగా ఉంది" చెప్పాడు రమేష్.

కొద్దిసేపు ఇద్దరి మధ్యా మౌనం.

ఆమె కాఫీ తీసుకువచ్చి ఇద్దరికీ ఇచ్చింది.

కాఫీ తాగిన తర్వాత పైకి లేచాడు రమేష్.

"మరికాసేపు ఉండకూడదూ" అన్నాడు చిరంజీవి.

"అలా చెరువుగట్టుకు వెళ్దాం" అన్నాడు రమేష్.

"సరే... పద"

చిరంజీవి తల్లికి వెళ్ళొస్తానని చెప్పి బయటకు నడిచాడు రమేష్.

వరండాలో నిలబడి ఆ వంక చూశాడు. 'ఆమె తన భర్త గుండెల మీద రాస్తునే ఉంది. అతడు దగ్గుతూనే ఉన్నాడు. ఆమె పనితో కాస్త సేదతీరుతూనే ఉన్నాడు'

ఎందుకో ఆ క్షణం అపురూపంగా అనిపించింది ఆ దృశ్యం.

అతడి చూపులను గమనించి చిరంజీవి అన్నాడు- "వారు మా అవ్వా తాత" అని ఆగి "నానమ్మా..." అని పిలిచాడామెను.

ఆమె వారి వంక తిరిగి "ఏంట్రా చిరంజీవి" అన్నది.

"తాతయ్యకు ఎలా ఉంది?"

"ఎన్నాటినుంచి ఆ దగ్గు తగ్గనేలేదురా. అప్పటికీ నువ్వు తెచ్చిచ్చిన టానిక్ తాపుతూనే ఉన్నాను" అని ఆగి-

"ఆ అబ్బాయి ఎవర్రా?" అంది.

"మన రఘురామయ్యగారి అల్లుడు"

రమేష్ ముందుకు కదిలాడు.

"నానమ్మా! నేను వచ్చేప్పుడు దాక్టర్ని పిలు

చుకుని వస్తాను''

"ఎందుకులేరా అనవసరంగా" మంచంలోని ఆయన మెల్లగా గొణిగాడు.

"నీకు తెలియదు ఊరుకోవయ్యా. డాక్టర్ వద్దంటావు, మళ్ళీ దగ్గుతూనే ఉంటావు. తెగ నీవూ, తెల్లారనీవూ... ఆయన అలాగే అంటాడు కాని నువ్వు డాక్టర్ని తీసుకురారా'' అందామె.

"అలాగేలే నానమ్మా'' చెప్పాడు చిరంజీవి.

వాకిట దగ్గరున్న రమేష్‌తో కలిసి వీధిలోకి నడిచాడు చిరంజీవి.

ఇద్దరూ చెరువు గట్టుకు నడిచారు.

అప్పుడే పొలాల నుండి కూలీలు తిరిగివస్తున్నారు.

తమకు వెనుక వస్తున్న మగవారి అల్లరి మాటలకు కాబోలు ఆడవారు మెల్లగా నవ్వుకుంటున్నారు.

పచ్చనిపొలాలు, పల్లెపడుచులు, ఎగిరేపక్షులు - మన పల్లెలు తమ స్వచ్ఛతను ఇంకా కోల్పోలేదు అనుకున్నాడు రమేష్.

సూర్యుడు అస్తమిస్తున్నాడు. ఆయన బంగారురంగు కిరణాలు సూటిగా రమేష్ ముఖం మీద పడుతున్నాయి. ఆ పసిడివన్నె కాంతితో అతడి ఎర్రని ముఖం మరింత ఎర్రగా కనిపిస్తోంది.

"మరో రెండు మూడురోజుల్లో నేను ఊరెళ్ళిపోతున్నాను'' అన్నాడు రమేష్.



"ఏమిటీ హఠాత్ నిర్ణయం" విస్మయం వ్యక్తంచేశాడు చిరంజీవి.

"హఠాత్ నిర్ణయమేమీ కాదు- అనుకుంటున్నదే, కాకపోతే నీకిప్పుడు చెబుతున్నాను"

"అప్పుడే వెళ్ళిపోతున్నావేం?"

"వచ్చి చాలారోజులయింది కదా?"

"యార్న్ కంపెనీ కూడా క్లోజ్ చేసేసని చెప్పావు - మరి ఊరెళ్ళి చేసేదేముంది?"

"అక్కడ చేసేదేమీలేదని, ఇక్కడ ఉండిపోవడం మంచిదికాదుకదా!"

"అదీ నిజమే" అని ఆగి తర్వాత ప్రశ్నించాడు - "శ్వేతను పెళ్ళిచేసుకున్న తర్వాత టౌన్‌లోనే ఉంటావా లేక ఇక్కడికి వచ్చేస్తావా?"

శ్వేతతో తన పెళ్ళి జరగడంలేదన్న విషయం అతడికి చెప్పడం ఇష్టంలేకపోయింది. చెపితే అందుకు కారణం చెప్పాలి. కారణం చెపితే అతడు నవ్వుతాడు. అందుకే "ఇంకా ఆలోచించుకోలేదు" అన్నాడు.

"పెళ్ళి విషయంలో నీవంటి అదృష్టవంతులు ఏ కొద్దిమందో మాత్రమే ఉంటారు. మంచి అమ్మాయి, మంచి ఆస్తి"

జవాబు చెప్పలేదు రమేష్. అసలా మాటలు వినడమేలేదతను.

మరికొద్దిసేపు తర్వాత "వెళ్దామా" అన్నాడు రమేష్.

తలూపాడు చిరంజీవి.

ఇద్దరూ ఊళ్ళోకి నడిచారు.

రమేష్‌ను అతడి ఇంటి ముందు వదిలి వెళ్ళిపోయాడు చిరంజీవి.

ఆ రాత్రి పడుకున్న తర్వాత రమేష్ కనుల ముందు ఒక దృశ్యం నిలిచింది.

ఒక ముదుసలి, మరో ముసలాయనకు సేవలు చేస్తోంది. అతడికి తోడుగా ఉంది. బాధను మరిపించే కబుర్లు చెపుతోంది.

వారెవరోకాదు- చిరంజీవి నానమ్మ, తాత.

వారు గుర్తుకు వస్తుంటే రమేష్‌కి తన ప్రశ్న కూడా గుర్తుకువస్తోంది.

ఆ ప్రశ్నకు జవాబు లీలగా తోస్తోంది.

పూర్తిగా అర్థం కావటంలేదు.

మగాడికి పెళ్ళి ఎందుకు?... అవసరమా?

ఆ జంటను చూస్తుంటే అవసరమనే లీలగా అనిపిస్తుంది.

ఎందుకు? అంటే అందుకు అతడు సరయిన సమాధానం చెప్పలేడు.

సరయిన సమాధానం లభించాలంటే, అనుభవం కావాలి. అనుభవపూర్వకంగా తప్ప ఎవ్వరు కూడా మరేవిధంగా ఆ ప్రశ్నకు సమాధానం పొందలేరు.

అతడికి అలాంటి అనుభవం త్వరలోనే వచ్చింది.

కె.యమ్.టి. సంస్థ ఇచ్చిన గడువు పూర్తయిపోయింది. కాని రవీంద్ర నుండి తనకింతవరకూ ఎలాంటి రిప్లయ్ అందలేదు. కనీసం తను రాసిన ఉత్తరానికి జవాబు కూడా లేదు.

రమేష్ అప్పటికే తన తల్లికి జాబు రాశాడు. రవీంద్ర నుండి ఏదయినా కవరు అంది ఉంటే దానిని రీడైరెక్ట్ చేయమని. ఆమె అందుకు వెంటనే రిప్లయ్ రాసింది. "కె.యమ్.టి. సంస్థ నుండి ఎలాంటి కవరూ అందలేదని, కాని అప్పులవాళ్ళు ఒకరిద్దరు ఇంటికివచ్చి అడిగిపోయారని"

విషమిస్తున్న పరిస్థితులను చూస్తుంటే తల పగిలిపోతోంది.

పల్లెటూర్లో ఎంతకాలం ఉన్నా చేయగలిగింది ఏమీలేదు. కాకపోతే కొద్ది రోజులపాటు మనశ్శాంతిగా తలదాచుకునేందుకు పనికివచ్చింది.

తను ఏనాటికైనా పట్నం వెళ్ళాలి. పరిస్థితులను ఎదుర్కోవాలి, తప్పదు.

అందుకే అతడు తన ప్రయాణం గురించి మామయ్యకు చెప్పాలని అనుకున్నాడు...

పట్నం వెళ్ళిన తర్వాత తనేం చేయాలి? ముందు తనేదైనా ఉద్యోగం చూసుకోవాలి. ఉద్యోగం చేస్తూ అప్పులు కట్టుకోవాలి. ఇంటిని గడపాలి.

ఇక తన బతుకింతేనా?

తల్లి అనే మాటలు వింటుండవలసిందేనా?

జీతం డబ్బులతో చాలీచాలని బతుకు గడపవలసిందేనా?

అతడికి దిక్కుతోచడంలేదు.

ఇలాంటి పరిస్థితిలో తనకెవరైనా అండగా ఉంటే బాగుండుననిపించింది. తన బతుకులో కష్టసుఖాలను పంచుకునే వ్యక్తి ఉంటే మంచిదనిపించింది.

అతను తల పట్టుకు కూర్చున్నాడు.

ముందు అంతా శూన్యం వెనుకంతా నిరాశ.

ఏమిటి చేయడం?

భవిష్యత్ ఎలా గడపడం?

ఆలోచనలలోపడి తన ఎదుట మనిషి నిలబడింది కూడా గుర్తించలేదు. ఆమె పిలుపులను వినిపించుకోలేదు.

"బావా... బావా" అతడి భుజాలను పట్టుకుని కుదిపింది శ్వేత.

అతడు ఉలిక్కిపడి ఆమె వంక చూశాడు.

"ఏమిటి బావా! ఆలోచనలలోపడి, పక్కన మనిషి పిలవడం కూడా గుర్తించడంలేదు" చిరునవ్వు ఆమెకు పెట్టని ఆభరణం.

"ఏదో ఆలోచనలలో పడి" నవ్వాడతను.

"అదే నేనూ అడిగేది... లోకాన్ని మరిపించిన ఆ ఆలోచనలు ఏమిటా అని?"

"ఏవో, భవిష్యత్ గురించిన ఆలోచనలు"

ఆమె ఒక్కసారిగా తలదించుకుంది. 'బంగారంలాంటి భవిష్యత్‌ను ఎదుటపెట్టుకుని కూడా, చిన్న సిల్లీ ప్రశ్నకు జవాబు దొరకలేదని, ఆ మంచి భవిష్యత్ కాలదన్నుకుంటున్నావు' పైకి అనలేకపోయిందా మాటలు.

"తోటలోనికి వెళ్దాం. వస్తావా బావా?" అడిగిందామె.

ప్రస్తుత పరిస్థితిలో ఎవరైనా తోడుంటే బాగుండుననిపిస్తోంది అతడికి. అందుకే అంగీకారంగా తలూపాడు అతడు.

ఇద్దరూ తోటలోకి నడిచారు.

సంధ్యాసమయం అది. అస్తమించేప్పుడు కూడా సూర్యుడు తన మేని బంగారుచ్ఛాయను కోల్పోలేదు.

పక్కపక్కనే నడుస్తూ తోటలో నలువైపులా తిరిగారు వారు.

ఓ కోకిల కొమ్మమీద వాలి దోరజామపండును ముక్కుతో పొడిచి తింటోంది. ఓ ఉడుత కొమ్మల మీద అటు ఇటు పరిగెడుతోంది.

ఓ చెట్టుబోదెకు ఆనుకుని కూర్చున్నారు వారిద్దరూ.

అతడి గుండెలు నిండుగా వేదన నిండుకుని ఉంది. తన బాధను వినేవారుంటే బాగుణ్ణనిపించింది. కాని తన బాధను వినేవారెవరు, ప్రస్తుతం తన పక్కన శ్వేత మాత్రమే ఉంది...

"బావా! నువ్వు మరీ దిగులుపడిపోతున్నావు... ఎందుకు అంత దిగులు?"

అతడు నిట్టూర్చాడు. ఈ జీవనపోరాటం గురించి ఆమెకేం తెలుసు. తండ్రి సంపాదించింది తింటూ, హాయిగా నీడపట్టున ఉండే స్త్రీ ఆమె. కష్టసుఖాలలో సుఖం మాత్రమే తెలిసిన తండ్రిచాటు బిడ్డ ఆమె... తన పరిస్థితి గురించి ఆమెకు చెప్పినా ఆమె అర్థం చేసుకోగలదా?

"జీవితంలో చాలా కోల్పోయాను శ్వేతా!" అతడి గొంతు జీరగా పలికింది.

"ఏం కోల్పోయావు బావా?"

తనకు ప్రియమైన బావను ఆ పరిస్థితుల్లో చూస్తుంటే ఆమెకు బాధ వేస్తోంది.

అతడు తనలోని వేదనను భరించలేకున్నాడు. ఎదుటివారికి చెప్పుకుంటే వేదన కొంతవరకూ తగ్గుతుంది. అందుకే అతడు ఇక తన మనసులోని వేదనను దాచుకోలేకపోయాడు.

"చాలా కోల్పోయాను శ్వేతా! భవిష్యత్ అగమ్యగోచరమైంది. ఏంచేసి బ్రతకాలో అర్థంకావడంలేదు. ఉన్న డబ్బంతాకాక అప్పుచేసి కూడా యాడ్‌మీద పెట్టాను. వారిచ్చిన గడువుదాటిపోయినా వారింకా డబ్బు పంపలేదు. ఇక ఆ డబ్బుకు తిలోదకాలు అర్పించవచ్చు. డబ్బుపోవడమే కాదు ఎదుట అప్పు మిగిలింది. ఆ అప్పు ఎలా తీర్చాలో అర్థం కావడం లేదు. ఏ పనిచేసి ఈ అప్పు తీర్చాలి... ఇక ఇప్పుడు ప్రయత్నించినా ప్రభుత్వోద్యోగం వస్తుందన్న నమ్మకం లేదు. కాబట్టి ఏ ప్రైవేట్ కంపెనీలోనో పనిచేస్తూ జీవితం గడపాలి. ఆ జీతం ఇంటి ఖర్చుకి జరిగిపోతుంది. మరి అప్పుఎలా తీర్చాలి?"

"సమస్యలను ఎదుర్కోవాలికాని దిగులుపడితే ఎలా బావా?"

"అవి దిక్కుతోచని సమస్యలయినప్పుడు దిగులుపడక చేయగలిగింది ఏముంది?"

ఆమె మౌనం వహించింది. ఆమెతోపాటే అక్కడి వాతావరణం కూడా నిశ్శబ్దం పాటించింది. చెట్లు తలలూపడం మాని నిశ్చలమైనాయి. గాలి వీచడం ఆగి స్తంభించిపోయింది. ప్రకృతి అంతా గంభీరమైపోయింది.

రమేష్‌కు ఇప్పుడు తన బాధలు వినేతోడు ఒకరు దొరికారు. ఇలాంటి తోడే తనకు కావలసింది. ఈ తోడు అందించే [illegible] కూడా తనకు కావాలి. అది [illegible]

అతడి కనులముందు [illegible] తాత కదలాడాడు. ఆ [illegible] సన్నివేశంలో ఆ తాత పొందినది ఏమిటి? తను అంత బాధలో ఉండి కూడా, ఆమె సన్నిధిలో ఏదో ప్రియమైనది పొందుతున్నాడు. ఏమిటది?

అతడిలో ఎన్నడూ లేని విధంగా కొన్ని భావాలు కలిగాయి. 'తను శ్వేతకు మరింకా దగ్గరగా ఉండాలి. ఆమె ఒడిలో తలవాల్చుకుని తనలోని బాధను విడమరచి చెప్పుకోవాలి'.

ఆమె ఒక పరాయిస్త్రీ అని, అందులోనూ తనుతిరస్కరించినఅమ్మాయిఅని కూడా గుర్తుకురాలేదు. కేవలం ఆమెనుంచి ఒక ఊరడింపు పొందే ఉద్దేశమే అతడిది.

అందుకే అతడు సంకోచించకుండా ఆమెను అడిగాడు "శ్వేతా! నేను... నేను నీ ఒడిలో తలవాల్చుకోవచ్చా?"

అతడు అడిగిన విధానానికి ఆమె చలించిపోయింది. అతడి మనసులో తన స్పర్శాసుఖాన్ని పొందాలన్న ఉద్దేశం మాత్రం లేదన్నది ఆమె గుర్తించింది. అతడు తన నుంచి కోరుకునేదేమిటో ఆమెకు అర్థమయింది.

"అలాగే బావా" ఆ మాట చెబుతున్నప్పుడు ఆమె గొంతు సన్నగా వణికింది.

అతడు పక్కకు తిరిగాడు. ఆమె ఒడిలో తన తలను ఉంచాడు.

తన స్పర్శను అతనెలా ఫీలయ్యాడో ఏమో కాని, తనుమాత్రం ఒక వింత అనుభూతికి లోనయింది శ్వేత. ఆమె శరీరం సన్నగా కంపించింది. కింది పెదవిని పైపంట నొక్కిపట్టింది. మధురానుభూతిలో తేలుతూ క్షణంసేపు అరమోడ్పు కన్నులతో ఉండిపోయిందామె.

ఆ మధురానుభూతులేవీ అతనికి తెలియవు. అతడు కోరుకున్నది కేవలం బాధను మరచిపోవడం మాత్రమే.

కొద్దిసేపటికి ఆమె ఈ లోకంలోనికి వచ్చింది. అతడు ఏమి కోరి తన ఒడిలోనికి వాలాడో గుర్తుకువచ్చింది.

"సమస్యలెప్పుడూ ఎల్లకాలం ఉండవు బావా" ఊరడింపుగా అందామె.

"ఇందులో నా తప్పు కూడా ఏమీలేదు శ్వేతా. లాభం వస్తుందన్న ఉద్దేశంతో అప్పు తెచ్చి పెట్టుబడి పెట్టాను. దురదృష్టవశాత్తు ఆ కంపెనీ యజమాని అకస్మాత్తుగా చనిపోవడంతో నాకు రావలసిన మొత్తం ఇలా ఆగిపోయింది. వ్యాపారం క్లోజ్ చేశాను. అప్పులవారి బాధ అధికమయింది. ఆ బాధలను కూడా తట్టుకోసాగాను. కాని ఇంట్లోని బాధనే భరించలేకపోయాను. నాకు తోడంటూ ఉన్నది అమ్మ ఒక్కతే - ఆ అమ్మ కూడా నా పరిస్థితిని అర్థంచేసుకోలేదు. మాటలతో బాధపెట్టడం మొదలుపెట్టింది. ఇంట్లోనూ మనశ్శాంతి లేకుండాపోయింది— అది ఆమె తప్పని నేను అనను. ఎందుకంటే ఆమెకు నా మీద ప్రేమాభిమానాలు ఉన్నాయి. కాని ఆమె నన్నూ – నా మనఃస్థితిని అర్థంచేసుకోలేకపోయింది. విసుక్కుందామంటే కన్నతల్లి. ఆమెకు నా పరిస్థితి వివరిద్దామంటే అర్థం చేసుకోలేదన్నది నాకు తెలుసు. కారణం జనరేషన్ గేప్. ఆనాటి కాలపరిస్థితులతో నేటిని పోల్చుకోకుండా నను మళ్ళీ ఇబ్బందిపెట్టడం— రేపోమాపో నేను ఊరెళ్ళిపోవాలి. అక్కడికి వెళితే నా పరిస్థితి తలచుకుంటే నాకిప్పుడే దిగులువేస్తోంది."

"ఊరెందుకు వెళ్ళడం ఇక్కడే ఉండిపోకూడదూ?"

"ఇక్కడ ఎంతకాలమున్నా నేను చేయగలిగిందేముంది? ఏ నాటికైనా పరిస్థితులను ఎదుర్కోక తప్పదు" అతడి స్వరంలో బాధ సుడులు తిరిగింది.

ఆ క్షణం అతడి మీద ఎంతో జాలి కలి.




# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి,
పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి
సెరిలాక్ లాభాన్ని అందించండి.

**పోషకాహార లాభం :** సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

**రుచి లాభం :** పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

**సమయం ఆదా లాభం :** సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ, పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

**ఎంపిక లాభం :** ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి వివిధ రకాలతో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీద సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించి




4 మాసాలు నించి




6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి: సెరిలాక్
పోస్ట్ బాక్స్ నెం 3
న్యూ ఢిల్లీ 110008




సెరిలాక్ రకాలు: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

RK SWAMY/FSL/5112/TEL

గిందామెకు. అప్రయత్నంగానే ఆమె చేయి అతడి నుదుట మీద చేరి అతడి జుట్టును మృదువుగా వెనక్కునెట్టింది.

రమేష్ ఉలిక్కిపడ్డాడు.

జీవితంలో అంతకుమునుపెన్నడూ అంతటి హాయిని పొందలేదు రమేష్.

ఆమె తన వెంట్రుకలను అలా మృదువుగా సవరిస్తుంటే ఈ ప్రపంచాన్ని జయించినంత హాయిగా ఉందతనికి.

ఆమె గొంతు మెల్లగా పలికింది... "బావా? ఇందులో నీ తప్పేంలేదు. లాభం కోసం పెట్టుబడి పెట్టావు. దురదృష్టవశాత్తు నష్టం వచ్చింది. ఇది నీ తప్పు వల్ల జరిగింది కాదు. అత్తమ్మ నిన్ను అర్థంచేసుకోలేక అలా అని ఉంటుంది... అంతే తప్ప నీ మనసును బాధ పెట్టాలన్నది ఆమె ఉద్దేశంకాదు... బాధలు అన్నది మనిషికి సర్వసామాన్యం బావా"

ఆమె మాటలు పన్నీటిజల్లుల్లా అనిపించాయి అతడికి.

తాను ఇంతకాలం పొందలేనిది ఏదో ఆమె దగ్గర పొందుతున్నట్టుగా అనిపించింది. అది మరెవరూ ఇవ్వలేనిది.

ఒకానొక పరిస్థితిలో ఇలాంటి తోడు కోసం, తాను ఇలాంటి లాలన కోసమే ఎదురుచూసింది అనుకొన్నాడు.

"–బావా... నీ తప్పు లేకుండానే సమస్యలు వచ్చిపడ్డాయి నీకు. కాని సమస్యలను చూసి దిగులుపడటం నాకు నచ్చలేదు. నువ్వు ఎంతో తెలివైనవాడివి. అంతకుమించి పట్టుదల కలిగినవాడివి. నిజానికి నువ్వు తలచుకుంటే ఈ సమస్యలను చిటికెలో పరిష్కరించగలవు. మరేదైనా వ్యాపారం చేసి నీ పూర్వస్థితిని తెచ్చుకోగలవు. నువ్వు దిగులుపడటం అన్నదే నీలో నాకు నచ్చనిది"

సడలిపోతున్న అతడి ధైర్యం తిరిగి పుంజుకోసాగింది.

ఇంతకాలంగా తనను ఇలా ఉత్సాహపరిచినవారేరీ?

"ఏమిటో శ్వేతా! ఒక్కసారిగా సమస్యలన్నీ చుట్టుముట్టేసరికి భయపడిపోయాను" అన్నాడతను.

"సమస్యలు ఎదురయినపుడే ధైర్యంగా ఉండాలి బావా"

"నిజమే" ఒప్పుకున్నాడతను.

"దిగులుపడకు బావా" మృదువుగా చెప్పింది శ్వేత.

చాలాకాలంగా అతని మనసులో పేరుకుని ఉన్న బాధ మెల్లగా కరిగిపోసాగింది. ఇంత కాలం తనకు దక్కనిది ఏదో ఆ క్షణం తనకు దక్కినట్టనిపించింది.

చిరంజీవి తాత తన భార్య దగ్గర 'ఏమి' పొందుతూ తృప్తిపడ్డాడో, 'అదే' తనకిప్పుడు దక్కింది.

బాధలతో ఉన్న ప్రతివ్యక్తికీ కావలసినదది.

'అది' ఎవరి దగ్గర దొరుకుతుందంటే

"యురేకా"

పిడికిళ్ళు బిగించి పెద్దగా అరిచాడతను.

"నేను కనుక్కున్నాను— నాకు జవాబు దొరికింది — నా ప్రశ్నకు సమాధానం దొరికింది"

పైకి లేచి పెద్దగా అరుస్తూ గిరగిర తిరగసాగాడు. మరుక్షణం శ్వేతను పైకెత్తి గిరగిరా తిప్పాడు.

"హాయ్ శ్వేతా! నా ప్రశ్నకు జవాబు దొరికింది. ఐగాటిట్ —— మగాడికి పెళ్లి ఎందుకో తెలుసుకున్నాను"

ఆమెకు కళ్ళు గిర్రున తిరుగసాగాయి. అయినా అతడి ఆనందంలో పాలుపంచుకోవటం వలన అది సంతోషంగానే భావించిందామె.

"యూ!" తిప్పితిప్పి అలసిపోయి, ఆమెను కిందికి దించాడు - భూమి తన చుట్టూ తిరుగుతున్నట్టనిపించిందామెకు.

ఆనందం పట్టలేక ఆమెను గట్టిగా కౌగలించుకుని పెదాల మీద గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు.

కొద్దిసేపటివరకూ ఆమె అలౌకికస్థితిలో ఉండిపోయింది. కన్నులు అరమోడ్పులయ్యాయి.

'మొదటి ముద్దు' మరో లోకానికి తీసుకెళ్ళింది.

ఆ తన్మయత్వం నుండి కొద్దిసేపటికి బయ




టపడిందామె.

మొదట సిగ్గుపడింది శ్వేత.

కాని సిగ్గుపడే అవకాశం ఇవ్వలేదు రమేష్. కనీసం తను ఆమెను ముద్దుపెట్టుకున్నానన్న భౌతికజ్ఞానం అతడిలో లేదు. అమితోత్సాహం అతడిని నిలువనీయలేదు.

గత పదేళ్ళుగా తన మనసులో మెదలాడు తున్న ప్రశ్నకు జవాబు దొరికింది!

ఆ ఆనందంలోనే ఉన్నాడతను.

ఆమెకు పెదవుల మీద తీపి ఇంకా తగ్గలే దు. మనసులోని ఉద్వేగం మాత్రం తగ్గింది. ఆ తర్వాత బావ కనుక్కున్న ఆ జవాబేమిటో తెలుసుకోవాలన్న ఉత్సుకత కలిగింది.

"బావా... ఏం కనుక్కున్నావు? నీ ప్రశ్నకు జవాబు ఏమిటి?"

అతడు అలసిపోయినట్టుగా చెట్టు మొద లుకు భుజాన్ని ఆనించాడు. ఎగ ఊపిరి పీలుస్తూ అన్నాడు "చెప్తాను"

ఆమె కూడా అతని పక్కనే చెట్టుకు ఆను కుంది.

"ఊ...చెప్పు బావా?" మళ్ళీ అడిగిందామె.

"అది...అది..." హఠాత్తుగా మాటలు ఆపేశా డతను. ముఖం మీది నవ్వు ఒక్కసారిగా మాయమయింది.

ఆమె అతడి ముఖం వంక చూసింది. అతడి ముఖంలో అంత హఠాత్తుగా మార్పు ఎందుకొచ్చిందో ఆమెకు అర్థం కాలేదు.

"ఏమిటి బావా?...ఏమయింది?" అడి గిందామె.

"ఏం? లేదు...ఆ ప్రశ్నకు జవాబు నీకు ఇప్పుడే చెప్పను"

"ఏం... ఎందుకని?" విస్మయంగా అడి గిందామె.

అతడు దీర్ఘంగా నిట్టూర్చాడు - "నేను ఇంతకాలం నా మనసులోని ఆ ప్రశ్నకు జవా బు అన్వేషిస్తూ నిన్ను తిరస్కరించాను. ఇప్పు డు నా ప్రశ్నకు జవాబు దొరికింది. కాని నిన్ను పెళ్లిచేసుకోలేను. కారణం ప్రస్తుతం నా పొజి షన్ బాగులేదు. ఈరోజు నేను నిన్ను పెళ్లిచేసు కుంటానంటే మీ నాన్న ఆనందంగా అంగీక రించవచ్చు. కాని ఈనాటి నా స్థితి, నిన్ను పొందేందుకు నాకే గిల్టీగా ఉంది...కాని అనా దు నీమీద నాకు ప్రేమలేదు. ఈరోజు నా గుండెల నిండుగా ప్రేమ ఉంది...అయినప్పటి కీ పెళ్ళాడేందుకు ఏదో బిడియం అడ్డువ స్తోంది"

"దానికీ, దీనికీ సంబంధం ఏమిటీ బావా?" అనుమానంగా అడిగిందామె.

"నేనెంతో అన్వేషించి కనుక్కున్న ఈ జవా బు తొలిరాత్రి కానుకగా మొదటిసారి నా భార్య కే చెప్పాలన్నది నా కోరిక...బహుశా ఆ అదృష్ట వంతురాలవు నువ్వే కావచ్చు"

"నాకర్థం కాలేదు" అన్నదామె.

"ప్రస్తుతం నా స్థితి సరిగాలేదు. కాని నువ్విచ్చిన ప్రోత్సాహంతో తిరిగి టౌన్‌కి వెళు తున్నాను. నువ్వు కొద్దికాలం ఓపిక పట్టగలి గితే, నా పొజిషన్ ఉన్నతస్థాయికి తెచ్చుకుంటా ను నేను. అప్పుడు మనిద్దరం పెళ్లి చేసు కుందాం

నువ్వు ఒప్పుకుంటావని నాకు తెలుసు" అన్నాడతను.

ఆమె సంతోషంగా నవ్వింది.

కొమ్మమీద కోయిల పాట పాడసాగింది. కొ మ్మలు సంతోషంగా ఊగసాగాయి. గాలి ఆహ్లా దకరంగా వీచసాగింది.

"లోపలికి వెళ్దామా?" అన్నాడతను.

అలాగేనన్నట్టు తలూపిందామె.

ఇద్దరూ లోపలకు నడిచారు.

ఆ రాత్రి వారిద్దరూ ప్రశాంతంగా నిద్రపో యారు.

★ ★ ★

మధ్యాహ్నంవేళ అందరూ భోజనానికి కూర్చున్నారు.

"మామయ్యా... నేను రెండురోజులలో టౌన్ కి వెళ్ళాలని అనుకుంటున్నాను."

"వెళ్ళి ఏం చేయాలనుకుంటున్నావు?" అడిగాడు రఘురామయ్య.

"వెళ్ళిన తర్వాత ఆలోచించుకుంటాను. ఎంతకాలమని ఇలా ఖాళీగా కూర్చోగలను" అన్నాడు రమేష్.

"అదీ నిజమే...నీకేదయినా డబ్బు అవసర

మయితే అడిగి తీసుకో. ఉచితంగా వద్దనుకుంటే అప్పుగానే తీసుకో"

"అవసరమైతే తప్పక తీసుకుంటాను" చెప్పాడు రమేష్.

భోజనాలు పూర్తయ్యాయి.

తన గదిలోనికి నడిచాడు రమేష్.

అతడి వెనుకే గదిలోనికి వచ్చింది శ్వేత.

అతడు మంచం మీద కూర్చున్నాడు. ఆమె అతడికి ఎదురుగా కుర్చీలో కూర్చుంది.

"అన్నట్టు పట్నం వెళ్లి ఏం చేయాలనుకుంటున్నావు బావా?" అడిగింది శ్వేత.

"మళ్లీ యాడ్స్ కంపెనీ ఓపెన్ చేద్దామనుకుంటున్నాను" చెప్పాడు రమేష్.

"పెట్టుబడి"? ప్రశ్నించిందామె.

"ఈసారి అమ్మ నగలతో ప్రయత్నించి, నా అదృష్టాన్ని పరీక్షిద్దామనుకుంటున్నాను" జవాబిచ్చాడతను.

"అత్తయ్యను బాధపెట్టడం ఎందుకు? నాన్న దగ్గరనే అప్పుగా తీసుకోకూడదూ?" సలహా ఇచ్చిందామె.

అతడు తలను అడ్డంగా ఊపాడు. "ఒకసారి చేసిన తప్పు తిరిగి చేయను. అప్పుచేసి వ్యాపారం చేయడం నాకిష్టంలేదు ... మరోసారి నా అదృష్టాన్ని పరీక్షించుకోవటంలో మరొకరిని ఇబ్బందిపెట్టడం నేను ఒప్పుకోను" ఖచ్చితంగా అన్నాడు రమేష్.

ఇద్దరిమధ్యా కొద్దిసేపు మౌనం ప్రవహించింది.

ఆ మౌన స్రవంతికి తన మాటలతో అడ్డువేసిందామె.

"మనిద్దరికీ వీలయినంత త్వరలో పెళ్లిచేసెయ్యాలని మానాన్న చాలా తొందరపడుతున్నాడు. రాత్రి అమ్మతో "వీరిద్దరికీ త్వరలో పెళ్ళి చేసేద్దామనుకుంటున్నాను" అని అంటుంటే విన్నాను.

"అలా అయితే రేపు ఆయనతో ఈ విషయం కదిలిస్తాను. జీవితంలో స్థిరపడేవరకూ పెళ్ళి చేసుకోదలచుకోలేదని ఆయనతో అంటాను"

అతడి మాటలకు ఆమె చిన్నగా నవ్వింది.

"ఎందుకు నవ్వుతున్నావు?" ఆమె నవ్వడంచూసి, అడిగాడు ఆమెను.

"నిన్నటివరకూ నువ్వు నీ ప్రశ్నకు జవాబు కావాలని వెతుకుతూ పెళ్లి వద్దన్నావు. ఈరోజు జీవితంలో స్థిరత్వం లేదని పెళ్ళిని వాయిదా వేస్తున్నావు" జవాబిచ్చిందామె.

అతడు కూడా నవ్వాడు. "నిజమే... వినాయకుడి పెళ్లిలా తయారయింది నాపెళ్లి"

రమేష్ మంచంమీదనుండి పైకిలేచి కిటికీ దగ్గరగా నడిచాడు.

కిటికీలోనుండి బయట కనిపించే ప్రకృతిని చూడసాగాడు.

ఆమె కూడా కుర్చీలోనుండిలేచి, అతడి పక్కగా వచ్చి నిలబడింది.

అతడు తలతిప్పి ఆమె వంక చూసి నవ్వాడు. ఆమె కూడా పెదాలు విడకుండా నవ్వింది.

రమేష్ చెయ్యి అప్రయత్నంగా ఆమె భుజాలచుట్టూ పడింది. ఆమె అభ్యంతరపెట్టలేదు. అతడు తన రెండవ చేతితో చేతిని పట్టుకుని ఆమె మరింతగా దగ్గరకు లాక్కున్నాడు.

వారిద్దరూ ఒకరి కళ్లలోనికి ఒకరు చూసుకుంటూ చాలాసేపు ఉండిపోయారు.

కొద్దిసేపటికి ఆమె అతడికి దూరంగా జరిగింది.

అతడు మంచంమీద కూర్చున్నాడు. ఆమె అతడి ఎదురుగా కుర్చీలో కూర్చుంది.

ఆమెకు నిన్న మధ్యాహ్నం గుర్తుకువచ్చింది. పెదవులమీద అతడు అద్దిన తీపి ముద్దు జ్ఞప్తికి వచ్చింది.

"బావా..." పిలిచిందామె.

అతడు ఆమె వంక చూశాడు. ఏమిటన్నట్టుగా కళ్లతోనే ప్రశ్నించాడు.

"ఒకవేళ ఎంత ఉత్సాహం కలిగితే మాత్రం పరాయి ఆడపిల్లను అవని చేయటం ఏమిటి బావా?" ఆమె ముఖంలో సిగ్గు కదలాడుతోంది.

"ఉత్సాహమా? ... ఎప్పుడు? ... అనలేం చేశాను"

"నిన్న మధ్యాహ్నం నన్ను గాలిలోతిప్పినప్పటి సంగతి"




ఎన్ని ముద్దాడామో? ఏం చేశానేమిటో?"

"నీకు తెలియదా?"

"గుర్తులేదు"

సిగ్గుపడుతూ చాలాసేపు ఉండిపోయిందామె. అతను రెట్టించి అడగడంతో అసలు విషయం మెల్లగా చెప్పింది.

"నిజమా?" అడిగాడు రమేష్.

"మొదటి ముద్దు గుర్తులేని మొద్దవతారం ఎవరూ ఉండరు ... మరి నిన్నేమని పిలవాలో నాకర్థం కావడంలేదు" చిరుకోపంగా చూస్తూ చెప్పిందామె.

అతను చిరునవ్వు నవ్వాడు.

"ఆ క్షణం నాకు అంతటి ఆనందం కలిగింది. జవాబు దొరుకుతుందో, దొరకదో అని అనుమానిస్తున్న ఆ ప్రశ్నకు జవాబు దొరకడంతో ఈ లోకాన్ని మరచిపోయాను. ఆ క్షణం ఏం చేశానో నిజంగా నాకు తెలియదు ... మొదటి ముద్దు చాలా తియ్యగా ఉంటుందట. కాని ఆ ఆనందంలో ఈ అనుభూతి గుర్తుంచుకోలేకపోయాను"

అతడి కళ్లు చిలిపిగా నవ్వుతున్నాయి.

అతను ఆమె దగ్గరగా నడిచాడు. నువ్వు 'మొదటిముద్దు' అనుభవం అనుభూతిగా మార్చుకున్నావు. కాని నాకు 'ముద్దు' ఎలా ఉంటుందో ఇంతవరకూ తెలియదు. ప్లీజ్... ఆ అనుభవం ఎలా ఉంటుందో ఒకసారి రుచిచూపించవూ!"

"ఏయ్" అతడి వంక చిరుకోపంగా చూసింది శ్వేత.

"ప్లీజ్" అన్నాడు రమేష్.

"పెళ్లయినతర్వాత" అన్నదామె.

"ఇవి దొంగచాటుముద్దులు- చాలా తియ్యగా ఉంటాయి" అతను ముందుకు వంగాడు.

"వద్దుబావా" మనసులో ఎలాఉన్నా పైకి మాత్రం అలా అన్నది

"ఆ అనుభవం నువ్వు పొందేసి, నాకు దక్కనివ్వకుండా ఉండటం చాలా అన్యాయం" అతడి ముఖం ఆమె ముఖం దగ్గరగా జరిగింది.

"ఎవరైనా చూస్తారు" ఆమె కన్నులు వాకిలి వంక చూశాయి.

"కాబోయే భార్యాభర్తలం. ఎవరైనా చూసినా 'పాపం కుర్రాళ్ళు' అనుకుంటారే కాని తప్పుగా అనుకోరు" అతడి పెదవులు ఆమె పెదవులను తాకాయి. ఇక మాట్లాడేందుకు ఆమెకు అవకాశం లేకుండాపోయింది.

ఆమె కన్నులు అరమోడ్పులయ్యాయి.

అతడి రెండుచేతులూ, ఆమె ముఖాన్ని అదిమిపెట్టాయి.

అప్రయత్నంగానే ఆమె తన రెండుచేతులూ, అతడి మెడచుట్టూ వేసింది.

ఆ ముద్దు చాలా దీర్ఘంగా సాగింది.

ఇద్దరూ చిరునవ్వుతో ఒకరి ముఖంలోకి ఒకరు చూసుకున్నారు.

"ముద్దు అనుభవాన్ని ఇప్పుడు నేనూ పొందాను" ఆమెతో చెప్పాడతను.

ఆమె సిగ్గుగా నవ్వింది.

"నిజంగా ముద్దు చాలా తియ్యగా ఉంటుంది" అన్నాడతను.

శ్వేత మరింత సిగ్గుపడిపోయింది.



జానకమ్మ హఠాత్తుగా కోడూరుపల్లె వచ్చింది.

అందరూ ఆశ్చర్యపోయారు- ఆమె రాకకు.

"ఏమ్మా! కనీసం జాబుకూడా రాయకుండా ఇలావచ్చేశావేమిటి?" అడిగాడు రమేష్.

కుటుంబసభ్యులందరూ ఆమెను చుట్టేన్నారు. "జాబురాసే వ్యవధే ఉంటే నేనెందుకిలా రావడం? కనీసం టెలిగ్రాం ఇద్దామన్నా.. అదీ చేరుతుందన్న నమ్మకంలేక




నేనిలా వరిగెత్తుకువచ్చాను''

"ఏమైందమ్మా". అడిగాతడను.

"నిన్న రవీంద్ర మనింటికి వచ్చాడు. మన డబ్బు మనకు ఇచ్చేస్తాడట. నిన్ను ఆఫీసుకు రమ్మన్నాడు''

"నిజమా" విస్మయంగా అడిగాడు రమేష్.

"నిజం"

ఒక్కసారిగా అతడి ముఖంలో కొత్తకాంతి ప్రవేశించింది.

"అయితే వెంటనే ప్రయాణమవుతాను'' అన్నాడు రమేష్.

"ఆలస్యంచేయకు" చెప్పింది జానకమ్మ.

"మామయ్యా! ఇప్పుడు రైలు ఉందికదా"

రమేష్ తన గదిలోకి నడిచాడు.

రఘురామయ్య, సుందరమ్మ- జానకమ్మను కుశలప్రశ్నలు అడగడం మొదలుపెట్టారు.

శ్వేత కాసేపు అత్తవక్కనే కూర్చుని, మెల్లగా అక్కడినుండి జారుకుంది.

రమేష్ సూట్‌కేసులో బట్టలు సర్దుకుంటు న్నాడు.

ఆమె అతడి దగ్గరగా నడిచి అతడి పక్కనే నిలబడింది.

"బావా! నువ్వు అదృష్టవంతుడివి'' అందామె మెల్లగా.

"నిజం... ఐయామ్ ఏ లక్కీఫెలో... పోయిందనుకున్న వ్యాపారం, తిరిగి యథాప్రకారమే ప్రారంభమవుతోంది. అలాగే దొరకదనుకున్న నా ప్రశ్నకు జవాబు, దొరికి, నీలాంటి అందమైన- అనుకూలమైన అమ్మాయితో పెళ్ళి జరగబోతోంది''

"మళ్ళీ ఎప్పుడొస్తావు బావా?" అడిగిందామె.

అతడు బట్టలు సర్దుకోవడం పూర్తయింది. సూట్‌కేస్‌కు లాక్ చేశాడు.

ఆమెవంక తిరిగి ఆమెముఖంలోనికి ఒకింతసేపు చూశాడు. తన కుడిచేతిని ఆమె తలమీదవేసి, ఆమె తలను చిన్నగా కదిలిస్తూ అన్నాడు- "మళ్ళా మనం కలుసుకోబోయేది మన పెళ్ళిలోనే"

"థేంక్స్ బావా"

వాకిలిదగ్గర చప్పుడయింది. వాళ్ళిద్దరూ దూరంగా జరిగారు.

రఘురామయ్య గదిలోనికి వస్తూ అన్నాడు "బట్టలు సర్దుకోవటం పూర్తయిందా"

"అయింది మామయ్యా"

"అయితే త్వరగా బయలుదేరు- వెళ్దాం" సూట్‌కేసు అందుకున్నాడాయన.

"మీరెందుకు మామయ్యా! నేను వెళ్తానుగా"

ఫర్వాలేదు వదరా" ఆయన ముందుకు నడిచాడు.

"పోనీ పాలేరును పంపించండి" నొచ్చుకున్నాడు రమేష్.

"వద్దులేరా"

ఆయన సూట్‌కేస్ చేతపట్టుకుని, గది దాటి వెళ్ళిపోయాడు.. రమేష్ శ్వేత వంక తిరిగాడు "వెళ్ళొస్తాను శ్వేతా"

"ఎదురుచూస్తుంటాను" చెప్పిందామె.

రమేష్ గది దాటి అవతలకు నడిచాడు.

అత్త, అమ్మ ఇద్దరూ బయట అతనికోసం వెయిట్‌చేస్తున్నారు.

అతడు వారి దగ్గరగా నడిచాడు.

"అమ్మా... టౌన్‌కి ఎప్పుడొస్తావు?" తల్లినుద్దేశించి అడిగాడు.

"మరో రెండుమూడు రోజులలో వచ్చేస్తాను" జవాబిచ్చింది ఆమె.

"వెళ్ళొస్తానత్తమ్మా" సుందరమ్మతో చెప్పాడు.

"అలాగే నాయనా" అన్నదామె.

రఘురామయ్య అప్పటికే వాకిలి దగ్గర నిరీక్షిస్తూఉన్నాడు.

రమేష్ ఆయన దగ్గరకు నడిచాడు. ఎంత బలవంతపెట్టినా, సూట్‌కేస్‌ను అతడి చేతికివ్వలేదు ఆయన.

ఇద్దరూ బయలుదేరారు.

వీధిగేటు వరకూ నడిచి వెనుతిరిగి చూశాడతను. కిటికీ దగ్గర నిలబడి అతడివైపే చూస్తోంది శ్వేత.

 చతుర ... 6

పెదాలు విడివడీ విడివడనట్టుగా నవ్వాడ తను కళ్లతోనే 'వెళ్ళొస్తానన్నట్టు'గా చెప్పాడు.

ఆమె చిరునవ్వు నవ్వి తలూపింది.

వీధిలోనికి అడుగుపెట్టాడు రమేష్.

ముందు రఘురామయ్య నడుస్తుండగా ఆయనను అనుసరించాడు రమేష్.

పొలంగట్లు దాటి కాలిబాట ఎక్కారు.

రెండు మైళ్ళ ప్రయాణం పూర్తయింది. ఇద్దరూ రైల్వేస్టేషన్‌లో అడుగు పెట్టారు.

సూట్‌కేస్ కింద పెట్టి, వరుగున వెళ్ళి టిక్కెట్ తీసుకువచ్చాడు రఘురామయ్య.

రైలు వచ్చేందుకు ఇంకా పదినిముషాలు వ్యవధి ఉంది. ఇద్దరూ ప్లాట్‌ఫారం మీదికి నడిచారు.

"ఇంటికి చేరుకొన్న తర్వాత, డబ్బు వివరం కనుక్కొని విశేషాలన్నింటినీ ఉత్తరంలో రాయి"

తలూపాడు రమేష్.

"మీ అమ్మ చాలాకాలానికి వచ్చింది ఈ ఊరు. పదిరోజులు ఉంచుకుని పంపిస్తాను"

తలూపాడు రమేష్.

కొద్దిసేపు ఇద్దరిమధ్యా నిశ్శబ్దం.

ఆపల్లె, ఆ వ్యక్తులు అతడికెంతో నచ్చారు. ముఖ్యంగా శ్వేతసాహచర్యం...

చిరంజీవి గుర్తుకు వచ్చాడతనికి. ప్రయాణం తొందరలో చెప్పి రాలేదు. అందుకే మామయ్యతో అన్నాడు-

"ప్రయాణం తొందరలో చిరంజీవికి చెప్పి రాలేదు మామయ్యా. కనిపించినప్పుడు పరిస్థితి చెప్పు"

"అలాగే" చెప్పాడు రఘురామయ్య తన చూపులు రైలుపట్టాల వంక సారిస్తూ.

దూరంగా రైలువస్తున్న శబ్దం.

"రైలు వస్తోందిరా" అన్నాడు రఘురామయ్య.

తలూపాడు రమేష్. ఆ వ్యక్తులను వదిలి దూరంగా వెళ్ళి పోతున్నాననుకుంటే మనసు మూలలలో బాధగా ఉంది. ఊహతెలిసిన తర్వాత అంతటి తియ్యని అనుభూతిని

అతడికి తెలీవు. ఆ పల్లెకు ఎంతో బాధతో వచ్చాడు. కాని అక్కడ ఆ బాధలన్నీ మరచిపోయాడు. ముఖ్యంగా శ్వేత అందించిన ఆ ఊరడింపు తనను ఎంతో సేదతీర్చింది. ఆమె ఒడిలో పడుకుంటే తనకు కలిగిన ఆ...

రైలు వచ్చి ప్లాట్‌ఫారం మీద ఆగింది.

"ఎక్కురా రమేష్"

రమేష్ కంపార్ట్‌మెంట్‌లోనికి ఎక్కి, ఆయన చేతిలోని సూట్‌కేస్ అందుకున్నాడు. కిటికీ పక్కగా సీట్ చూసుకుని సూట్‌కేస్ ఆ సీట్లో పెట్టి, కిందికి దిగాడు.

"వెళ్ళొస్తాను మామయ్యా" చెప్పాడాయనతో.

"అలాగే" అన్నాడాయన.

రైలు కూతపెట్టింది.

"మామయ్యా... నేను నిన్నొకటి అడగాలనుకుంటున్నాను"

ఆయన ఎదురుగా చేతులు కట్టుకుని నిలబడ్డాడు రమేష్.

"అడగరా"

రమేష్ ఏమడగబోతున్నాడో ఊహించలేకున్నాడాయన.

"'ఇది' ఒకప్పుడు నువ్వు నన్ను అడిగావు. 'అదే' ఇప్పుడు నేను నిన్ను అడగబోతున్నాను"

ఆయనకు అర్థమయింది రమేష్ అడగబోయేదేమిటో.

రమేష్ ఒక నిముషంసేపు మౌనంగా ఉన్నాడు. రైలు ముందుకు కదిలింది.

"మామయ్యా! నాకు... నాకు శ్వేత కావాలి"

"శ్వేత పుట్టింది నీ కోసమే కదరా? ఆ.. రైలు కదులుతోంది- ఎక్కెయ్" ఆయన ముఖంలో సంతోషం- రైలు కదులుతుందన్న ఆత్రుత.

"థాంక్స్ మామయ్యా... త్వరలో మా ఇద్దరికీ పెళ్ళిచేసేందుకు ఏర్పాట్లు చెయ్యి"

"అలాగే"... అని ఆగి రైలు వేగం పుంజుకోవటంచూసి కంగారుగా అన్నాడు... "రైలు కదులుతోంది ఎక్కురా. అంతా నీ ఇష్టప్రకారమే జరుగుతుంది".

"థాంక్యూ. థేంక్స్ మామయ్యా"

పరిగెత్తుకుంటూ వెళ్ళి, ఎగిరి కంపార్ట్




మెంట్ ఎక్కేశాడు. అతడి మనస్సిప్పుడు ఎంతో ఆనందంగా ఉంది.

కనుచూపుమేరవరకూ రఘురామయ్య అత డికి చెయ్యి ఊపుతూనే ఉన్నాడు..

★ ★ ★

"హల్లో మిస్టర్ రమేష్!" కుర్చీలో నుండి పైకి లేచి, చేతిని ముందుకు చాచాడు రవీంద్ర. "హౌ ఆర్ యూ".

"ఫైన్" చెప్పాడు రమేష్.

"టేక్ యువర్ సీట్"

"ఏమిటి విశేషాలు?" అడిగాడు రవీంద్ర.

"ఏమున్నాయి...బిజినెస్ క్లోజ్ చేసేసి, ప్ర శాంతత కోసం ఓ పల్లెటూరు వెళ్ళిపోయాను"

"తెలుసు" అని ఆగి "మా సంస్థ వలన మీరు చాలా నష్టపోయారు."

నవ్వి ఊరకుండిపోయాడు రమేష్.

"అందుకే నా చేతికి డబ్బు వచ్చిన వెంటనే మీ కోసం వచ్చాను... మీరు ఊరెళ్ళి ఉన్నారని మీ అమ్మగారు చెప్పారు."

"ఈ రెండు నెలలలో బిజినెస్‌ని చాలా డెవ లప్ చేసినట్టున్నారు" అడిగాడు రమేష్.

"బిజినెస్‌ని డెవలప్ చేయలేదు. కాకపోతే లాస్ ఎక్కడ వస్తుందో కనిపెట్టి, అక్కడ లాస్ రాకుండా అడ్జస్ట్ చేయగలిగాను. ప్రస్తుతం నా బిజినెస్ నో లాస్-నో ప్రాఫిట్ కింద నడుస్తోంది. మరో రెండు నెలలలో, లాభాలు వచ్చేలా తయారుచేసుకోగలను" చెప్పాడు రవీంద్ర.

"మరి లాభాలు లేకుండా ఈ డబ్బు నాకెలా ఇవ్వగలుగుతున్నారు?" ప్రశ్నించాడు రమేష్.

"ఓ! అదా మీ అనుమానం..." నవ్వాడు రవీంద్ర. సిగరెట్టు పాకెట్ తీసి తనో సిగరెట్ నోట్లో ఉంచుకుని, మరోటి రమేష్‌కు ఆఫర్ చేశాడు.

తల అడ్డంగా ఊపాడు రమేష్.

సిగరెట్ ముట్టించాడు అతడు.

"మా మేనత్త ఒకామె చనిపోతూ తన ఆస్తి అంతా నా పేర రాసిపోయింది. సుమారు పదిలక్షల రూపాయల ఆస్తి... ఆ ఆస్తిని కేష్‌గా మార్చేశాను. బిజినెస్ ఎలాగూ డెవలప్ అవుతుందన్న నమ్మకం ఏర్పడింది కాబట్టి ఆ డబ్బుతో అప్పులు తీర్చేస్తున్నాను"

"ఐసీ...యూ ఆర్ ఏ లక్కీఫెలో"

రవీంద్ర నవ్వి ఊరకుండిపోయాడు.

బాయ్ తెచ్చిన కాఫీ తాగిన తర్వాత, రవీంద్ర చెక్‌బుక్ బైటకు తీశాడు. "ఇది అకౌంట్ పేయీ చెక్కు కాదులే...డైరక్ట్‌గా బేంక్‌కు వెళ్ళి కేష్ తీసుకోవచ్చు" నవ్వుతూ అన్నాడు రవీంద్ర.

జవాబుగా రమేష్ కూడా నవ్వాడు.

"హాఫ్ అమౌంట్ కాదు-పూర్తి మొత్తాన్ని ఇచ్చేస్తున్నాను" చెప్పాడు రవీంద్ర.

చెక్కు రమేష్‌కు అందించాడు అతడు.

రమేష్ చెక్కు అందుకున్న తర్వాత అతడు అన్నాడు - "మిస్టర్ రమేష్!... మా సంస్థ త్వరలోనే లాభాల దిశగా ప్రయాణిస్తుంది! సంస్థ అభివృద్ధికి అడ్వర్‌టైజ్‌మెంట్స్ కొంత సహాయం చేస్తాయి. కాబట్టి ఇక నుండి నేను రెగ్యులర్‌గా యాడ్స్ ఇవ్వదలచుకున్నాను. అంతేకాదు నా మనసులో చాలా ప్రణాళికలు న్నాయి. భవిష్యత్‌లో నేను ఏ బిజినెస్ స్టార్ట్ చేసినా నా కంపెనీ యాడ్స్ అన్నీ మీకే ఇస్తాను"

"థేంక్స్ ఎ లాట్" చెప్పాడు రమేష్.

మరికొద్దిసేపు కూర్చున్న తర్వాత రమేష్ లేచాడు.

"సీ యూ అగైన్"

"వెల్‌కమ్"

రమేష్ బయటకు నడిచాడు.

అతడికిప్పుడు చాలా ఆనందంగా ఉంది. పోయిందనుకున్న తన పెట్టుబడి మొత్తం తిరిగి వచ్చింది. అంతేకాదు చాలా పెద్దమొ త్తంలో లాభం కూడా.

అతడు ఆటో ఎక్కాడు. బేంక్ అడ్రసు చెప్పాడు.

పదినిముషాల తర్వాత ఆటో ఆ బేంక్ ముందు ఆగింది.

ఆటోవాడికి డబ్బులిచ్చి, బేంక్‌లోపలికి నడి చాడతను.

ఓ ఇరవై నిముషాల తర్వాత బేంక్ కే షియర్ పందరూపాయల కట్టలు కొన్ని అతడి ముందుపెట్టాడు. అవి లెక్కేసుకుని బ్రీఫ్

కేసులో సర్దిపెట్టుకున్నాడతను.

బయటకు నడిచి, ఆటోను పిలిచి, ఎక్కి కూర్చున్నాడు. ఆటో డ్రైవర్‌కు అడ్రస్ చెప్పి వెనక్కి వాలాడు నిశ్చింతగా.

ఆటో ముందుకు కదిలింది.

వేగంగా పరిగెడుతున్న ఆటోలో కూర్చుని అతడు అనుకున్నాడు. 'రేపు ఆఫీసు ఓపెన్ చేయాలి. ఈ రోజే స్టాఫ్ అందరికి కబురు పంపాలి...''

ఆటో అతడి ఇంటివైపు వెడుతూ ఉంది.

* * *

చాలాకాలం తర్వాత ఆ సీట్లో కూర్చున్నాడు రమేష్.

ఆ సీటు మీద కూర్చోగలనన్న నమ్మకం మొన్నటిదాకా లేదతనికి. కాని పరిస్థితులు అనుకూలించి, తిరిగి అతని సీటు అతనికి దక్కింది.

అతడి ఎదురుగా స్టాఫ్ అంతా కూర్చుని ఉన్నారు.

ఒక్క ఎగ్జిక్యూటివ్ మాత్రం మరో కంపెనీలో చేరిపోయాడు. మిగిలిన వారందరూ ఆ కంపెనీ పునఃప్రారంభం కోసం వేచి ఉన్నారు. వారందరి ముఖాలలో ఇప్పుడు సంతోషం కనిపిస్తోంది.

రమేష్ వారందరివంకా ఒకసారి చిరునవ్వుతో చూసి, గొంతు సవరించుకున్నాడు.

"డియర్ ఫ్రెండ్స్! ఇది మనకందరికీ శుభదినం. మన కంపెనీని మనం పునఃప్రారంభించాం ... ఇక రేపటినుండి మీరు మీ పనులను యథావిధిగా చేసుకోవచ్చు. నాకు తెలును – ఫీల్డ్ మీద మీకు మునుపటికన్నా కష్టం ఎక్కువగా ఉంటుంది. మీరెంతో శ్రమపడవలసి ఉంటుంది. మనకు వాడుకగా యాడ్స్ ఇచ్చే సంస్థలు, ఆల్ రెడీ మరో యాడ్స్ కంపెనీ చేతిలోకి వెళ్లిపోయి ఉంటాయి. తిరిగి మన ఖాతాలను మనం సంపాదించుకోవాలంటే చాలా కష్టపడాల్సి వుంటుంది. బాగా ప్రయత్నించినప్పటికీ కొన్ని సంస్థలు మనకు తిరిగిరావని కూడా నాకు తెలును. అందుకు మనం నిరుత్సాహపడవలసిన పనిలేదు. కె.యమ్.టి సంస్థ ఛైర్మన్ రవీంద్ర మనకు కస్టమర్ అయ్యారు కాబట్టి అతడికి తెలిసిన వ్యాపారసంస్థల నుండి కూడా మనకు కొన్ని యాడ్స్ రావచ్చు ... సో - మనం పెద్దగా బాధపడవలసిన అవసరంలేదు ...''

వారందరూ అతడి మాటలను శ్రద్ధగా వింటున్నారు.

"... ఇక మీకో శుభవార్త! గత రెండు నెలలుగా మీరు నా కంపెనీనే నమ్ముకుని, మరే ఇతర ఉద్యోగంలోనూ చేరలేదు. మీకెన్నో అవకాశాలు వచ్చి ఉంటాయి. కాని నామీది అభిమానంతో అవన్నీ తిరస్కరించి ఉంటారు ... నాకు పెద్ద మొత్తంలో ఆదాయం వచ్చింది. నన్ను నమ్ముకుని ఉన్న మీకు ఇందులో కొంత మొత్తాన్ని ఇవ్వకపోవడం అన్యాయం ... కాబట్టి గత రెండునెలల జీతం చెల్లించడంతోపాటు అందరికీ చిరుకానుకలు అందిస్తున్నాను ...''

సూట్‌కేస్ పైనపెట్టాడు రమేష్.

అందరూ దానివంక చూశారు.

"అందరికీ తలకొక చేతిగడియారం" చెప్పాడు రమేష్.

కవరులోచుట్టి ఉన్న ప్యాకెట్లను బయటకు తీశాడు. ప్యాకెట్‌పైన రాసిన ఉన్న పేరు చూసి, ఎవరికివ్వాల్సిన ప్యాకెట్ వారికి ఇచ్చాడు.

"అందులోనే మీజీతాలు కూడా ఉన్నాయి'' చెప్పాడు వారితో.

అందరి పెదాలమీద చిరునవ్వులు. కన్నులలో కృతజ్ఞతాభావం.

"ఇక చివరగా – మన కంపెనీకి ఇంత పెద్ద యాడ్ తీసుకువచ్చిన హరితకు మరో అదనపు కానుక...''

చిన్న కేస్ ఒకటి ఆమెముందుంచాడు. "అందులో గోల్డ్ రింగ్ ఉంది. అది నీకోసం'' ఆమెతో అన్నాడతను.

"నాకెందుకు సార్'' మొహమాటపడిందామె.

"నీ సామర్థ్యానికి గుర్తింపుగా అది తీసుకో"

ఆమె కేస్ అందుకుని ఉంగరం బయటకు తీసింది.

నీలం రంగు రాయిఉన్న ఆ రింగ్ వంక సంతోషంగా చూసిందామె.




తిరిగి దాన్ని కేస్‌లో పెట్టి, కేసును తన హేండ్‌బాగ్‌లో ఉంచుకుంది.

రమేష్ టైము చూసుకున్నాడు.

"మీకు కానుకలు అందించే పర్వం ముగిసిపోయింది. ఇక మిగిలింది – ఈరోజు సాయంత్రం మీకు పార్టీ"

"పార్టీనా?" అడిగాడు ఆర్టిస్ట్.

"అవును. ఈరోజు సాయంత్రం మీకందరికీ హోటల్ 'బ్లూ బెల్'లో పార్టీ ఇస్తున్నాను. సాయంత్రం సరిగ్గా ఆరుగంటలకు మన మందరమూ అక్కడ కలుసుకుందాం ... ఈ రోజంతా ఎంజాయ్ చేయండి. రేపటినుండి తిరిగి మన బిజినెస్ స్టార్ట్ అవుతుంది. మీరంతా తిరిగి రెట్టించిన ఉత్సాహంతో పనిచేయాల్సి ఉంటుంది"

"అలాగే సర్" అన్నారు వారంతా.

కొద్దిసేపు ఆలోచించుకున్న తర్వాత "దెన్ ... మీరంతా సాయంత్రం 'బ్లూ బెల్'లో నన్ను కలుస్తున్నారు" అన్నాడతను.

అతడు చెప్పదలచుకున్నది పూర్తయిందని వారికి అర్థమయింది.

"యస్సార్" అన్నారు వారు. కుర్చీలలో నుండి పైకి లేచి నమస్కరించి, అవతలకు వెళ్లిపోయారు.

★ ★ ★

ఆ మర్నాడే వారి బిజినెస్ స్టార్టయింది.

ఫీల్డ్ చాలా ప్రోత్సాహకరంగా, ఉత్సాహంగా అనిపించింది రమేష్‌కు.

వారంరోజుల్లో జానకమ్మకూడా ఊరి నుండి వచ్చింది.

ఆమెకు తోడుగా వచ్చాడు రఘురామయ్య.

రమేష్ ఆఫీసుకు వెళుతూ ఆయనతో అన్నాడు - "మామయ్యా! రెండు రోజులు ఉండండి"

"ఎందుకురా వెళ్తాను" అన్నాడాయన.

"పొలంపనులన్నీ అయిపోయాయికదా! రెండురోజులు ప్రశాంతంగా గడపండి"

"అలాగే లేరా" ఒప్పుకున్నాడాయన.

"నేను ఆఫీసుకు వెళ్తున్నాను"

తలూపాడాయన.

కొత్త స్కూటర్ మీద ఆఫీసుకు బయలుదేరాడు రమేష్.

డబ్బుతోపాటే అతడి సమస్యలన్నీ తీరిపోయాయి. అప్పులు కట్టేశాడు. అమ్మిన స్కూటర్ బదులు కొత్త స్కూటర్ కొనుక్కున్నాడు! ఆఫీసు పునఃప్రారంభించాడు.

అన్నివిధాలా ఆనందంగా ఉందతడికి. అయితే ఇక చేయవలసింది ఒకటే ఉంది అదెప్పుడవుతుందో, అయినా అది తను చేయాల్సిన పని కాదు, పెద్దలు చేయాల్సింది, మరి వారు తొందరపడుతారో, ఆలస్యం చేస్తారో, అనుకున్నాడు రమేష్.

రఘురామయ్య మాత్రం ఆలస్యం చేయలేదు.

ఆ రాత్రే ఆ విషయం గురించి రమేష్‌ను అడిగాడు—

రమేష్ అప్పుడే భోంచేసి వచ్చి సోఫాలో కూర్చున్నాడు. కాస్త వెనుకగా పూర్తిచేసిన రఘురామయ్య, పెదాలు తుడుచుకుంటూ అతడి దగ్గరగా వచ్చాడు.

అతడికి ఎదురుగా ఉన్న కుర్చీలో కుర్చున్నాడు. ఆయన రమేష్‌ను చూసి చిరునవ్వు నవ్వాడు.

ఆయన తననేదో అడగబోతున్నట్లుగా అర్థమయింది రమేష్‌కు. అందుకే ఆయన చెప్పబోయేదానికోసం ఎదురుచూడసాగాడు అతడు.

కొద్దిసేపటి తర్వాత ఆయన "రమేష్" అన్నాడు.

రమేష్ ఆయన వంక చూసాడు

"ఆరోజు నువ్వు రైల్వేస్టేషన్‌లో అడిగినదాన్ని గురించి..."

"చెప్పుమామయ్యా" అన్నాడు రమేష్.

"ఆ పెళ్ళేదో తొందరగా జరిగిపోతే మంచిదని నా ఆలోచన" మెల్లగా అన్నాడాయన.

"ఆలస్యమంటూ జరిగితే అది మీ వైపు నుండే తప్ప నా వైపు నుండి వుండదు - నేనెప్పుడూ సిద్ధమే"

"అయితే ఇరవైరోజులలో ముహూర్తం ఉందని పంతులుగారు చెప్పారు" అన్నాడా

యన.

"ఆ ముహూర్తమే సెటిల్ చేయండి"

ఆయన తలూపాడు - "ఈ విషయం మీ అమ్మతో కూడా మాట్లాడుదాం" అని, వంటగది వైపు తిరిగి "జానకీ" అంటూ పిలిచాడు.

"వస్తున్నా" అని చెప్పి, ఓ నిముషం తర్వాత వారి ముందు నిలచింది ఆమె.

విషయాన్ని ఆమెకు వివరించాడు రఘురామయ్య.

అంతా విన్న తర్వాత ఆమె ఆ భారమంతా రఘురామయ్య మీదే వేసింది. "అన్నయ్యా! ఇరుపక్కలా పెళ్ళి పెద్దవు నువ్వే. ఈపెళ్ళి లోని బరువుబాధ్యతలు మోయాల్సినవాడివి





నువ్వే కాబట్టి నీకెలా ఇష్టమైతే అలాగే చెయ్యి'' అన్నదామె.

జవాబుగా ఆయన తలూపాడు.

''అయితే నేనువెళ్ళి మీ వదినను కూడా ఓమాట అడిగి, ఏ వివరం రాస్తాను''సాలోచనగా అన్నాడాయన.

''అలాగే '' అన్నారు వారిద్దరూ.

రెండురోజులపాటు టౌన్‌లోనే ఉంటానన్న ఆయన ఆ మర్నాడే పల్లెకు వెళ్ళిపోయాడు.

ఒక్కసారిగా పెళ్లిఏర్పాట్లు మొదలయ్యాయి.

పల్లెకు వెళ్లిన ఆయన నుండి రెండోరోజుకు ఉత్తరం వచ్చింది.

చెప్పిన ముహూర్తానికే పెళ్ళి కుదుర్చుకు నేందుకు, ఫలానా తారీఖున నిశ్చయతాంబూలాలు పుచ్చుకునేందుకు వస్తున్నట్లు.

పెళ్లికి వ్యవధి ఇక కేవలం పదిహేడురోజులు మాత్రమే ఉంది.

ముహూర్తం నిశ్చయమైన వెంటనే అతడు మొదట అశోక్‌ను కలిశాడు.

"హలో రమేష్... హౌఆర్‌యూ" ఆప్యాయంగా పలకరించాడు అశోక్.

"ఫైన్" చెప్పాడు రమేష్.

స్కూటర్‌కు స్టాండ్ వేసి, అతడితోపాటు ఆ ఇంటి లోపలికి నడిచాడు రమేష్

"రండన్నయ్యా" అన్నది లక్ష్మి.

వారిద్దరూ సోఫాలో కూర్చున్నారు.

"బిజినెస్ ఎలా ఉంది?"

"ఇప్పుడిప్పుడే పుంజుకుంటోంది?"

లక్ష్మి వంటగదిలోకెళ్ళింది.

"ఏమిటి విశేషాలు?" అడిగాడు అశోక్.

"ఓ విశేషం చెప్పాలనే వచ్చాను"

"ఏమిటి?" ప్రశ్నించాడు అశోక్.

"నాకు పెళ్ళి నిశ్చయమైంది"

ముందుకు తూలబోయి నిలదొక్కుకున్నాడు అశోక్.

"ఏమిటి... నీకు... నీకు పెళ్ళా?" ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

"ఏం! నేను పెళ్ళి చేసుకోకూడదా?" నవ్వుతూ అడిగాడు రమేష్.

"చేసుకోకూడదని కాదు... 'మగాడు ఎందుకు పెళ్ళి చేసుకోవాలి' అని నువ్వు ఒక ప్రశ్న వేసుకుని, దానికి జవాబు దొరికేంతవరకూ పెళ్ళి చేసుకోనని అన్నావు కదా! అందుకని..."

"నా ప్రశ్న సరయినదే"

"కావచ్చు. కాని దానికి జవాబు దొరకడం మాత్రం చాలా కష్టం... ఆ జవాబు దొరికేవరకూ పెళ్ళి చేసుకోకూడదని నువ్వు అనుకుని ఉంటే, నీకీ జన్మకు పెళ్ళయి ఉండేది కాదు" సిగరెట్ వెలిగించాడు అశోక్.

"కాని నా ప్రశ్నకు జవాబు దొరికాకనే నేను ఈ పెళ్ళికి ఒప్పుకున్నాను"

"అంటే!" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు అశోక్.

"'మగాడు ఎందుకు పెళ్ళి చేసుకోవాలి?' అన్న నా ప్రశ్నకు జవాబు దొరికింది"

"ఈజిట్... ఆ జవాబు ఏమిటి?" ఆతృతగా అడిగాడు అశోక్.

గుంభనంగా నవ్వాడు రమేష్. "అది మొదట నీకు చెప్పను. ముందు నా కాబోయే భార్యకు తొలిరాత్రి కానుకగా వివరిస్తాను"

"కాబోయే భార్యా... ఎవరామె?" అప్పుడే గుర్తుకువచ్చి అడిగాడు అశోక్.

"శ్వేత"

"రియల్లీ. థేంక్‌గాడ్.... చివరికి శ్వేతనే పెళ్ళి చేసుకోబోతున్నావన్నమాట. అయితే అన్నివిధాలా అదృష్టవంతుడివి అయ్యావు... అడ్వాన్స్ కంగ్రాచ్యులేషన్స్"

"థాంక్స్"

"అయితే మాకు త్వరలో విందు భోజనం ఉందన్నమాట" లొట్టలు వేస్తూ అన్నాడు అశోక్.

"విందు భోజనం సంగతి తర్వాత-ముందు నావైపున అన్నిపనులూ చేయాల్సిన వాడివి నువ్వే. రేపటినుండి నీకు చేతినిండా పని"

"నేనెప్పుడూ సిద్ధమే. నీ పెళ్ళికి కాకపోతే మరెవరి పెళ్ళికి సహాయం చేస్తాను. తప్పకుండా చేస్తాను"

"థేంక్స్ ఎగైన్"

లక్ష్మి వారిద్దరికీ టీ అందించి, తిరిగి వారి ఎదురుగా కూర్చుంది.

ఆమెకూ రమేష్ పెళ్ళి విషయం చెప్పాడు అశోక్. ఆమె కూడా సంతోషం వ్యక్తం చేసింది.

కొద్దిసేపటివరకూ పెళ్ళి విషయాలు మాట్లాడుకుంటూ ఉండిపోయారు వారు ముగ్గురూ.

కాసేపటి తర్వాత లక్ష్మి వంటగదిలోకెళ్ళిపోయింది.

"అంతా బాగుంది. కాని, నువ్వు కనుక్కున్న ఆ జవాబు చెప్పకపోవడమే సరిగాలేదు"

"నా అన్వేషణ ఫలితం మొదట అందుకు సహకరించిన శ్వేతకే చెప్పాలన్నది నా కోరిక"





"ఆల్‌రైట్. కాని ఆమెకు చెప్పిన వెంటనే నాకు చెప్పాలి"

"అలాగే"

రమేష్ లేచాడు.

"ఓ... కే నేను రేపు కలుస్తాను. చేయాల్సిన పనులగురించి చెపుతాను"

తలూపాడు అశోక్.

రమేష్ బయటకు నడిచాడు. అతడి వెంట గేటువరకూ నడిచాడు అశోక్.

స్కూటర్ స్టార్ట్‌చేసి ముందుకు పోనిచ్చాడు రమేష్.

★ ★ ★

రంగు రంగుల లైట్లతో ఆ కళ్యాణ మండపం కళకళలాడుతూఉంది. రకరకాలుగా అలంకరించుకుని వచ్చినవారితో అందంగా కనుపిస్తోంది.

మండపం లోపల నుంచి వేదమంత్రోచ్చారణ బిగ్గరగా వినిపిస్తోంది. మరోవైపు మంగళ వాద్యాలు మోత లయబద్ధంగా మోగుతున్నాయి.

బంధుమిత్రులు ఒక్కొక్కరే వస్తున్నారు. అశోక్, చిరంజీవి వారిని రిసీవ్ చేసుకుని కుర్చీలలో కూర్చోబెడుతున్నారు.

పెళ్లిపీటమీద కూర్చొనే కొందరిని పలకరిస్తున్నాడు రమేష్.

అతడికి చాలా ఆనందంగా ఉంది. 'తనను ప్రేమించిన అమ్మాయిని – తను కోరుకున్న అమ్మాయిని తాను పెళ్లిచేసుకోబోతున్నాడు'. ఈ పెళ్లిద్వారా తను సంతోషపడటమే కాదు – అటు తన తల్లిని, ఇటు మామయ్యను, అత్తయ్యను ఆనందపరుస్తున్నాడు.

అందరినీ సంతోషపెట్టే పెళ్లి ఇది!

ముఖ్యంగా వధూవరులిద్దరూ, ఏదో ఇక తప్పదన్నట్టుగా జీవితంలో అడ్జస్ట్ కాబోవడంలేదు.

నిజంగా పెళ్లికి కావలసింది ఇదే! ఒకరినొకరు మనస్ఫూర్తిగా కోరుకోవడం. తను చాలా పెళ్లిళ్లలో చూశాడు. ఊహల్లో రాజకుమారుణ్ని కోరుకుని, వాస్తవంలో ఓ సగటు మనిషిని చేసుకునే స్త్రీ కన్నులలో పెళ్లి సమయంలో కనిపించేది – నిస్తేజం. ఆ తర్వాత కొద్దిమంది అడ్జస్ట్ అవుతారు. మరికొంతమంది ఊహను, వాస్తవానికి అన్వయించుకోలేక తాము బాధపడుతూ, జీవిత భాగస్వామిని ఇబ్బందిపెడుతుంటారు.

అలాగే మగవారు – ఓ అమ్మాయిని కోరుకుని, విధిలేని పరిస్థితులలో మరో ఆడదాని మెడలో తాళికడతారు. పెళ్లిసమయంలో అటువంటి మగాడి ముఖంలో కనిపించేది – నిరుత్సాహం.

మరోపక్క – కట్నకానుకలు చాలలేదని ఒకవర్గంవారు ఏడుస్తుంటే, కట్నకానుకలు ఇచ్చి అప్పులపాలయ్యామని మరో వర్గంవారు దుఃఖిస్తుంటారు.

స్వచ్ఛమైన వాతావరణంలో అందరూ సంతోషంగా కలసి జరుపుకునే పెళ్లిళ్లు ఒక్కొక్కటైనా ఉంటాయా అన్నది తన అనుమానం.

ఒక స్త్రీ, ఒక పురుషుడు జీవితంలో కలసి నడవబోయే సమయంలో కావలసింది ఆడంబరమైన అలంకరణ, వందల కొద్దీ బంధుమిత్రులు కాదు:

స్వచ్ఛమైన మనసులు. ఆ వధూవరులిద్దరికీ ఒకరిమీద మరొకరికి ప్రేమ.

ఏదో తప్పదన్నట్టు చేసుకుంటున్న ఈనాటి పెళ్లిళ్లలో అలాంటి అభిమాన ఛాయలు కంటికి కూడా కనిపించవు.

అసలు నిన్నటివరకూ ముక్కూ మొహం తెలియకుండాఉన్న ఇద్దరు స్త్రీ పురుషులు తాళి కట్టడం అనే చర్య ద్వారా చేసుకునేది అడ్జస్ట్‌మెంట్ అవుతుందే తప్ప – మనస్సుల కలయిక ఎలా అవుతుంది. సో! పెళ్లి అన్నది అడ్జస్ట్‌మెంటే తప్ప, మనస్సుల కలయిక మాత్రం కాదు.

ఈనాటి పెళ్లిళ్లలో 'మనసు' అన్నదానికి అసలు ప్రాధాన్యతే లేదు అన్నది స్పష్టం.

ఏమిటో ఈనాటి పెళ్లిళ్లు. ఈ అడ్జస్ట్‌మెంట్ పెళ్లిళ్ళ వలన ఆ పెళ్లి లక్ష్యమే దెబ్బతింటుంది. అసలు మగాడికి పెళ్లిఎందుకు అవసరం? –ఎందుకు అవసరంపడి, పెళ్లిచేసుకుంటున్నారో ఈ మగాళ్ళకు సరయిన అవగాహన లేదు. పోనీ ఈ ఆడాళ్లకయినా పెళ్లిమీద సరయిన అవగాహనఉందా? మగాళ్ళకు ఎప్పుడు ఏది అవసరమో, అది అందించే

తెలివి ఈ ఆడాళ్లలో ఒక్కశాతానికైనా ఉంటుందని తను అనుకోవడంలేదు.

ఏదోజీవితంలో తప్పనిసరిగా ఒకసారి జర గాల్సిన కార్యంఅది. కాబట్టి ఏదో అడ్జస్ట్ అయి పెళ్లిచేసుకుంటున్నారు వీరు. అంతేతప్ప ఎదుటివారి మనసును గురించి ఆలోచించే ఓపిక, తీరిక ఈ భార్యాభర్తలలో ఎవరికీఉండ దు.

అందుకే ఆ తర్వాత జీవితంలో వారిద్దరూ ఒకరినొకరు మాటలతో హింసించుకుంటూ, చేతలలో బాధించుకుంటారు. ఆ తర్వాత కొద్ది సేపటికి 'అడ్జస్ట్' అయిపోతుంటారు.

అడ్జస్ట్... అడ్జస్ట్... అడ్జస్ట్... మనిషి జీవి తంలో అడ్జస్ట్ అవడం పెళ్లితోనే ప్రారంభమవు తుంది కాబోలు.

ఈ అడ్జస్ట్‌మెంట్ పెళ్లిళ్లవలన అసలు 'పెళ్లి' లక్ష్యమే దెబ్బతిన్నది.

మగాడు అనాలోచితంగా పెళ్లిచేసుకున్నా ఆతర్వాత అతడు తన భార్యనుండి మాన సికంగా కొన్ని కోరుకుంటాడు.

అయితే పెళ్లి సమయంలోనే 'మనస్సు'ను ప్రాధాన్యత లేనిదిగా చేయడం వలన, ఆమె ఎదుటివారి మనసు కూడా అర్థం చేసుకోలేని స్థితికి వచ్చేస్తుంది. అక్కడ నుండే మగాడికి కష్టాలు ప్రారంభమవుతాయి. అక్కడనుండే వారి కుటుంబంలో విసుగులు, ఛీత్కారాలు మొదలవుతాయి. ఆ తర్వాత మగాళ్ళు మన శ్శాంతి కోసం వీధినపడతారు. వ్యసనాలను అలవరుచుకుని వాటిద్వారా తాత్కాలిక ఉపశ మనం పొందుతూఉంటారు.

రెండు జీవితాలు కలకాలం సుఖంగా ఉండాలంటే మనసులు కలవాలి. ఈనాడు పెళ్లయిన తర్వాత దంపతుల మధ్య ఏర్పడేది భార్యాభర్తల సంబంధమే కాని వారి మధ్య మనసుల దగ్గరితనంలేదు. మనసుల దగ్గరి తనం ఉన్నప్పుడు ఒకరినొకరు అర్థం చేసు కుంటారు. ఒకరి బాధలు మరొకరికి సరియైన పద్ధతిలో చెప్పుకుంటారు. తమను తాము ఊర డించుకుంటారు.

భర్త మనసును సరిగా అర్థం చేసుకోగలిగి తేనే భార్య అతడిని ఉత్తేజితుణ్ణి చేయగలిగి ఉంటుంది. తన మాటలతో అతడిని కార్యోన్ము ఖుణ్ణి చేస్తుంది. తనవాడు ఎప్పుడు, ఎటు వంటి మాటలను ఎలా రియాక్ట్ అవుతాడు అన్నది భార్యకు తెలిసివుండాలి. అందుకు ఆమెకు తన భర్త మనస్తత్వం తెలిసి ఉండాలి.

ఆ 'మనస్తత్వం' అర్థం చేసుకోగలిగిననాడే స్త్రీ 'ప్రతి మగాడు విజయం వెనుకా ఒక స్త్రీ ఉంటుంది' అన్న సామెతను నిజం చేయగల దు.

బట్ బేడ్‌లక్... ఈనాడు స్త్రీలు మగవాడిని ఉత్తేజితుణ్ణి చేయడంకాదు గదా... వారిని మాటలతో నిరుత్సాహపరుస్తున్నారు. మన శ్శాంతి లేకుండా నీరసపరుస్తున్నారు.

నేడు విడాకులకు, అక్రమసంబంధాలకు కారణం - భార్యాభర్తల మధ్య సరియైన మాన సిక సాహచర్యం లేకపోవడమేనని తన అభి ప్రాయం.

కాబట్టి పెళ్ళి అన్నది 'మనసుల కలయిక' కావాలి కాని 'మనుషుల కలయిక' కారాదు.

అర్ధగంట పెళ్లి చూపులు, మరో గంట తాళికట్టే తంతు.... ఏమిటిదంతా?...ట్రాష్

ఈ విషయంలో పెద్దలు కుదిర్చిన పెళ్లిళ్ళకన్నా ప్రేమ వివాహాలు సమర్థించతగ్గవి...

పురోహితుడు తనను పిలవడంతో ఆలోచన లు ఆపి అతడి వంక చూశాడు రమేష్.

అతడు పసుపుతాడు రెండుచేతులలో పట్టు కున్నాడు.

తలతిప్పి ఓరగా ఆమె వంక చూశాడు. అదేక్షణం ఆమె కూడా అతని వంక చూసింది.

ఆమె కన్నులలో ఎంతో సంతోషం. కోరుకు న్నవాడిని పొందగలిగామన్న తృప్తి.

అలాంటి వెలుగు కోసమే తను ఎంతో మంది వధువులు కళ్లలోనికి చూశాడు. ఎన్నోసా ర్లు నిరాశపడ్డాడు.

రమేష్ పైకి లేచాడు.

పురోహితుని నోట వేదమంత్రాలు పలుకు తున్నాయి.

"మాంగల్యం తంతునానేనా మమజీవన హేతునా..."

మంగళవాద్యాలు తీవ్రస్థాయిలో మోగసా గాయి.





నిర్మలమైన మనసుతో అతడు ఆమె మెడతో తాళికట్టాడు.

ఆ క్షణం ఆ రెండు జీవితాలు మనసా, వాచా, కర్మేణా ఏకమయ్యాయి.

★ ★ ★

అగరవత్తుల పరిమళం ఆ గదంతా అలముకుని ఉంది. అప్పుడప్పుడూ మల్లెపూల గుభాళింపు వస్తోంది.

ట్యూబ్‌లైట్ కాంతి వెలుగుతో ఆ గది అలంకరణ అద్భుతంగా కనిపిస్తోంది.

మంచం మీద పరుపువేసి ఉంది. పరుపు మీద తెల్లని దుప్పటి పరిచి ఉంది. మంచానికి చుట్టూ మల్లెలు వేలాడుతున్నాయి. పరుపు మీద కూడా మల్లెలు జల్లబడి ఉన్నాయి.

బెడ్ పక్కనే ఉన్న టీపాయ్ మీద ప్లేట్స్‌లో స్వీట్లు, పళ్ళు ఉన్నాయి. వాటర్‌జగ్‌లో నీళ్ళు!

ఆ గదంతా ఓ కొత్త రకమైన అందంతో నిండి ఉంది.

పదకొండున్నర అయింది సమయం.

బెడ్ మీద కూర్చుని ఆమె కోసం ఎదురు చూస్తున్నాడు రమేష్. చేతిలో పుస్తకం ఉన్నా అతడి చూపులన్నీ తలుపువైపే ఉన్నాయి.

సరిగ్గా అప్పుడే వాకిలి దగ్గర చప్పుడయింది. అతడు అవంక చూశాడు.

ముత్తయిదువులు కొందరు శ్వేతను గదిలోపలికి నెట్టి, బయట గడియవేశారు.

చేతిలో పాలగ్లాసు పట్టుకుని వాకిలి దగ్గరే నిలబడివుంది శ్వేత.

తెల్లని చీర కట్టుకుని జడలో మల్లెలు తురుముకుని అద్భుత సౌందర్యంతో మెరిసిపోతోంది ఆమె.

మొన్నటికి మొన్న తనతో ఎంతో చనువుగా మాట్లాడిన శ్వేత, ఆ క్షణం సహజసిద్ధమైన సిగ్గుతో తలదించుకుని ఉంది.

రమేష్‌పైకి లేచాడు. మెల్లగా ఆమె దగ్గరకు నడిచాడు.

తలుపు గడియవేశాడు.

ఆమె భుజం చుట్టూ చేతిని వేశాడు.

శ్వేత శరీరం సన్నగా కంపించింది.

ఆమెను మంచం దగ్గరగా నడిపించాడు రమేష్.

భుజాలమీద చేతులు వేసి మంచంమీద కూర్చోబెట్టాడు. ఆమె చేతిలోని పాలగ్లాసు అందుకుని టీపాయ్‌మీద ఉంచాడు.

ఆమె తల దించుకునే ఉంది.

రమేష్ ఆమె పక్కనే కూర్చున్నాడు. కుడిచేత్తో ఆమె బుగ్గలను పట్టుకుని, ఆమె ముఖాన్ని తనవైపు తిప్పుకున్నాడు.

"సిగ్గా?" అడిగాడతను.

వాలిఉన్న కనులను బలవంతంగా పైకెత్తి అతడివంక చూసిందామె. అదీ క్షణం మాత్రమే. మరుక్షణం సిగ్గుతో బరువైన ఆమె కన్నులు కిందకు వాలిపోయాయి.

అతడు ఆమె చుట్టూ చేతినిపోనిచ్చి ఆమె ముఖంమీదికి వంగాడు.

ఏదో జరగబోతోందని, ఆ అనుభూతిని మనసులోనే గాఢంగా దాచుకోవాలన్న ఉద్దేశంతో కాబోలు, ఆమె కన్నులు మూసుకుంది.

రమేష్ మరికొద్దిగా ముందుకు జరిగాడు. తన పెదవులతో ఆమె పెదవులను తాకించబోయాడు.

సరిగ్గా అదేక్షణం-

"ట్రింగ్... ట్రింగ్"...ఫోన్ మోగింది. రసభంగమయింది. దానివంక చిరాకుగా చూశాడు రమేష్.

"ట్రింగ్...ట్రింగ్...ట్రింగ్..." ఆగకుండా మోగుతూనే ఉందా ఫోన్.

"వెళ్ళి తీయండి" చెప్పింది శ్వేత.

"ఛట్" కోపంగా అని, విసుగ్గా ఫోన్‌దగ్గరకు నడిచాడు రమేష్.

రిసీవర్ చేతిలోనికి తీసుకుని "హలో" అన్నాడు విసుగ్గా.

"హలో రమేష్" అన్నాడు అవతలవైపు నుండి అశోక్.

ఆసమయంలో అశోక్ ఎందుకు ఫోన్‌చేశాడో అతడికి అర్థంకాలేదు.

"హలో అశోక్! ఏమిటి విశేషం?" అడిగాడు రమేష్.

"విశేషమంటే... ఆరోజు నువ్వుచెప్పావుకదా! మగాడికి పెళ్ళి ఎందుకు అవసరం?- అన్నప్ర



శ్నకు జవాబు, శ్వేతకు చెప్పినవెంటనే నాకు చెబుతానని... మరి శ్వేతకు చెప్పేశావా?"

అవతలివ్యక్తి ఎదుట ఉండిఉంటే ఏంచేసి ఉండేవాడో ఏమో... ఎదుటలేడు కాబట్టి సరిపోయింది.

"మిస్టర్ అశోక్! నేనింకా ఆవిషయం చెప్పలేదు" వీలయినంతవరకూ చిరాకుని కప్పిపెట్టాడు.

"ఇంకా చెప్పలేదా?" అనుమానం వ్యక్తంచేశాడు అవతలివ్యక్తి.

"లేదు"

"మరింతసేపు ఏంచేస్తున్నావు?"

"శృంగారంలో మొదటిమెట్టు దగ్గర ఉండగా రసభంగం చేశావు" సీరియస్‌గా అన్నాడతను.

"అలాగా... వీలయినంత త్వరగా చెప్పెయ్యిగురూ! నాకు చాలా ఎగ్జయిటింగ్‌గా ఉంది"

మెల్లగా పళ్ళుకొరుక్కుంటూ ఉండిపోయాడు రమేష్ జవాబు ఇవ్వలేదు.

అవతలి వ్యక్తి కూడా జవాబుకోసం ఎదురుచూడనట్లుగా ఉన్నాడు "సరేగురూ! మరో అర్ధగంట ఆగి ఫోన్‌చేస్తాను."

అవతల ఫోన్‌పెట్టేసిన చప్పుడయింది.

రిసీవర్‌ను విసురుగా పడేశాడు రమేష్.

"ఎవరూ?" అడిగింది శ్వేత.

"ఓ ఫ్రెండ్" జవాబిచ్చాడతను మంచం దగ్గరగా నడుస్తూ.

"ఏమిటంట?" అడిగిందామె.

అతడు ఆమెపక్కన కూర్చున్నాడు.

'మగాడికి పెళ్ళి ఎందుకు అవసరం?' అన్న ప్రశ్నకు నేను కనుక్కున్న జవాబు నీకు చెప్పిన తర్వాత అతడికి చెపుతానని చెప్పాను. ఆ జవాబు త్వరగా చెప్పమని తొందరపెడుతున్నాడు"

అప్పుడే గుర్తొచ్చినట్టుగా ఆమె అంది "ఇంతకీ నీ అన్వేషణ ఫలితాన్ని చెప్పలేదు"

ఆమె ఒడిలో తలవాల్చి పాతస్మృతులను జ్ఞప్తికి తెచ్చుకోసాగాడు. తను పడిన వేదనలు, రోదనలు, తన అనుభవాలు, అనుభూతులు అన్నీ సమీక్షించుకోసాగాడు.

అతడు తన తలను ఆమె ఒడిలో ఉంచిన తర్వాత కొద్దిసేపు వివశత్వానికి లోనయిందామె. ఆతర్వాత - అతడి తలమీద కుడిచేతిని ఉంచి నిమురసాగింది శ్వేత. మరో చేయి అతని ఛాతీమీద ఉంచింది.

తాదాత్మ్యంతో కన్నులు మూసుకున్నాడతను.

అవే... అవే... అవే హస్తాలు... బాధలలో ఉన్న మగాడిని సేదతీర్చే అమృతహస్తాలు.

అదే... అదే మగాడు కోరుకునేది. ఆ లాలింపే!

మగాడికి భార్య కావలసింది అందుకే!!

మగాడికి పెళ్ళి కావలసింది - ఆ ఊరడింపుకోసమే.

మగాడికి పెళ్ళి ఎందుకు అవసరమో తెలిసేది అక్షణాన్నే.

నీలిరంగు బెడ్‌లైట్ కాంతి అతడి ముఖంమీదపడుతోంది. శ్వేత అతడి ముఖంలోకి చూసింది. ఆటలలో అలసిసొలసిన పసిపాపాయి, తల్లి ఒడిలో తలవాల్చడం గుర్తుకువచ్చిందామెకు.

అతడు ఆమె కన్నులలోనికి చూశాడు.

అతడి గొంతు మంద్రస్థాయిలో పలకసాగింది.

"శ్వేతా! నేను కోడూరువల్లెకు ఎటువంటి పరిస్థితిలో వచ్చానో నీకు పూర్తిగా తెలియదు. చుట్టుముట్టిన వేదనలు, తట్టుకోలేని సమస్యలు, మానసిక క్షోభ. పిచ్చిపడుతున్న సమయం, దిక్కుతోచని స్థితి - ఏంచేయాలి నేను?

ఆ క్షణం నాకు మనశ్శాంతి కావాలనిపించింది. ఎవరైనా నన్ను ఊరడిస్తే బాగుండుననిపించింది. కాని నన్ను ఓదార్చగలవారు ఎవరు?

అమ్మ!

అమ్మకు, నాకూ మధ్య జనరేషన్‌గేప్ ఉంది. నేటి పరిస్థితిని అర్థం చేసుకోలేక తప్పు నాదిగా భావించిందామె. అభిమానంతో నిందించడం మొదలుపెట్టింది.

ఆ క్షణంలో ఏ తల్లీ అలా ప్రవర్తించకూడదు.




కాని ఈనాడు ప్రతితల్లీ అలాగే ప్రవర్తిస్తోంది.

ప్రతి తల్లికీ బిడ్డ మీద మమకారం ఉంటుందేకాని, వారి మనసులు అర్థం చేసుకోగలిగిన మానసిక పరిపక్వత ఉండదు. అది యువకులు చేసుకున్న పాపం! నాకు మనశ్శాంతి కరువైంది.

మరికొద్దిరోజులు టౌన్‌లోనే ఉంటే నేనేమయి ఉండేవాడినో ఏమో! బహుశా మనశ్శాంతి కోసం ఏ ఆశ్రమంలోనో చేరి ఉండేవాడిని! అలాంటి పరిస్థితులలోనే నేను పల్లెకు వచ్చాను.

పల్లెకు వచ్చిన తర్వాత మీ ప్రేమాభిమానాలతో-కొత్త వాతావరణంలో ఉత్సాహంగా ఉన్నానే కాని, మానసికంగా ఆనందంగా లేను నేను. అప్పుడప్పుడూ ఆందోళన-ఎప్పుడూ ఆలోచన. నా ఆందోళనకు అంతం లేదు- నా ఆలోచనలకు పరిష్కారంలేదు. గమ్యం తెలియని పయనమైంది నా బతుకు!

నాకు దగ్గరయినవారెవరికైనా నా బాధలు చెప్పుకుని సేదతీరాలని ఉంది. మరొకరికి చెప్పుకుంటే మనసులోని బాధ కొంతవరకయినా తగ్గుతుందట. కాని నా బాధ ఎవరు వింటారు? నా సమస్యలు ఎవరు అర్థం చేసుకుంటారు?

పరాయివారెవరికైయినా చెప్పుకుంటే పరువుపోతుంది. మరెలా?

అప్పుడు నాకనిపించింది నాకో తోడుంటే బాగుండునని. ఆ తోడు నావారుగా ఉండాలి. నా ప్రతి సమస్యా తన సమస్యగా భావించుకోగలిగి ఉండాలి. అలాంటి తోడు ఎవరున్నారు?

ఒంటరితనానికి మించిన శాపంలేదని తెలిసింది అప్పుడే! అయితే అదృష్టవశాత్తు- నీ సన్నిధి దొరికింది నాకు. నీ సమక్షంలో కొంత ఊరడింపు దొరికింది. కాని... నేను కోరుకున్నది పూర్తిగా దొరకలేదు నాకు. ఆ బాధలలో నాకు మరేదో కావాలనిపిస్తుంది... బట్ - నాకు కావలసిందేమిటో మాత్రం నాకు స్పష్టంగా తెలియలేదు..." అతడు ఒక్క నిముషం ఆగాడు.

నిశ్శబ్దంగా వింటున్న ఆమె ప్రశ్నార్థకంగా చూసిందతడి వైపు. అతడు తిరిగి చెప్పడం మొదలుపెట్టాడు:

"...ఆరోజు తోటలో నేను ఇలాగే నీ ఒడిలో పడుకున్నాను. నా సమస్యలు నీకు చెప్పుకోవడం మొదలుపెట్టాను. ...సరిగ్గా అప్పుడే నేను అంతకుముందు ఏదయితే కోరుకుంటున్నానో అది నాకు దొరికింది. అదేమిటో కూడా తెలిసింది.

అసలు మగాడు ఎందుకు పెళ్ళి చేసుకోవాలో తెలిసింది శ్వేతా! నీకు తెలుసా మగాడు ఎందుకు పెళ్ళి చేసుకోవాలో?"

"ఎందుకు?" అడిగిందామె క్యూరియాసిటీగా.

అతడు చెప్పబోయేది అతడి అనుభవమనీ, చాలాకాలం అన్వేషణ తర్వాత కనుక్కున్న నిజమని ఆమెకు తెలుసు.

రమేష్ కొద్దిసేపు మౌనంగా ఉన్నాడు.

"చెప్పు బావా! మగాడు ఎందుకు పెళ్ళిచేసుకోవాలి?"

ఆ గదిలో గాలిమెల్లగా సాగసాగింది. కిటికీ అవతల ఓ నైట్‌క్వీన్ మొక్క గాలికి మెల్లగా కదలసాగింది.

ఆ చెట్టు- ఆ గాలి అతడి జవాబు కోసమే ఎదురుచూస్తున్నట్టుగా ఉన్నాయి.

"చెప్పుబావా" మరోసారి అడిగింది రమేష్.

రమేష్ తలూపాడు. క్షణకాలం కన్నులు మూసుకుని, వెంటనే తెరిచాడు.

"మగాడు... మగాడు ఎందుకు పెళ్ళి చేసుకోవాలంటే- "ఓదార్పుకోసం""!

మెల్లగా సాగుతున్న గాలి ఒక్కక్షణం అక్కడే ఆగి, చెవులు ఒగ్గి అతడి జవాబు విన్నది "ఓ పురుషుడా! పెళ్ళి యొక్క పవిత్ర లక్ష్యం ఎంత చక్కగా అర్థం చేసుకున్నావు" తృప్తిగా సాగిపోయింది గాలి.

అతడు తిరిగి చెప్పసాగాడు:

"ఈ లోకంలో ఎక్కువమంది ఆనాలోచితంగా- అనుకరిస్తూ పెళ్ళి చేసుకుంటే- మిగిలినవారిలో కొంతమంది సెక్స్ కోసం, కొందరు పిల్లల కోసం, మరికొందరు డబ్బుకోసం, ఇంకా కొందరు వండిపెట్టే ఆడమనిషి కోసం పెళ్ళి చేసుకుంటున్నారు. ఆఫ్‌కోర్స్ పై ప్రయోజనాలన్నీ దృష్టిలోపెట్టుకుని పెద్దలు పోరుపెడుతున్నారు. ఆ పోరుపడలేక కొద్దిమంది పిల్లలు

పెళ్ళికి అంగీకరిస్తున్నారు.

కాని ఆ హీనకారణాలు కోసం మగాడు పవిత్రమైన పెళ్ళి చేసుకోనవసరం లేదని నా ఉద్దేశం.

సెక్స్ కావాలనుకుంటే పాతిక రూపాయలకు దొరుకుతుంది. దాని కోసం పెళ్ళి అనే తతంగం జరుపుకుని, ఆ తర్వాత జీవితస్వేచ్ఛను పోగోట్టుకోనవసరంలేదు. ఓ పెద్దమనిషి అన్నట్టు - ఎక్కడబడితే అక్కడపాలు దొరుకుతుంటే గేదెను కొనుక్కోవలసిన అవసరం ఏముంది?

పిల్లలే కావాలనుకుంటే, సొంతబిడ్డలే కావాలా- పెంచుకునేందుకు? 'అనుబంధం- ఆప్యాయత అంతా ఒక బూటకం, ఆత్మతృప్తికై మనుషులు ఆడుకునే నాటకం...' - కొడుకులు చేసిన నిర్వాకానికి తండ్రివడిన వ్యధ అది. కన్నబిడ్డలు ఆస్తులు పంచుకునేందుకే గాని, అమ్మా నాన్నను పోషించేందుకు కాదు. కాబట్టి ఆత్మతృప్తిని వదిలేయగలిగితే- పెంచుకోవాలన్న కోరికే ఉంటే అనాథను పెంచుకోవటం ఉత్తమం.

వండిపెట్టేందుకు పెళ్లాంకావాలా? మంచి వంటమనిషి దొరకదా?

డబ్బు కోసం- సంపాదించుకోవడం చేతకానివాడు, తనమీద తనకు నమ్మకం లేనివాడు, లోభి... కట్నంకోసం పాకులాడుతారు లీవిట్.

పెళ్లికి ఇవే కారణాలయితే, అవే నా జవాబులు.

ఈ కారణాలు వదిలేస్తే- మరి మగాడు పెళ్ళెందుకు చేసుకోవాలి?

అలా సాగుతున్న నా ఆలోచనలకు అంతం లేకపోయింది. ఇన్ని ఆలోచించే నేను అందరిలా అనాలోచితంగా ఎలా పెళ్లిచేసుకోగలను?

ఆ సమయంలో నేను నీ ఒడిలో పడుకొని ఉండకపోతే, నాకు ఎన్నటికీ జవాబు దొరికి ఉండేది కాదు కాబోలు. నిజం శ్వేతా! మనిషికి ఓదార్పు ఎంత ముఖ్యమైనదో ఆ క్షణమే నాకు తెలిసింది....

ఈ ప్రపంచంలో మగాడికి ఓదార్పునివ్వగలిగినవారు తల్లి, భార్య మాత్రమే.

తల్లి అర్థం చేసుకోలేదు కాబట్టి, ఆ 'ఓదార్పుకోసం' ప్రతి మగాడికి భార్య కావాలి.

కష్టాలు తెలియక, బాధలు ఎరుగని చాలా మందికి ఆ ఓదార్పు విలువ తెలియకపోవచ్చు. వారు ప్రశ్నించవచ్చు- భార్య కావలసింది కేవలం ఓదార్పు కోసమేనా అని. స్త్రీ మగాడికి ఎందుకు అవసరమంటే- మొట్టమొదట ఓదార్పు కోసమేనని నా అభిప్రాయం. ఆ తర్వాత ఉత్తేజంకోసం, ఆ తర్వాతే మిగిలినవి.

మగాడికి ఏదో ఒకనాడు తట్టుకోలేని సమస్యలు అనేవి తప్పక ఏర్పడతాయి. సమస్యలతో వేగిపోయే మగాడు, ఆ రాత్రి భార్యఒడిలో తలవాల్చితే ఆమె తన అమృతహస్తాలతో అతని తలదువ్వుతూ, ఉత్తేజకరంగా మాట్లాడుతుంటే.... ఆ ఓదార్పు చాలు మగాడికి. ఆ సమస్యలను ధైర్యంగా ఎదుర్కోగలడు.

ప్రతి మగాడి విజయం వెనుకా ఒక స్త్రీ ఉంటుంది' అని చెప్పింది ఈ దృష్టితోనే.

సో! సెక్స్‌కోసమో, పిల్లల కోసమో, డబ్బుకు ఆశించో... మరేదేనికోసమో అయితే- 'పెళ్లి' అనేంత గొప్పపదాన్ని ఉపయోగించి, దాని పవిత్రతను పాడుచేయనవసరం లేదని నేను అనుకుంటున్నాను....''

కిటికీకి అవతల నైట్‌క్వీన్ పెళ్లికి అతడు చెపుతున్న చక్కని భాష్యాన్ని వింటూ సంతోషంగా తలూపుతోంది.

''పెళ్లి.... నేడు పెళ్లి అనేదాన్ని బాధలకు తొలిమెట్టుగా అందరూ భావిస్తున్నారు. అదీ నిజమే... కారణం! తల్లే కాదు భార్యకూడా మగాడి మనస్సును అర్థం చేసుకోకపోవడం. ఏ భార్య అయినా మగాడు బాధలలో ఉన్నప్పుడు- చికాకు కనబరచినప్పుడు, అతడిని తన ఒడిలోనికి తీసుకుని తల్లిగా లాలించి, భార్యలా ఓదార్చి, ప్రియురాలిలా ఉత్తేజపరిస్తే చాలు- ఆ మగాడు అపరిమితానందం పొందుతాడు. సర్వబాధలూ మరచిపోతాడు.

బట్ బేడ్‌లక్! నేడు మగాడు ఇంట్లోకి రాగానే భార్య ఛీత్కారం, విదిలింపులు, విసుర్లు వినాల్సివస్తుంది. బయట బాధలు, ఇంట్లో చికాకులు, మగవాడికి మనశ్శాంతి లేకుండాపోతోంది. ఆ కారణంగా అనేకమంది మగవారు పక్కదారులు పడుతున్నారు. భార్యల దగ్గర పొందలేని మనశ్శాంతి మరేదాని ద్వారానో




పొందాలనుకుంటున్నారు. తాగుడు, పేకాట, అక్రమ సంబంధాలు ఇవన్నీ భార్యల బలహీనతకు నిదర్శనమని నా అభిప్రాయం.

ఏ భార్యయినా మగాడి మనసును గుర్తెరిగి అతడికి అనుగుణంగా ప్రవర్తిస్తే, ఏ మగాడూ దురలవాట్ల ద్వారా మనశ్శాంతిని పొందాలని అనుకోలేడు.

దురదృష్టవశాత్తు నేడు భార్యలు భర్తల మీద స్వారీచేసేందుకే ప్రయత్నిస్తున్నారు. ఇంటిపెత్తనం కోసం పాకులాడుతున్నారు. ఇంట్లో తమ ఆధిపత్యంకోసం మనసు కేంద్రీకరిస్తున్నారు.

ఆ ఆరాటంలో మగాడి మనసు పట్టించుకోవడం లేదు. అతడికి కావలసిందేమిటో వారు అర్థంచేసుకోవడంలేదు.

అఫ్‌కోర్స్... పెళ్లి సమయంలోనే మనసులకు ప్రాధాన్యత ఇవ్వడం మరచిపోతారు పెద్దలు. కాలక్రమేణా ఎదుటివారికి మనసనేది ఒకటి ఉంటుందన్నది దంపతులిద్దరూ మరచిపోతారు.

అందుకే నేడు పెళ్లిళ్లు బాధాప్రపంచానికి ఆహ్వానద్వారాలుగా మారిపోయాయి.....

శ్వేతా! మన పెళ్లి అలా కాకూడదు. ఆదర్శ దంపతులుగా మనం ఆనందం అనుభవించాలి. అవసరమైన సమయంలో నీ ఓదార్పు నాకు కావాలి. నీ సమక్షంలో నేను సేదతీరగలిగి ఉండాలి. అందుకు నువ్వు సహకరించవూ..'' అర్థింపుగా ఆమె కళ్ళలోనికి చూశాడతను.

అతడి చూపులకు ఆమె మనసు కరిగిపోయింది. ఆప్యాయంగా అతని జుట్టు సరిచేసింది.

''తప్పకుండా బావా... ఏనాడూ నిన్ను విసిగించను. ఏ క్షణాన నీవు ఎలా ఉన్నావో అర్థం చేసుకుని, పరిస్థితికి అనుగుణంగా ప్రవర్తిస్తాను... కష్టాల్లో నిన్ను ఓదార్చుతాను. సుఖాలలో పాలు పంచుకుంటాను....'' వాగ్దానం చేసిందామె.

''థాంక్స్. ఇప్పుడు నువ్వు ఆదర్శవంతమైన భార్యవు. నేను అదృష్టవంతుడనయిన భర్తను... లోకమంతా ఇలాగే ఉంటే ఎంత బాగుండును'' మరో లోకంలో విహరిస్తూ అన్నాడతను.

సరిగ్గా అప్పుడే ఫోన్ మోగింది.

అతడు లేచి వెళ్ళి రిసీవర్ చేతిలోనికి తీసుకున్నాడు.

''హలో రమేష్'' అంది అవతలి గొంతు.

''శ్వేతకు ఆ విషయం చెప్పేశావా?'' ఆతృత ధ్వనించింది అశోక్ కంఠంలో.

''చెప్పాను''

''మరి ఆ జవాబు నాకూ చెప్పవూ?''

''ఇది నా ఫస్ట్‌నైట్''

''అయితే?''

''నీలాంటివారితో కాలక్షేపం చేస్తూ టైమ్ వృధా చేసుకోలేను. అవన్నీ రేపే''

''మరి ఆ జవాబు వినాలని నాకు చాలా ఆతృతగా ఉంది''

''రేపటివరకూ వెయిట్ చెయ్యి''

''ఉండలేను... ప్లీజ్''

''నో... సారీ''

''ప్లీజ్''...

జవాబివ్వకుండా లైన్‌కట్ చేశాడు రమేష్.

టెలిఫోన్ కనెక్షన్ ఊడదీసేశాడు. ఇక ఎవ్వరూ తమను డిస్టర్బ్ చేయలేరు.

అతను పక్కన కూర్చున్న తర్వాత శ్వేత అడిగింది ''ఆ మిత్రుడేనా''?

''అవును... మన ఫస్ట్‌నైట్‌ని వేస్ట్ చేయించాలని ప్రయత్నిస్తున్నట్టున్నాడు... నేనేం అమాయకుడినా''.

ఆమె అదోలా నవ్వింది.

రమేష్ చేతి గడియారం వంక చూసుకుని, ''మైగాడ్! అర్థరాత్రయింది'' అన్నాడతను.

''అయితే?'' ప్రశ్నార్థకంగా చూసిందామె

''మనం చేయాల్సినవి చాలా ఉన్నాయి''

''ఏమిటవి?''

''ముందుగా ముద్దు... ఆ తర్వాత...''

ఆమెకు అర్థమయి సిగ్గుగా నవ్వింది.

అతడు ఆమెకు దగ్గరగా జరిగాడు.

ఆ తర్వాత వారి మధ్య ప్రకృతి స్థంభించిపోయింది.



# ఏరిన ముత్యాలు

- నేను అణచడానికి వీలులేని ఆశావాదిని. నానుంచీ నేను ఎంతో ఆశిస్తున్నాను కాబట్టే నేను ఆశావాదిని.

  — గాంధీజీ.

- ఒక వ్యక్తి కళాశాలను, విశ్వవిద్యాలయాన్ని వదిలివేసిన తరువాత అతనిలో ఏదైతే మిగిలి ఉంటుందో అదే విద్య.

  — ఆల్బర్ట్ ఐన్‌స్టీన్

- ధనం నీకు ఆహారాన్నిస్తుంది కాని ఆకలినివ్వదు. మందులనిస్తుంది కాని ఆరోగ్యాన్నివ్వదు. పరిచయాలనిస్తుంది కానీ స్నేహితులనివ్వదు. సేవకులనిస్తుంది కాని విశ్వాసాన్నివ్వదు, సంతోషదినాలనిస్తుంది కాని శాంతినివ్వదు.

  — కోల్టన్

- యుక్తవయస్సులో ఉన్నప్పుడు మానవత్వంపై వ్యంగ్య రచనలు చేద్దామనుకొన్నాను. పెద్దవాణ్ణి అయిన తరువాత అలా అనుకున్నందుకు ప్రాయశ్చిత్తం చేసుకోవాలనుకుంటున్నాను.

  — వాల్‌పోల్

- నిన్నటికంటె నేడు నీ వివేకం పెరగకపోతే, మరో రోజు వ్యర్థమైందని తెలుసుకో

  — కాల్టన్

- రచయితలు ముఖ్యంగా మూడు రకాలవారుంటారు. ప్రచురణకు యోగ్యమైనవే రాసేవారు కొందరు. ప్రచురించేవారున్నారని రాసేవారు కొందరు. ఆలోచనాపరులకోసం రాసేవారు కొందరు.

  — కోల్టన్

- మృత్యువనే అగాధం ఎదుట ఉన్నవాళ్లూ, రెండో ఒడ్డు ఉందా లేదా? ఉంటే ఆ ఒడ్డున ఏముంటుంది?- అని వెతకటం మానడు మానవుడు. ఎంత మతాన్ని ధ్వంసం చేసినా, ఎందరి దేవుళ్లను హతమార్చినా ఈ ఆరాటం నుండి మనిషి విముక్తుడు కాలేడు.

  — చలం

- నిష్కళంకమైన అంతరాత్మ కోటిమంది సాక్ష్యమిచ్చినా బెదరదు. అది కళంకితమైనప్పుడు ఏకాంతంలో కూడా తన నీడను తానే చూసుకొని భయపడుతుంది.

  — సెనెకా

- సంతోషాన్ని మనమెంతగా దేముకుంటే అంతగా మనవద్దకు వస్తుంది.

  — విక్టర్ హ్యూగో

- కలల్లో ఉన్న గొప్పదనం ఎంత బలవత్తరమైనది! జీవిత భావుకతా గరిమ ఎంత మహత్తరమైనది! ఏమిటీ జీవితం? మన చచ్చు హేతువాదం. మన కళ్లు దేనినైతే జీవితమని చెబుతాయో అదికాదు. దేనినైతే కలలు కంటామో అదే జీవితం. ఆ జీవితానికి కొలబద్ద వలపు.

  — రోమారోలా

- అతిముఖ్యమైన విషయాలలో ఏం చేయాలో అనుమానం కలిగినప్పుడు ఆడవారి సలహా తీసుకోవడం ఉత్తమం. ఆడవారు హృదయంతో ఆలోచిస్తారు. మంచిపనికి బుద్ధికన్నా హృదయం ముఖ్యం.

  — రేనర్స్

- ఇతరులు మనపట్ల ఎలా ప్రవర్తించాలని మనం కోరుకుంటామో, మనం ఇతరులపట్ల అలాగే ప్రవర్తించాలి.

  — ఎర్ల్ ఆఫ్ చెస్టర్ ఫీల్డ్

సేకరణ: వల్లబెల్లి శ్రీమన్నారాయణ




ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర' లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరటావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో మొదటి మూడింటికి రు.100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనా శక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతుర ప్రపంచం, కథలు, ఫీచర్ల వంటి ఇతర అంశాల పట్లకూడా పాఠకులు తమ అభిప్రాయాలను విడిగా రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలిచాం.

## కూపన్

జూన్ 'చతుర' నవల: అమృతహస్తాలు

సమీక్షకుని పేరు: ..............................................

చిరునామా: ..............................................

..............................................

..............................................

# చతుర ప్రపంచం

## కావలిలో వృశ్చికనివాస్

'గోడ మీద బొమ్మ గొలుసుల బొమ్మ వచ్చిపోయే వారికి వడ్డించుబొమ్మ' అనే పొడుపుకథకి, జవాబు 'తేలు' అని చప్పున చెప్పేయగలం. తేలు అనగానే దాని కొండి విషయం గుర్తుకి వచ్చి, శరీరం జలదరించవచ్చు.

కాని తేళ్లని కూడా, పెంచడానికి, వాటి ప్రవర్తన గమనించడానికీ కావలిలోని శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ పోస్టుగ్రాడ్యుయేట్ కేంద్రంలోని జువాలజి విభాగంలో డాక్టర్ శశిరబాబు ఆధ్వర్యంనేతృత్వాలలో అధ్యాపకులు డాక్టర్ శ్రీమతి విజయకుమారి, డాక్టర్ రాజారాంరెడ్డిగారలు అధ్యయన బృందంగా వున్నారని చాలామందికి తెలియకపోవచ్చు. తేళ్లను వుంచిపెంచడానికి 'స్కార్పియన్‌హౌస్' అనేది తేలు బొమ్మతో ఆ కేంద్రం పక్క ప్రత్యక్షం అవుతుంది- మద్రాసులో 'స్నేక్ పార్క్'లాగా.

కావలిలోనే యీ పరిశోధన జరగడానికి కారణం ఏమిటి? నెల్లూరు జిల్లా కావలి, ఉదయగిరి ప్రాంతాలలోనే ఎర్రతేలులాంటివి కుట్టి, మరణించేవారి సంఖ్య కూడా అధికంగా వున్నట్లు గణాంక లెక్కలలో తేలడమే!

తేళ్ల విషం కొన్ని విషయాల్లో ఎంతో ఉపకరిస్తుంది. తేళ్ళు ఎక్కువగా వుండే ప్రదేశాలలో పరిశోధన చేసేందుకు వెళ్లేవారికి తేలువిషం, ప్రమాదపరిస్థితులలో సంజీవినిలా ఉపయోగపడుతుంది- పామునుండి 'ఏంటివెనం సీరం' తీసి పాముకాటు రోగికి యిచ్చినట్లుగా. అంతే కాక హోమియోపతి వైద్యం ప్రకారం, చర్మ వ్యాధులతో బాధపడేవారికి తేలువిషాన్ని కొద్ది మోతాదులో సరియైన పద్ధతిలో యిస్తే వ్యాధి నివారణ అవుతుంది. వృశ్చికం నడవడిక (బిహేవియర్), అది గుడ్లు పెట్టేవిధానం మొదలైన అంశాలనుకూడా పరిశోధక బృందం అధ్యయనం చేస్తున్నది. ఒక విధంగా చూస్తే కావలి వైజ్ఞానికులకు, వృశ్చికరాజులకూ ఏదో సంబంధం వుందేమో అనిపిస్తుంది. కావలి డిగ్రీ కళాశాలలో పనిచేస్తున్న ఇ.శ్రీనివాసులు రెడ్డి కూడా తేళ్ల గుడ్లను గురించి పరిశోధనా వ్యాసం సమర్పించారు.




వృశ్చికానివాస్ గుండ్రంగా కొంత ఎత్తుగా



ఎలయిం-ంలల వుంటుంది. గడలలవల ఎంతో నునుపుగా వున్నందున, గోడ ఎక్కిపైకి వచ్చే ప్రయత్నం చేసిన తేళ్లు, తేళ్లసంతాన మూ మళ్లీ కిందనే జారిపడతాయి. అసలు మొదట తేళ్లను పట్టుకోవడం ఎలా? అన్న విషయం పరిశీలిస్తే, ఏనాదులు, అలాంటి తెగవారు అడవుల్లోగాని, నిర్జనప్రదేశాల్లో గాని, మట్టిని లేదా కొన్ని రాళ్లను చూడగానే ఆరాళ్ల కింద తేళ్లు వుంటాయి అని పసికడతారు. రాయిని కదిలించారు అంటే ఆరాతికింద తేళ్ల సంతానం ఎన్నైనా వుండితీరతాయి. తేళ్లను పట్టుకొని వచ్చాక విషం కలిగిన 'గ్లాండ్స్'ను ఓ పద్ధతిలో తీసివేయడం కూడా కొన్నిసార్లు జరుగుతుంది.

విషం కొండెవున్న తేలునుకూడా తలకిందులుగా ఒక పద్ధతిలో అరచేతిలో వుంచవచ్చు. చేతివేళ్లతో పట్టుకొనవచ్చు. తేలు చేతివేళ్లను కుట్టేందుకు పైకి పాకలేదు అని అధ్యాపకులు చెబుతున్నారు. వారు ఈ విద్యలో నిష్ణాతులు. అయినా మామూలు ప్రజలకు తేలు కొండెను చూస్తేనే దేహం జలదరిస్తుంది- పట్టుకునేందుకు సాహసించరు సాధారణంగా.

ఒక్కోమారు విద్యుత్ షాక్‌లాంటిది యివ్వడం ద్వారాకూడా తేలుకొండిలోని విషాన్ని వేరుచేయడం జరుగుతుంది- అని డాక్టర్ రమణరావుగారు అన్నారు.

పట్టకారులాంటి వాటి ద్వారా విషాన్ని ట్యూబ్‌లలోకి, చిన్న సీసాలు లోనికి నింపవచ్చు. అయితే యిది 'క్రూడ్' రకమైన విషం మాత్రమే అవుతుంది. ఈ మొరటు విషాన్ని శుద్ధిచేసి 'ప్యూరిఫైడ్' పద్ధతిలో, ప్రత్యేకమైన సంస్థలు 'అడ్వాన్స్‌డ్ ఇన్‌స్టిట్యూట్'లలో నిలువ చేసి వుంచటం జరుగుతుందని మరో అధ్యాపకులు అన్నారు. వృశ్చిక విషంపై, వాకాడు ఎన్.బి.కె.ఆర్ ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాలలోని మరొక అధ్యాపకురాలు కూడా పరిశోధన చేశారు.

వృశ్చికాల ప్రవర్తన రాత్రిపూట ఉధృతంగా వుండటంవల్లనే రాత్రి సమయాల్లో ఏక్టివ్‌గా యివి తమ కొండెలకు ఎక్కువగా పనికల్పించి, కుడుతూ వుంటాయి అని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు.

తేలుకూడా సాధు జంతువుల ప్రాణులు (డొమెస్టిక్ ఏనిమల్) విభాగంలోకి వస్తుందా? శుద్ధిచేసిన విషం ఎన్నిరకాలుగా పరిశోధనలకు, మానవజాతి అభ్యున్నతికి ఉపయోగపడే అవకాశాలు ఉన్నాయి? ఇత్యాది ఆసక్తిదాయకమైన విషయాలపై యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్‌వారి 'న్యూట్రలైజేషన్ ఆఫ్ స్కార్పియన్ వెనం-డీపాయిసన్' అనే ప్రాజెక్టుపై 'డాక్టర్ శశిరబాబు స్కూల్' నిరంతర పరిశోధనా అధ్యయనం కొనసాగిస్తున్నది.

## ఆహారంద్వారా రోగులకి చికిత్స

**మ**నిషి ఆహారపు అలవాట్లకి, ఆరోగ్యానికి గల సంబంధం అందరికీ తెలిసిందే. విపరీతంగా తీపిపదార్థాలని భుజించడం, కొవ్వుపదార్థాలని, నూనెలో వేయించిన పదార్థాలని తినడం ఆరోగ్యానికి మంచిది కాదు. లావుగా ఉన్నవారైతే అలాంటి ఆహారం తగ్గించడం మంచిది. రక్తపుపోటుతో బాధపడేవాళ్ళు ఉప్పువాడకాన్ని మధుమేహవ్యాధితో బాధపడేవాళ్ళు పిండిపదార్థాలు, చక్కెర మొదలైన వాటిని, గుండె జబ్బున్నవాళ్ళు కొలెస్టరాల్ ఎక్కువగా ఉన్న వాటిని తప్పనిసరిగా తగ్గించాలనేవి మనం తరచుగా వింటున్న విషయాలే.

పండగలప్పుడు తరచుగా అందరూ తినే పిండివంటకాల్లో చక్కెర, కొవ్వు, పిండిపదార్థాలు ఎక్కువగా ఉంటాయి. అలాంటి ఆహారం తినడంవల్ల పిల్లల్లో మితిమీరిన ఉద్రేకం, మానసిక అలజడి, మందకొడి తనం చోటుచేసుకునే ప్రమాదం ఉందని విదేశాల్లోని పోషకవిలువల నిపుణులు అభిప్రాయపడుతున్నారు. అలాగే కొవ్వు పదార్థాలు, చక్కెర తక్కువగా ఉండి రంగులు కలపని ఆహారపదార్థాలు తినడంవల్ల పిల్లలు స్థిమితంగా, ఆనందంగా, ఆరోగ్యంగా ఉంటారని కూడా చెప్తున్నారు.

గ్రీకు వైద్యశాస్త్రంలోనూ, మధ్యయుగంనాటి వైద్యంలోనూ అనారోగ్యాన్ని బట్టి పథ్యాన్ని నిర్ణయించేవారు. 1902లో అమెరికాలో కెల్లాగ్






అనే ఆయన మానసిక వ్యాధుల్లో బాధపడేవారి కోసం "కార్న్‌ఫ్లేక్స్" అనే ఆహారాన్ని తయారుచేశాడు. అది తీసుకోవడంవల్ల మానసికరోగుల్లో మెరుగుదల వుంటుందని ఆయన వాదం. ఇటీవల న్యూయార్క్‌లోని స్కూలుపిల్లలకి అలవాటుగా ఇచ్చే కొవ్వు, తీపి ఎక్కువగా ఉండే ఆహారపదార్థాలని మాన్పించి తాజాపళ్ళని, కూరగాయలనీ, పీచుపదార్థాలు ఎక్కువగా ఉండే పదార్థాలనీ వాడిన సంతృప్త ఆహారం తినిపించి అందువల్ల ఆపిల్లల తెలివితేటలు పెరిగినట్టు కనుక్కున్నారు.

లండన్‌లో డాక్టర్ డేవిస్ అనే ఆయన తన రోగులకి పూర్తిగా ఆహారంతోను, విటమిన్లతోనూ చికిత్సచేస్తున్నాడు. తన అనుభవాన్ని బట్టి తినే ఆహారపుటలవాట్లని మార్చడం వల్ల రోగుల ప్రవర్తనలో చెప్పుకోదగ్గ మార్పులు కనబడుతున్నట్టు ఆయన కనుక్కున్నారు.

మనిషి ప్రవర్తనని ప్రభావితం చేసే కారణాలు అనేకం వుండటంవల్ల ఆహారపుటలవాట్లలో మార్పులే అందుకు కారణమని చెప్పటం కష్టమని మరికొందరి నిపుణుల అభిప్రాయం. ఉదాహరణకి న్యూయార్కు స్కూలు పిల్లలపై ఆహారపు పదార్థాలని మార్చి ప్రయోగం చేసిన సమయంలో బోధన పద్ధతులు కూడా మార్చడం జరిగిందని. కానీ పిల్లల్లో పెరిగిన తెలివితేటల్ని ఆహారపదార్థాల్లో మార్పుకే ఆపాదించడం సమంజసం కాదని మరికొందరు నిపుణులు వాదిస్తున్నారు.

పిల్లల్ని సంస్కరించే పాఠశాలల్లో కొన్నింటిలో కూడా ఇటువంటి ప్రయోగాలు చేసి ఆహారాన్ని మెరుగుపరచడం వల్ల అక్కడి విద్యార్థుల ప్రవర్తనలో కూడా మార్పు కలిగినట్టు కనుక్కున్నారు. కానీ ఈ వాదాన్ని విమర్శించేవారు అక్కడి విద్యార్థులకి వాళ్ళు జరిపే పరిశోధన గురించి ముందుగా తెలుసుననీ, మంచి ఆహారంతిని, నడవడిక బాగుచేసుకోవడంవల్ల మరింత మంచిఆహారం లభిస్తుంది కాబట్టి వాళ్ళే ప్రవర్తన మార్చుకుని వుండవచ్చుననీ, ఆహారమే వారిని మార్చి ఉండకపోవచ్చుననీ ఈ వాదాన్ని ఖండిస్తున్నారు.

ఐతే, మందులతో కాక ఆహారపదార్థాల ద్వారా రోగుల్ని నయం చెయ్యటం మంచిదనే విషయం పోషకవిలువల నిపుణులు, శాస్త్రజ్ఞులు ఏకగ్రీవంగా అంగీకరిస్తున్నారు. చివరికి శాస్త్రీయపరమైన ఆధారం దొరికి ఈ వాదం బలం పుంజుకుంటే వైద్యశాస్త్రంలో విప్లవాత్మకమైన మార్పు వచ్చినట్టే. ఎటొచ్చీ, ప్రాసెస్డ్ ఫుడ్స్, కాన్ఫెక్షనరీ ఉత్పత్తిదారులు వారి ఉత్పత్తులకి గిరాకీ పడిపోతుంది కనుక నష్టపోవచ్చు.

## ఎవరికీ కనిపించని "శాంభల"

"శాంభల" – అని ఎవరైనా అంటే ఆపేరు యెక్కడా వినలేదని వెంటనే అనేస్తాం. నిజమే ఈపేరు విచిత్రంగా ధ్వనిస్తుంది. అయితే కానీ ఒక అందమైన ప్రదేశంపేరు. అయినా ప్రపంచ పటంలో యిది ఎక్కడా కనిపించదు.

కానీ "ఇది అద్భుతమైన ప్రదేశం అని యిక్కడ ఏకాంతవాసంచేసే మహాత్ములు



ఉంటారనీ అక్కడకు మనం వెళ్లలేము'' అని టిబెటన్ల విశ్వాసం.

ఈ ప్రదేశం ఆసియాఖండంలో మనుషులు జొరబడలేని దుర్గమస్థానంలో ఉందట! ఇలాంటి ప్రదేశం గురించి కాల్పనిక నవల రాయవచ్చు అనుకొంటే అది పొరపాటే. ఎందుచేతనంటే యిది కేవలం కల్పిత ప్రాంతంకాదు కనక.

రష్యన్‌లు, యూరోపియన్‌లు కాశ్మీరునుంచి ఖోటాన్ వరకు మధ్య ఆసియాలోని ఎన్నో విచిత్రమైన ప్రదేశాల్ని గాలించారు. 'శాంభల' ఆచూకీతీయడం వీరి లక్ష్యం. కాని ఆ ప్రయత్నాలు ఫలించలేదు.



ఈ విషయమై టిబెటన్లే యిలాఅంటారు.

''శాంభల అనే ప్రదేశం టిబెటన్లకి మతపరమైన ఒక విశ్వాసంనుంచి వచ్చిన కల్పన. టిబెటన్ మిస్టిసిజమ్‌లో 'కాలచక్ర' అనే ఒక శాఖఉంది. ఈశాఖాను యాయులు కల్పించినదే 'శాంభల' అనే ప్రదేశం. ఈ కల్పన క్రీస్తు శకం 1026 నుంచి బాగా ప్రచారంలోకి వచ్చింది.

బుద్ధుడే 'కాలచక్ర' సిద్ధాంత బోధకుడంటారు. ఆ తర్వాత వేల సంవత్సరాలపాటు ''శాంభల'' గురించి ఎవ్వరూ పట్టించుకోలేదు. కాని ఒక భారతీయయోగి ఈ ప్రాంతం ఉనికి గురించి ఆరాతీస్తూ టిబెట్ వరకు వెళ్లాడు. అయినా దీని ఆనుపానులు దొరకలేదు.

అయితే హిమాలయాలనుంచి గోబి ఎడారి వరకు విస్తరించిన విశాల ప్రదేశంలో ఈ ''శాంభల'' ఉండి ఉంటుందని భావించారు. ఈ ప్రదేశాన్ని ఒక ''అతీంద్రియ తేజోశక్తి'' కాపాడుతుంటుందని, అందుకే దీనిని ఎవ్వరూ చూడలేరని టిబెటన్లు విశ్వసిస్తుంటారు. టిబెట్‌లామాలు కూడా దీనిగురించి ఎన్నో యాతనలువడ్డారు. కాని ఆచూకీ తీయలేకపోయారు.

ఇంగ్లీషు ఫిక్షన్ రచయిత జేమ్స్ హిల్టన్ (1900-54) షాంగ్రిలా గురించి వూహించి 'లాస్ట్ హొరైజన్' అనే నవలలో రాసినట్లు ''శాంభల'' గూడ ఒక ఊహాజనిత ప్రాంతమా? అని కొందరు అనుమానాన్ని వ్యక్తంచేశారు. 'షాంగ్రి-లా' వర్ణనలు అచ్చం ''శాంభల'' వర్ణనని సరిపోలే ఉంటాయి.

ఇంతకీ ఈ ''శాంభల'' ఎలా ఉంటుంది?

''ఇది ఎనిమిదిరేకుల మొగ్గలా ఉంటుంది. ఎనిమిది ప్రాంతాలు దీనిలో కలిసిఉన్నాయి. ప్రతిదేశాన్ని పర్వతశ్రేణులు చుట్టి ఉంటాయి. కేంద్రస్థానంలో రాజధాని నగరం అయిన ''కలాప'' (నగరం) ఉంది. అక్కడే రాజుగారి భవనం ఉంది. ఇది బంగారంతో నిర్మితమైనది. వజ్రాలు, పగడాలు తాపడం చేయబడినది. ఈ రాజధానీ నగరాన్ని స్ఫటికాలవంటి మంచుకొండలు కాపాడుతుంటాయి.

''శాంభల'' వాస్తుపద్ధతి చాలా మేలైనది. గ్రహాంతర జీవరాశి గురించి పరిశీలించే పెలి

స్కోవులు ఇక్కడ అమర్చిఉంటాయి. "శాంభల" దేశప్రజలు ప్రత్యేక విమానాల్ని వైభవవాహనాల (కార్ల)ని ఉపయోగించి తిరుగుతుంటారు.

జ్ఞానసాక్షాత్కారం పొందే ప్రయత్నంలో వీరికి బెచరీవిద్యలూ, ప్రత్యక్ష అంతర్ధాన విద్యలూ వశమవుతాయట! అణిమ, గరిమాది విద్యలూ వీరికి కరతలామలకాలట!

"శాంభల" రాజ్యాన్ని 32 మంది రాజులు పాలిస్తారు. ఒక్కొక్కరాజు పాలనాకాలం వంద సంవత్సరాలు. కాలం గడిచేకొద్దీ బయట ప్రపంచంలోని మనుష్యుల తీరుతెన్నులు మారిపోతాయి. వారిలో యుద్ధశక్తి పెరుగుతుంది. భౌతికవాదం ప్రబలుతుంది. అత్యాధునిక ఆయుధాలు సమకూర్చుకొంటారు.

శాంభలపై వీరు దాడిచేస్తారు. అప్పుడు శాంభలదేశపు 32వ రాజైన 'రుద్రచక్రిన్' తన వీర సైనికులతో ఈ వరాయిదండయాత్రని ప్రతిఘటిస్తాడు.

ఇది టిబెటన్ సంప్రదాయ రచనలలో శాంభల గురించి కనిపించే వర్ణన.

ఇదంతా ఏదో కాశీమజిలీకథలా అనిపిస్తుంది. ఈ 'శాంభల' గురించిన తొలివర్ణనలు 17వ శతాబ్దికి చెందిన యూరప్ కాథలిక్ మిషనరీల రచనలనుంచి లభ్యం అయాయి. చైనీయుల్ని, టిబెటన్లని క్రైస్తవంలోకి మార్చాలని ప్రయత్నించిన యూరోపియన్ క్రైస్తవ మిషనరీలు "శాంభల" గురించి తెలుసుకొన్నాయి. వారు దీనిని 'గ్జెంబాలా' అనిపిలిచారు. ఇది చైనాలో ఉందనుకొని వారు చైనా వెళ్లారు. అయితే లామాల ద్వారా వీరికి దీని అసలుపేరు తెలిసింది. తమ తప్పుని తెలుసుకున్నారు. 1627 ప్రాంతాలలో ఈ మిషనరీలే తాము రాసిన లేఖలద్వారా శాంభల గురించి వర్ణించారు.

రష్యన్ సైన్యంలో కల్నల్ కుమార్తె అయిన 'ఎలీనా పెట్రోవ్నా బ్లావట్స్కీ' 'శాంభల' గురించి 1875లో విశేషంగా రాసింది. టిబెట్‌ని పర్యటించిన తొలి విదేశీమహిళ ఈమె. తన జీవితంమధ్య దినాలలో మంత్రవిద్యల్ని సాధించిందట. అది టిబెట్‌లోనే. ఆమె థియొసాఫికల్ సొసైటి నిర్మాతలలో ఒకతె. ఈ సొసైటి సిద్ధాంతాలని 'శాంభల'లోని పరమయోగుల నుంచి సంగ్రహించినట్లు ఆమె రాసింది. పైగా ప్రపంచంలోనే ఆధ్యాత్మిక కేంద్రం 'శాంభల' అని ఆమె విశ్వాసం.

'శాంభల' దేశాన్ని అతీంద్రియశక్తిగలవారు కాపలాకాస్తుంటారని, అలాంటి ఒక సూపర్‌మేన్‌ని తాను చూశానని టిబెట్‌లో 14 సంవత్సరాలు నివసించిన తొలి యూరప్ మహిళ శ్రీమతి డేవిడ్‌నీల్ రాసింది.

ప్రసిద్ధ రష్యన్ చిత్రకారుడు నికోలస్ రోరిన్ కూడా తాను శాంభల గురించి విన్నానని, ఆ ప్రాంతంలో విచిత్రమైన విమానాలని చూశానని రాశాడు.

"శాంభల" ఒకప్పుడు ఉండేదని, అది శతాబ్దాల క్రితమే అంతరించిపోయిందని అయితే అటువంటి అద్భుత దేశాలు గురించి మనిషి చిలవలు పలవలు అల్లుకొని గొప్పగా చెప్పుకొని ఆనందించడం పరిపాటే అని కొందరు శాస్త్రవేత్తలు అంటున్నారు.

'శాంభల' అనే దేశం ఉన్నా లేకపోయినా, ఆ ప్రాంతం పేరున రాయబడిన భవిష్యవాణులు మాత్రం నిజం అవుతూవచ్చాయి.

ముప్పైరెండుమంది రాజులపేరున, వారి పాలనాకాలంలో జరిగే ప్రపంచ పరిణామాల గురించిన వర్ణనలుమాత్రం నిజం అవుతున్నాయి. వ్యాసమహర్షి 'భవిష్య పురాణం'లో చెప్పినట్లు, వీరబ్రహ్మేంద్రస్వామి కాలజ్ఞానంలో చెప్పినట్లు 'శాంభల' కేంద్రంగా ప్రవర్తిల్లిన 'కాలచక్ర' సిద్ధాంతం ఆధునికుల్ని ఆశ్చర్య చకితుల్ని చేస్తోంది.

## 'హిందూ' చీరపై పాకిస్తాన్‌లో కలకలం

పాకిస్తాన్‌లో చీరలు ధరించేవారు అన్ని మతాల్లోనూ వున్నారు. చీరను 'హిందూ వుడుపు'గా పరిగణించి, వాటిని నిషేధించాలనే ఉద్యమం ఒకటి ఈమధ్య పాకిస్తాన్‌లో తలెత్తింది. 'సిక్కు స్త్రీలు- ముఖ్యంగా ఉపాధ్యాయినులు హిందూ దుస్తుల్లో భాగమైన చీరెను ధరించవద్దని భారత సిక్కు రాష్ట్రీయ రంగం హెచ్చ

[illegible] బంగీలా [illegible] ఉమ్మును [illegible] రంజింపచేస్తోంది. ఆమె [illegible] లో బ్యూటీక్లినిక్‌ల [illegible]

# [illegible]ంగ కుబేరుడు
# బ్రూనై సుల్తాన్ బోల్కియా

పురాణకాలంలో కోట్లకు పడగెత్తిన కుబేరునికి [illegible] ధనరాసులున్నాయో, అప్పట్లో [illegible] గిన్నిస్‌బుక్‌లోకి ఎక్కాడో లేదో మనకు [illegible]గానీ, కలియుగంలో మాత్రం కుబేరుల్లోకి కుబేరుడనదగ్గ అపరకుబేరుడున్నాడు. ఇతను ప్రపంచకుబేరునిగా గిన్నిస్ బుక్‌లో కెక్కాడు అతని పేరు సర్‌హసనల్ బోల్కియా. ఈయన బ్రూనే దేశాధినేత. ఆయనకున్న ఆస్తులవిలువ 2,500 కోట్ల డాలర్లు. అంటే 35,000 కోట్ల రూపాయలన్నమాట! ఈ బ్రూనే సుల్తాన్‌కు ఇద్దరు భార్యలు. ఓ అరడజను భవంతులు. కాలు కింద పెడితే కార్లు. సొంత విమానాలు. నౌకర్లు, చాకర్లకు లెక్కలేదు. బోల్కియా తరువాత అంతటి ధనవంతుడు సౌదీఅరేబియా రాజా ఫహాద్ మాత్రమే. అతని ఆస్తుల విలువ మాత్రం 28 వేల కోట్ల రూపాయలే. వీరిద్దరి తరువాతే ఇంగ్లండ్ మహారాణి అయినా, మరో అమెరికా ధనికుడైనా.

ఇంతటి కోటీశ్వరుడైన బ్రూనే సుల్తాన్ ఎవరో, అసలు బ్రూనే అనే దేశం ప్రపంచ పటంలో ఎక్కడుందో ఎంత వెదికినా ఒక పట్టాన కనిపించదు. మలేషియా దేశానికి చెందిన సారవాక్ రాష్ట్రం పక్కనుంది ఈ చిన్నదేశం. నాలుగేళ్ళ క్రితం వరకూ బ్రిటిష్ ఆధిపత్యం కింద ఉండి స్వాతంత్ర్యం పొందింది. జనాభా కేవలం 2,20,000 అయితే అపార చమురు, గ్యాస్ [illegible] ఉండటంతో అత్యంత ధనికమైన దేశమైంది. దేశంలో లభిస్తున్న చమురువల్ల ఏడాదికి ఓ వంద కోట్ల డాలర్లు, గ్యాస్ అమ్మకాలవల్ల మరో వందకోట్ల డాలర్లకు పైగా ఆదాయం వస్తుంది.

సుల్తాను మొదటి భార్య రాజా ఇస్తేరీ దగ్గర బంధువే. ఓసారి లండన్ వెళ్తూ ఓ ఎయిర్ హోస్టెస్‌ను చూసి ప్రేమలో పడ్డాడు. తండ్రి




మొదటి భార్య రాజ ఇస్తేరీతో సుల్తాన్

అంగీకరించకపోయినా ఎదిరించి ఆమెను కూడా పెళ్లాడాడు. ఆమెపేరు మరియమ్. జపాన్, స్కాటిష్ దంపతులకు పుట్టింది. 1986లో తండ్రి చనిపోవడంతో బోల్కియా దేశానికి సర్వాధికారి అయ్యాడు. అప్పటికే రెండు విశాల రాజభవంతులున్నప్పటికీ ఇద్దరు భార్యలకూ మరో రెండు అద్భుత భవనాలు కట్టించాలని నిర్ణయించాడు.

ఇంగ్లండు రాజసౌధం బకింగ్‌హాం ప్యాలెస్‌కన్నా, వాటికన్ భవనం కన్నా మిన్నగా ప్రపంచంలోనే అతి ఖరీదైన, సుందరభవంతి నిర్మించాలని ఆలోచన వచ్చిందే తడవుగా అమలు జరిపాడు. ఒక కొండమీద కట్టించిన

మొదటి భవంతి నిర్మాణానికి 38 రకాల చలువ రాయిలతో తయారైంది. భవనం వెలుపలి గోడలకు అతి ఖరీదైన ట్రావెర్టైన్ చలువ రాతినివాడారు ఈ భవనం కట్టడానికి మొత్తం 560 కోట్ల రూపాయలు ఖర్చయితే ఈ ట్రావెర్టైన్ చలువ రాతికే 14 కోట్ల రూపాయలయింది. భవనంలో మొత్తం 1788 ఎయిర్ కండిషన్డ్ గదులుంటే వాటిలో 257 టాయ్‌లెట్ గదులు. భవనంలో మొత్తం 51,490 రకరకాల విద్యుద్దీపాలు అమర్చారు. ఒక్కో బల్బు ఏడాదిపాటు వెలుగుతుందని భావిస్తే ఒక పనివాడు రోజుకు 200 బల్బులు మార్చాలి. ఆ లెక్కన వాడు జీవితాంతం పనిచేస్తూనే



సుల్తాన్ కట్టించిన మసీదు

ఉండాలి. ఇక ఆ భవనం స్వరూపాన్ని ఊహించుకోవలసిందే. మొదటిభార్య కోసం కట్టించిన ఈ భవనం ఇలా ఉంటే రెండోభవనం మొదటిదాన్ని మించిపోయింది.

రెండో భార్యకోసం కట్టిన ఈ భవనంలో అయిదు ఈతకొలనులున్నాయి. వీటిలో ఒకటి ఒలింపిక్ క్రీడలకు ఉపయోగించేంత పెద్దది. ఈ భవనంలో గోడలన్నీ సిల్క్‌వాల్ పేపర్లతో అతికించారు. ఇవికాక సుల్తాన్‌కు లండన్‌లో మరో రెండు భవంతులున్నాయి. వాటిలో ఒకటి కేవలం పనివారికోసమే కట్టించారు. బ్రూనేలో సుల్తాన్ కట్టించిన మసీదు పై భాగం అంతా బంగారు పూతపూసిందే.

సుల్తాన్ అభిరుచులు కూడా ఖరీదైనవే. పోలో ఆటంటే ఆయనకు మహాఇష్టం. సొంతంగా ఒక పోలో క్లబ్ నిర్మించాడు. అందులో మూడు పోలో మైదానాలు, ఈతకొలను, గోల్ఫ్ కోర్సు వగైరాలున్నాయి. వీటికోసం 19 కోట్ల రూపాయలు ఖర్చు చేశాడు.

## పోలో ఆడేతీరే వేరు

పోలో ఆడేటప్పుడు సాధారణంగా బంతిని కొట్టి దానివెనుకే గుర్రంపై పరుగెత్తుతూ వెళ్ళి మళ్ళీకొడతాడు. కాని సుల్తాన్ ఆడే తీరే వేరు. సుల్తాన్ వెనుకే పనివాడు బుట్టతో బంతులతో అనుసరిస్తాడు. యజమాని మొదటి బంతినికొట్టి మళ్ళీ తయారు కాగానే పనివాడు రెండో బంతి వేస్తాడు. ఇలా సాగుతుంది పోలో ఆడే తీరు.

## షాపింగ్‌లో కూడా ప్రత్యేకత

సుల్తాన్, అతని కుటుంబ సభ్యుల షాపింగ్ తీరు కూడా విచిత్రంగా ఉంటుంది. షాపింగ్ చేయాలనుకుంటే ముందుగా కేటలాగ్ తెప్పిస్తారు. ఒక్కో పేజీ తిరగేస్తూ కావలసినవన్నీ టిక్ చేస్తూ వుంటారు. ఈ వస్తువులు ఓ పది... అవి ఓ అయిదు... ఎరుపు రంగువి ఓ డజను... పచ్చ రంగువి ఓ అరడజను... అయిదు రకాల చెప్పుల జతలు... ఒక్కో జత ఓ రంగు వంతున అయిదు జతలూ అయిదు రంగులు... ఇలా కావలసినవన్నీ టిక్ చేయగానే నౌకర్లు జాబితాలోని వస్తువులను ఫోన్ ద్వారా లండన్‌లోని సుల్తాన్ ఇంటికి తెలియజేస్తారు. అక్కడి పనివారు వెంటనే లండన్‌లోని అతి ఖరీదైన షాపుల్లో వీటన్నిటినీ కొని ప్యాక్ చేయించి హేత్రూ విమానాశ్రయానికి చేరుస్తారు. సాయంత్రానికల్లా వస్తువులు బ్రూనేలోని సుల్తాన్ భవంతికి వచ్చి వాల్తాయి. లండన్ మార్కెట్‌లోకి వచ్చిన ప్రతి సరికొత్త ఖరీదైన కారు మర్నాడు సుల్తాన్ ఇంటిముందు ప్రత్యక్షమవుతుంది. ఇలా ఉంటాయి బ్రూనే సుల్తాన్ రాజభోగాలు.









# మేమూ సితారలమే!

'నయాదిన్ నయారాత్' హిందీ సినిమా షూటింగ్ జరుగుతోంది. అందులో సంజీవ్‌కు షూర్‌తో పాటు ఒక సింహం కూడా నటించిన సంగతి సినిమా చూసిన వారికి గుర్తుండే వుంటుంది. జాగ్రత్తకోసం సింహానికి మూతి కుట్టేశారు. సాధారణంగా పులి, సింహంలాంటి క్రూర [illegible] జంతువులతో షూటింగ్ చేసేముందు [illegible] తీసుకోవడం మామూలే

సింహం పాల్గొనే సీన్లు మూడు రోజులుగా చిత్రిస్తున్నారు. ఎలాంటి ఆటంకమూ లేకుండా షూటింగు సాగిపోతూంది. యధాతధంగా నాలుగోరోజున షూటింగ్ మొదలయ్యింది. అప్పటికి సింహం తన ఆహారం తీసుకుని విశ్రాంతి తీసుకుంటూంది. విశ్రాంతి సమయంలో భంగం కలిగితే సింహం సహించదు. అందువల్ల దాన్ని కొంచెం బలవంతంగా కెమేరా ముందుకు తీసుకొచ్చారు. దాని మూతికున్న కుట్లను పరీక్షించి. రిహార్స

దర్శనమిస్తాయి.

కొందరు ప్రేక్షకులు ఈ జంతువులు నటించిన సినిమాల జోలికే వెళ్ళరు. మరి కొందరు మన సినిమాల్లో నటిస్తున్న యిన్ని జంతువుల్ని చూసి, "నటీ నటులకంటే అవే బాగా నటిస్తున్నాయ"ని సర్టిఫికెట్లు యిచ్చేస్తారు. బహుశా మనుషులకంటే వీటిని బతిమాలటం తేలికేమో— అనుకునేవారు చాలా మంది వున్నారు. కానీ జంతువులతో సినిమాలు తీయటం తమాషాకాదు. వాటిని సరైన మూడ్‌లోకి తేవడానికీ, వాటితో అనుకున్న భావం పలికించడానికీ పడేపాట్లు అటుంచితే, వాటివల్ల ఊహించని ప్రమాదాలూ, అవాంత



రాలూ, యిబ్బందులూ ఎన్నో వుంటాయి. షూటింగ్ పూర్తయ్యే వరకూ యూనిట్ అంతా ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని కూర్చోవలసిందే.

'నయాదిన్ నయీరాత్' షూటింగ్‌లో సింహంవల్ల హీరోకి ప్రమాదం ఏర్పడి, మృత్యు ముఖంనుండి వెంట్రుకవాసిలో బైటపడగా

'ఆంఖే' సినిమా షూటింగ్‌లో సింహంవల్ల మరో రకం ప్రమాదం ఏర్పడింది. బొంబాయి లోని నటరాజ్ స్టూడియోలో ధర్మేంద్ర, సింహాల మధ్య పోరాటం చిత్రిస్తున్నారు. సింహంతో కొన్ని క్లోజప్ షాట్స్ చిత్రించడం కోసం ఒక గాజు బోను ఏర్పాటు చేశారు. వెనుకవైపునుండి తెరుచుకునే ఏర్పాటున్న ఆ బోనులో సింహాన్ని ప్రవేశపెట్టారు. కెమేరామన్ సింగ్ సింహాన్ని వివిధ కోణాల్లో చిత్రిస్తూ, ఆబోను చుట్టూ తిరుగుతున్నాడు. ఒక షాట్‌లో సింహం ఎంత దగ్గరికి వచ్చిందంటే, వ్యూ ఫైండర్‌లో నుండి చూస్తున్న సింగ్‌కి సింహం కళ్ళు మాత్రమే కనిపిస్తున్నాయి. సింహం క్రమంగా తెరిచిపెట్టిన వైపుకు వచ్చేసింది. సింహం, కెమేరామన్ ఒకరికొకరు ఎదురుగా నిలుచున్నారు. ఆయన గుండె కొట్టుకోవడం ఆగిపోయింది. ఏమవుతుందోనని యూనిట్ వాళ్ళంతా ప్రాణాలుగ్గబట్టుకొని చూస్తున్నారు

కెమేరామన్‌ని భోంచేయట్నానికి సింహానికి ఒక్క క్షణం చాలు, కానీ కొన్నిక్షణాలు అలాగ గడిచాయి. ఎక్కడో వున్న ఆ సింహం ట్రెయినర్/శిక్షకుడు అప్పుడే అక్కడికి వచ్చాగు. మృగరాజు ఆయన వెంట పిల్లి పిల్లలా వెళ్ళిపోయింది.

అప్పటికలా గండం గట్టెక్కింది కానీ, 'ఆంఖే యూనిట్‌కు మరో సింహపరీక్ష ఎదురయింది. స్టూడియోలో ఒక బ్రహ్మాండమైన అడవివంటి సెట్ వుంది. ఒకచోట షూటింగ్ జరుగుతుండగా సింహం హఠాత్తుగా పది అడుగుల ఎత్తున ప్రహరీగోడ పైనుండి దూకి పారిపోయింది. స్టూడియో బైటనున్న పబ్లిక్ రోడ్ పైనుండి సింహం ఎటువెళ్ళిందో తెలీలేదు సింహం నగరంలో తిరగడం మొదలైతే అనేక సమస్యలు ఎదురవుతాయి. పోలీసులనుండి నిర్మాతకు కష్టాలు తరుముకొస్తాయి. సింహం సొంతదారుకు కూడా భయం పట్టుకుంది.



స్టూడియోలోని వాళ్ళంతా తలలు పట్టుకుని ఆలోచించసాగారు. రెండు గంటలపాటు గాలించగా అదే అడవిలో ఓ మూల నిద్రపోతూ కనిపించింది సింహతార.



ప్రఖ్యాత దర్శక నిర్మాత రామానంద్‌సాగర్ 'లల్‌కార్' సినిమాలో దారాసింగ్‌తో కొండచిలువకు పోరాటం చిత్రించాలని సంకల్పించాడు. ప్రొడక్షన్ మేనేజర్ ఎన్నో కష్టాలుపడి ఓ పాములవాడి దగ్గరున్న పదిహేనడుగుల కొండచిలువను తీసుకొచ్చాడు. దారాసింగ్‌కు ఎలాంటి సందేహాలు కలుగకుండా వుండటానికి రామానంద్‌సాగర్ స్వయంగా ఆ కొండచిలువను తన మెడలో వేసుకొని, అది నిరపాయకరమైనదని నిరూపించాడు.

కొండచిలువ దారాసింగ్ మెడను చుట్టుకుని నొక్కి పడుతుంది. ఆయన దాంతో పోట్లాడి విడిపించుకుంటాడు. ఈ సన్నివేశం కోసం రెండుసార్లు రిహార్సల్స్ చేశారు. పాము అద్భుతంగా నటించింది. ఫైనల్‌టేక్ తీయటానికి సిద్ధమయ్యారు. లైట్లు వెలిగాయి. కెమేరా స్టార్టయింది. దారాసింగ్‌కూ, చిలువకూ మధ్య



పోరాటం ప్రారంభమయింది. టేక్ అత్యంత సహజంగా వస్తోంది. యూనిట్‌వాళ్ళంతా సంతృప్తిగా చూస్తున్నారు. డైరెక్టర్ 'కట్' చెప్పాడు. కెమేరా ఆగిపోయింది. ఐతే కొండచిలువ పోరాటం మాత్రం ఆగిపోలేదు. అది దారాసింగ్ గొంతును నిజంగానే చుట్టుకుని, బలంగా పెనుగులాడుతూంది. యూనిట్ అంతా నివ్వెరపోయింది. పదిహేనడుగుల కొండచిలువకూ, ప్రఖ్యాత మల్లయోధుడు దారాసింగ్‌కు మధ్య పోరాటం. యూనిట్‌లో ఎవ్వరికీ ఏం చేయాలో పాలుపోని సంఘటన. దారాసింగ్ కొండచిలువ మెడనూ, తోకనూ తన ఉక్కుపిడికిళ్ళ మధ్య బిగించాడు. మల్లయుద్ధంలోని ప్రత్యర్థికన్నా భయంకరమైన ప్రత్యర్థిని ఎదుర్కొంటున్న దారాసింగ్ ఆత్మవిశ్వాసం కోల్పోకుండా పోరాడటంతో కాస్సేపటికి అది తన పట్టు సడలించింది. ఆ పోరాటంలో పాల్గొన్నది దారాసింగ్‌వంటి భీమబలుడు కనుక సరిపోయింది. అదే మామూలు హీరో అయివుంటే ఏమయ్యేదో ఊహించడం కష్టమేంకాదు.

జంతువులతో షూటింగ్ జరపడం చాలా

గింది. హేమమాలినిని మోస్తున్న ఒంటె భయంతో వరుగులంకించుకుని భారత్, పాక్ సరిహద్దుకు యిక రెండు కిలోమీటర్ల దూరం వున్నదాకా అదేవనిగా సాగింది. అదృష్టవశాత్తు సరిహద్దు దళాలవారు యిది గమనించి, ధైర్యంగా ఒంటెను అదుపుచేసి డ్రీమ్‌గర్ల్‌ని కాపాడటంతో గండం గట్టెక్కింది.

కుక్కలూ, కోతులతో మాటింగులు ఆసక్తికరంగానే వుంటాయి కానీ, అందుకు మంచి శిక్షణ పొందినవాటిని మాత్రమే ఎంచుకోవాలి.



సినిమాల్లో నటించటానికీ, ట్రిక్కులు చేయటానికీ అలవాటుపడిన కుక్కలు దొరకటం చాలా కష్టమవుతుంది. ట్రెయినింగు పొందినవాటితో కూడా ఎన్నో కష్టాలు ఎదురవుతుంటాయి. 'కరిష్మా' షూటింగులో పాల్గొన్న కుక్క కమలహాసన్ చేతుల్ని కరవటంతో, పాపం ఆ హీరో రెండు వారాలపాటు యాంటీ-రేబీస్ ఇంజక్షన్లు తీసుకుని అవస్థపడాల్సి వచ్చింది. 'ఆఖ్రీదావ్' సినిమాలో అమ్జాద్‌ఖాన్ కుక్కలతో పోట్లాడే ఒక సన్నివేశంవుంది. ఇందులో ఆయన డూప్ నటించాడు. సినిమాల్లో మామూలుగా నటించే కుక్కలు లభ్యం కానందున, దగ్గర్లోవున్న పూనా నుండి కుక్కల్ని తీసుకొచ్చారు. అయిదు కుక్కలతో ఒకేసారి అమ్జాద్‌ఖాన్ డూప్ పోరాటం చిత్రీకరణ ప్రారంభమయ్యింది. కానీ కాస్సేపటికి అవి నిజంగానే కరవటం మొదలెట్టాయి. తప్పనిసరై రెండు కుక్కల్ని చంపేయాల్సి వచ్చింది. మిగతావి పారిపోయాయి. కుక్కగాట్లతో ఆ డూప్, సంవత్సరంపాటు మంచం ఎక్కాల్సి వచ్చింది. 'రామ్ భరోసే' సినిమాలో హీరోయిన్‌ను కుక్క అనుసరించే సన్నివేశం చిత్రిస్తున్నప్పుడు రిహార్సల్‌లో బాగా నటించిన కుక్క తీరా టేక్ తీయాల్సి వచ్చేసరికి నిలబడిన దగ్గర్నించి కదలనని మొరాయించటంతో షూటింగ్ ఆగిపోయే పరిస్థితి ఏర్పడింది. అంతలో దాని ట్రెయినర్‌కి మెరుపులాంటి ఆలోచన వచ్చింది. ఆ కుక్క నడవాల్సిన మార్గమంతా ఎముకల పొడి చల్లించటంతో, వాసన చూసుకుంటూ సాగిపో



యుందా కనకత్తార. అప్పటితోటఅందరూ ఊపిరి పీల్చుకున్నారు.

'కాశ్మీర్ంకే కాశ్మీర్ సినిమాలో హీరోయిన్ జీనాముసీమ్ చల్లని దొంగతనాలు చేస్తుంటుంది. జీనాకు తోడుగా ఒక కోతి నేస్తం వుండి, కిటికీల్లోంచి ఇళ్ళల్లో ప్రవేశించి సహాయం చేస్తుంటుందని చూపించదలుచుకున్నారు. అలాంటి కోతి దొరకటమంటే మాటలు కాదు. బొంబాయిలో కోతి దొరకక పోవటంతో, మద్రాసులోని దేవర్‌ఫిలింసువారి నుండి ఓ కోతిని తెప్పించారు. కోతితోపాటు దాని ట్రైయినర్ పదహేను రోజులపాటు బొంబాయిలోని ఓ స్టార్ హోటల్లో బసచేశారు. వారిద్దరూ కలిసి 25 వేల రూపాయలు ఖర్చు చేశారా షూటింగ్ సమయంలో. అయితే కోతి అద్భుతంగా నటించడమే కాకుండా, జీనా ముసీమ్కు బాగా మాలిష్పైపోయిన ఆ అందాల హీరోయిన్ను ముద్దులు కూడా పెట్టింది చాలాసార్లు. అంతటితో నిర్మాత హాయిగా పీల్చుకున్నారు. అసలు కోతి అన్ని పనులు చేయగలదని కూడా ఆయన అనుకోలేదు.



గుర్రాలూ, ఏనుగులూ క్రమశిక్షణతో వుండి, సినిమావాళ్లకు తలనొప్పులు కలిగించవని పేరు. అయితే అవికూడా ఒక్కోసారి అదుపు తప్పుతుంటాయి. 'రేబాపెర్ హెర్క్యులస్' సినిమాలో విలన్ హీరాలాల్ హీరోయిన్‌ను తీసుకుని పారిపోతుండగా, రణధావే గుర్రంమీద వెంటాడే సన్నివేశం చిత్రిస్తున్నారు. కెమేరాను రోడ్డుకు ఓ మూలగా పెట్టి, టేక్ ప్రారంభించారు. సూచనల ప్రకారం హీరోయిన్‌ను తీసుకుని విలన్ తన రథంలో పారిపోతున్నాడు. రణధావే ఎక్కిన గుర్రం రోడ్డు చివర దాకా వచ్చింది. అక్కణ్ణించి పక్కకు తిరిగే బదులు ఆ గుర్రం కెమేరా మీదకు దూకి వెనుక కాళ్లతో కెమేరానూ, కెమేరామన్‌నూ లాగి తన్నింది. అయితే సాధారణంగా గుర్రాలు విశ్వసనీయంగా వుండి సినిమావాళ్ల మెప్పును పొందుతుంటాయి. కౌబాయ్ సినిమాలూ, పౌరాణికాలూ వంటివాటిలో గుంపులుగా కనిపించే గుర్రాలన్నీ బాగా శిక్షణ పొందినవే. సుమారు వంద గుర్రాలు సినిమాల్లో నటిస్తున్నాయి. వాటిల్లో గొప్ప పేరున్నగుర్రాలు కూడా వున్నాయి- హీరోలతోపాటు నటించటానికి.

ఏనుగులకు కూడా మన సినిమావాళ్లలో మంచి పేరున్నప్పటికీ, వాటి భారీ కాయం దృష్ట్యా చాలా జాగ్రత్తగా వుంటూ, షూటింగ్ జరిగినంత సేపూ టెన్షన్‌తో గడుపుతారు. 'భగావత్' సినిమాలో హీరో ధర్మేంద్ర తలను ఏనుగు కాళ్ళతో తొక్కే సన్నివేశం ఒకటుంది. ఇందుకోసం చాలా ఏనుగుల్ని పరీక్షించారు కానీ ప్రయోజనం కనిపించలేదు. చివరకు మద్రాసు నుండి ఒక ఏనుగును ట్రక్కులో బొంబాయికి తీసుకొచ్చారు. వచ్చీ రాగానే దానికి పూలమాలలతో స్వాగతం పలికారు. తిన్నన్ని చెరుకు గడలు పెట్టారు. దానికి ఎలాంటి లోటూ జరుగకుండా చూసుకున్నారు. ఏనుగు తన పాదంతో ధర్మేంద్ర తలను మృదువుగా తాకితే సరిపోతుంది. షాట్‌లో ధర్మేంద్ర స్వయంగా పాల్గొంటున్నాడు. తలతోపాటు ముఖం కూడా కనిపిస్తుంది కనుక హీరో డూప్‌ని ఉపయోగించుకోవటానికి వీల్లేదు. ముందు జాగ్రత్తగా ఏనుగు మిగతా మూడు కాళ్ళనూ గొలుసులతో బంధించారు. టేక్ మొదలయ్యింది. నిర్మాత, దర్శకుడూ, కెమేరామన్‌లతో పాటు యూనిట్ అంతా ప్రాణాలుగ్గబట్టుకుని చూస్తున్నారు. ఎలాంటి అవాంఛనీయ సంఘటనా జరుగకుండా టేక్ ఓకే అయ్యింది



ఏనుగుల విషయానికి వస్తే, చిన్నప్ప దేవర్ సినిమాల్లో ఏనుగులు ఎన్నో క్లిష్టమైన సన్నివేశాల్లో నటించాయి. 'హాథీమేరీసాథీ' చిత్రంలో ఏనుగుతో రాక్ అండ్ రోల్ డాన్సు కూడా చేయించారు. అయితే మిగతా జంతువులతో ఇదే సినిమాలో ఒక సన్నివేశం వుంది. రాజేష్ ఖన్నా చుట్టూతా ఏనుగులూ, పులులూ, చిరుతలూ, తోడేళ్లలాంటి అనేక జంతువులుంటాయా సన్నివేశంలో. ఎలాంటి తలనొప్పి కలుగకుండా, షూటింగ్ జరిగినంత సేపూ అన్నిటినీ గొలుసులతో బంధించి, ఆ సీన్ పూర్తి చేశారు. ఏ జంతువు ఎన్ని సినిమాల్లో ఎంత చక్కగా నటించినా, వాటితో షూటింగ్ పూర్తయేవరకూ నిర్మాత ప్రాణాలు అరచేతిలో పెట్టుకునే వుంటాడు. బెట్టుచేసే పెద్దనటులు అడిగినంత పారితోషికం యిస్తే దిగి వస్తారు. వంగిన లామ్ చేస్తే పొంగిపోతారు. కానీ జంతువుల దగ్గర వాటి ఇష్టాయిష్టాలు తప్ప మరేమీ పనిచేయవు. అందువల్ల ఒక సినిమాలో ఒక జంతువు అద్భుతంగా నటించిందంటే సన్నివేశంలోని అసంబద్ధత సంగతి వదిలేసి, అలా నటింపచేయటానికి దర్శక నిర్మాతలు ఎంతో శ్రమపడ్డారని అర్థం చేసుకోవాలి. వాళ్ళు అన్ని వ్యయప్రయాసలకోర్చింది చూసే ప్రేక్షకుల ఆనందం కోసమేగదా.





# చతుర కథలు

## జ్ఞానదంతం

**అ**ప్పారావు దొంగ మెడికల్ బిల్లులు పెట్టటంలో ప్రసిద్ధుడు.

అప్పారావు పెద్దమేనమామ ఒక డెంటిస్టు. అతనికి ఒక క్లినిక్ వుంది.

అప్పారావు రెండవ మేనమామ కెమిస్టు. ఆయనకి ఒక మెడికల్ షాపు వుంది.

ఇక అప్పారావుకేమిటి కొదవ?

ఒకనెల తన పన్నుపీకించుకొన్నానని బిల్లు పెడతాడు. రెండవనెల తన భార్య పళ్ళ బాధకి, కొడుకు పిప్పిపన్నుకి బిల్లు. ఒక నెలలో తన పెద్దకూతురి పంటినొప్పికి, తల్లి పళ్ళపీకుకి బిల్లుపెడితే, మరొకనెలలో తనవి, భార్యవి పళ్లు సెట్‌చేయించుకోవడానికి బిల్లు.

ఏ బిల్లుకి ఆ బిల్లే కట్టుడు పళ్ళంత పకడ్బందీగా వుండేది. ఎక్కడా తప్పు పట్టడానికి ఆస్కారంలేదు. దాంతో ఆఫీసువాళ్లు పన్నెత్తి మాట్లాడలేకపోయేవారు; పళ్ళు కొరుకుతూ వుండిపోయేవారు.

ఆడిట్ క్లర్కు రామానందం అప్పారావు మీద ఒక కన్నువేసి వుంచినా, నిస్సహాయంగా వూరుకొనేవాడు.

ఈ దొంగ బిల్లులకోసం పైసాకూడా ఖర్చుపెట్టనక్కరలేకపోవడంతో ప్రతినెలా అప్పారావుకి నూరు, నూటయాభైకి తక్కువ కాకుండా నికర ఆదాయం మిగిలేది.

ప్రభుత్వం సొమ్మేకదా అని అప్పారావు

ఉన్నట్టుండి రామానందానికి బుర్రలో ఒక ఫ్లాష్ వెలిగింది. అంతే... తక్షణం దాన్ని ఆచరణలోపెట్టాడు.

తత్ఫలితంగా అప్పారావు ''దొంగబిల్లుల'' ఛార్జిపై సస్పెండ్ చెయ్యబడ్డాడు.

తన దొంగ బిల్లుల పకడ్బందీతనం మీద నమ్మకంతో అప్పారావు ఎంక్వైరీకి ధీమాగా వెళ్ళాడు.

కాని-

రామానందం చూపించిన రుజువు చూశాక అప్పారావు జ్ఞానదంతం కదిలినట్టయింది.

రామానందం రుజువుల ప్రకారం అప్పటికి అప్పారావు పీకించుకొన్నది ముప్పై అయిదు పళ్ళు!!

నోరు తెరుచుకొని వుండిపోయిన అప్పారావు అసలు పళ్ళు ముప్పై రెండూ తెల్లబోయి తెల్లగా మెరుస్తున్నాయి.

— శివ్రాజు

## చిరుస్టైల్

''ఏవండీ, సిన్మాలో చిరంజీవి ఫైట్లు భలే చేసాడుగదండీ...'' అంది గీత!

''ఏమనుకున్నావ్ మా చిరు అంటే...'' కాలరెగరేసాడు గోపి.

''మీ 'చిరు' ఏంటీ?'' గీత మురిపంగా అంది.

''మా చిరు ఒక్క ఫైట్లేం ఖర్మ... డాన్స్ కూడా ఎంత బాగా చేస్తాడో...'' గోపి అన్నాడు.

''ఒక్క డాన్స్ఏమిటండీ... డైలాగ్స్ ఎంత బాగా చెపుతాడనీ...''

''అవునమ్మా...''

ఆ ఇద్దరూ ఉలిక్కిపడి ఆ ''అవునమ్మా'' అన్నవేపు చూసారు. నీరసంగా బండి లాగుతున్న రిక్షావాలా తమ మాటలకు ముచ్చటపడిపోతూ తనూ ఓ మాట వదిలాడని అర్థమయింది.

''నువ్వు చిరంజీవి ఫేవరెట్వేనా?...'' గోపి అడిగాడు.

''నేనేటండీ... మా పేటోళ్లందరూ చిరంజీవి సైడేనండీ...'' గోపీ మళ్లీ కాలరెగేసాడు.

''ఇందులో మీగొప్పేం ఉంది...'' అంది గీత.

''మరి చిరంజీవికి ఫైట్లన్నీ ఎవరు నేర్పారనుకున్నావ్...'' గీత ఆశ్చర్యంగా భర్తవంక చూసింది.

''యస్... చిరు నేను కాలేజ్మేట్స్మి! అప్పట్లో నేను బాక్సింగ్, కరాటే వగైరాలన్నీ నేర్చుకున్నానులే! తరువాత అదే చిరుకి నేర్పాను...''



గీత నవ్వింది-

"వాళ్లెందు కోతులు"

"కోతులు కాదేమ్. చుప్పనాత్రులు...."

"మిఠాయి మీరూనా... మీకు బాక్సింగ్, కరాటేనా? ఆ రిక్షా ముసలాడు తొక్కి వెళ్లి థియేటర్‌కవతల రోడ్డుమీదపడేలావున్నారు మీకు... కరాటే, బాక్సింగ్ వచ్చా..." మరోసారి అదే నవ్వుతో అంది భార్యామణి.

"ఇదిగో గీతా! నా గురించి నీకేం తెలియదు. నేను అమాయకుడ్లా ఉంటానే కానీ... నా ఫైట్స్ గురించి నీకేం తెలుసు... పోనీ ఈ రిక్షావాడిమీద చూపించమంటావా?..."

"ఇదేంటండీ బాబు... మధ్యలో నేనేం చేశాను..." రిక్షావాడు భయపడుతూ అన్నాడు.

గోపి కాలరెగరేశాడు.

అంతలో రిక్షాకడ్డంగా ఓ నలుగురు దుండగులు కత్తులతో ప్రత్యక్షమయారు. వాళ్ని చూడగానే రిక్షావాడు రిక్షా అక్కడే వదిలేసి పారిపోయాడు. గీతకీ, గోపికీ పై ప్రాణాలు పైనేపోయాయి. ఆ నలుగుర్లో కాస్త భారీగా ఉన్న వ్యక్తి ముందుకు వచ్చాడు.

"మీ దగ్గరున్న డబ్బూ, నగలూ మర్యాదగా తీసి ఇచ్చేయండి. లేదా ఈ కత్తులు మిమ్మల్ని కూరగాయల్లా తరిగేస్తాయి..." అన్నాడు.

"అదేంటండీ మీరు వంటవాళ్లా?..." గోపి ప్రశ్నించాడు.

"వెధవ జోకులు వెయ్యకు... వళ్లు పంచరై పోద్ది..." గర్జించాడతనే మళ్లీ.

గీతకి భర్తపై వళ్లు మండింది... గట్టిగా మోచేత్తో ఒకటి పొడిచింది భర్తను... వాళ్లతో కరాటే వగైరాల్తో ఫైటాడమన్నట్టుగా ఓ చూపు విసిరింది.

గోపి గట్టిగా అరిచాడు...

"అదేంటేవే కొట్టిందే అరుస్తున్నావ్..." మరొకడు ప్రశ్నించాడు.

గోపికి ఏంచెప్పాలో... ఏంచేయాలో బోధపడలేదు.

ఆ నలుగురూ ముందుకి వస్తుంటే... ఇహ లాభంలేదని ఓ చిరుస్మిల్‌ని వదిలాడు గోపి...

దాంతో చిటపటచినుకుల్లా దబదబమని గోపిమీద ఆ దుండగుల దెబ్బలు పడసాగాయి. అయితే హఠాత్తుగా వాటి శబ్దం మారిపోయి... "హా...హీ..." అన్న శబ్దాలు రావటంతో ఆశ్చర్యపోయి తలెత్తి చూశాడు గోపి! ఎదురుగా లేడీ చిరంజీవిలా విజృంభించేస్తున్న తన భార్యని చూసి గతుక్కుమన్నాడు. అదే గీతను 'కరాటే' వచ్చా అని మనసులోనే అనుకొని అలాగే రిక్షాలోనే మూర్ఛపోయాడు గోపి.

— టి.వెంకటేష్

## లోభి

"శారదా... మన ఇంటిగలాయనికి ఇల్లు అర్జంటుగా అవసరం వచ్చిందట. నెలరోజుల్లోగా ఖాళీ చేసెయ్యమని బజార్లో కనిపించి చెప్పాడు" అన్నాడు బాలాజీ నిస్త్రాణగా.

శారదలో ఆందోళన చోటుచేసుకుంది. గంపెడు పిల్లలతో, బండెడు సామానుతో ఎక్కడకని పోవటం? ఎన్నిసార్లని? ఇల్లు మారుతున్నప్పుడల్లా సిగ్గుతో ఆమె శరీరం కుచించుకుపోతుంది. పొరుగిళ్ళవాళ్ళతో పెరిగిన బంధం తెంచుకొని కొత్తవాళ్ళ పరిచయం కోసం ప్రాకులాడటం బాలాజీకి అసలే పడదు.

అద్దె భారీగా చెల్లిస్తున్నా ఇంటి ఓనర్లు పెట్టే అర్థమైన షరతులకి లోబడి ముక్కిన పేనుల్లా పడివుండటం మరింత కష్టంగా వుంది.

"ఛీ ఛీ... ఏంమగాళ్లండీ మీరు? ఇంత వయసు వచ్చింది. సొంతంగా మనకంటూ ఒక గూడు అమర్చుకోలేకపోయాం" చీత్కారంగా అంది శారద. బాలాజీ తలవంచుకొన్నాడు.

"నసీబ్ వుండాల్లే. వెధవది, గుమస్తా ఉద్యోగం వెలగబెడుతూ సొంతఇల్లు కట్టుకునే భాగ్యం కూడానా మనకు?" అనేశాడు.

ఈసారి శారదకు అసహ్యం వేసింది ఆ నిస్సహాయత చూసి.

"చేతకాకపోతే సరి! ఆ ఎదురింటి గురునాధంగారిని ఒకసారి చూడండి. ఆయన్ని చూసి నేర్చుకోవాలి పొదుపు. మీ కొలీగ్ అయివుండీ అయిదు పోర్షన్ల మేడ ఎంత చక్కగా కట్టాడో చూశారూ" ఎత్తిపొడిచింది శారద.



తనని భార్యామణి ఆ పీనాసి గుర్నాథంగా డితో పోల్చడంతో కోపం వచ్చింది బాలాజీకి.

"పోల్చక పోల్చక వాడితోనే పోల్చు. అశుద్ధంమీద అణావుంటే అందుకునే రకం వాడు"

"అవునులెండి! చేతకానివారే చేతనైనవారిని నిందించడం నేర్చుకుంటారు" తిప్పికొట్టింది శారద.

"శారదా... నీకో నమస్కారం! ముందు మరో ఇల్లు వెదికే ఏర్పాటు చూడు" వాదించలేక చేతులెత్తేశాడు బాలాజీ.

"ఆ గురునాథంగారినే అడగాలి, ఒక పోర్షన్ అద్దెకు ఇమ్మనమని" అంది శారద ముఖం ముడుచుకొని.

★ ★ ★

శారద వెళ్ళేసరికి గుర్నాథం భార్యను చూసి ఆశ్చర్యపోయింది. లోలోపలే నవ్వుకుంది కూడా.

"అరే... ఏ దేవుడికి మొక్కుకున్నావు వదినా, నీ తలనీలాలు? మాతో మాటమాత్రమైనా చెప్పకుండా తీర్థయాత్రలకు వెళ్లొచ్చావా?" తను పోర్షన్ అద్దెకి అడగటానికి వచ్చిన సంగతి పక్కనపెట్టి అడిగింది శారద, గుర్నాథంగారి సతీమణి నున్నటి గుండు చూసి.

"మొక్కుకోవడమా? పాడా? మావారు బలవంతంగా చేసినపని ఇది" బోడిగుండు మీద పమిట కప్పుకొంటూ అందావిడ.

"ఏం? ఆయనగాని నీతో చెప్పకుండా మొక్కుకున్నారా?"

"కాదే తల్లీ! నా తలకు కొబ్బరినూనె ఖర్చు ఎక్కువయిందని మూడు నెలలకోసారి మావారు గుండు గీయిస్తారు. నేనేమో విగ్గు పెట్టుకొని ఇన్నాళ్ళూ పరువు కాపాడుకుంటున్నాను"

అంతే! అవాక్కయిన శారద మరెప్పుడూ తన భర్తని గురునాథంతో పోల్చలేదు.

## దురదృష్టం- అదృష్టం

రామయ్యగారికి యాక్సిడెంట్ జరిగిందని తెలిసినప్పుడు ఆ ఊళ్లో విచారించినవారి కంటే సంతోషపడ్డవారి శాతమే ఎక్కువగా ఉండటంలో విశేషమేంలేదు. ఆయనికి న్యూ

టర్ యాక్సిడెంట్ జరిగిందన్న వార్త విన్న వెంటనే దిగ్భ్రమ చెంది బాధపడినవాళ్ళు ముగ్గురే ముగ్గురు. అతని తండ్రి, భార్య, ఏకైక పుత్రిక. సంతోషపడ్డవారుగా ఊరందరినీ లెక్క లోకి తీసుకోవాల్సిందే! రామయ్య యాక్సి డెంట్‌లో 'హరీ'మంటే తమ బానిస బతుక్కి విముక్తి కలుగుతుందని పాలికాపులు ఆశపడ్డా రు...వడ్డీకి ఆయనవద్ద కుదువపెట్టిన భూము లు ఇహనన్నా తమ స్వంతం అవుతాయని చిన్నరైతుల ఆశ! వోనర్ మరణం కారణంగా ఆ ఒక్కరోజయినా శలవు దొరుకుతుందని రామయ్యగారి రైస్‌మిల్లులో పనిచేసే కూలీలు ఎదురు చూడసాగారు.

కాని అందరి ఆశలూ అడియాశల య్యాయి. రామయ్యని ట్రీట్ చేసిన పట్నంలోని అమెరికన్ రిటర్న్‌డ్ డాక్టర్ ఆయన ప్రాణాలకు ప్రమాదం ఏమీలేదని హామీ ఇచ్చాడు. ముందువరస పళ్ళు మాత్రం ప్రమాదంలో ఊడిపోయాయి. చిల్లర గాయాల కోసం హాస్పిటల్‌లో వారం రోజులు ఉండవ లసి వచ్చింది- అంతే!

రామయ్య పూర్తిగా కోలుకునేసరికి ఐదు వేల రూపాయలు మంచినీళ్ళలా ఇట్టే ఖర్చ యిపోయాయి. రామయ్యగారి పళ్లూడిన ఏడుపు మొహాన్ని కళ్ళారా చూసి ఆనందిద్దా మని కొంతమంది ఊరివాళ్లు పలుకరింపుపే రుతో ఆయన ఇంటికి వెళ్ళారు.

రామయ్య మంచంమీదే నీరసంగా పడు కొని ఉన్నాడు. వీళ్ళు రాగానే లేవటానికి ప్రయత్నించాడు.

"ఆం...పడుకోండి. అసలు మీలాంటి తెలి వైనవాళ్ళకు యాక్సిడెంట్ జరిగిందంటే నమ్మ లేకున్నాం" అంటూ వారించారు వాళ్లు.

"అంతా దురదృష్టం. ఆ రోజు రాత్రి రిక్షాలో ఇంటికి వస్తుంటే బుల్లెట్ మీద వస్తున్న వాడెవ డో వచ్చి గుద్దాడు- నేను క్రిందపడడంతో రాస్కెల్ ఖంగారుతో బుల్లెట్ వదిలి ఎటో



ఏమంత బాగా చూడటంలేదుమధ్య. అంతే. ఆరోజు రాత్రే మినిష్టర్‌కి హఠాత్తుగా గుండెపోటు వచ్చింది. మరుక్షణం ఆయన్ని నగరంలోని అత్యున్నతశ్రేణి హాస్పటల్‌లో జాయిన్ చేసేసారు. ఈ విషయం క్షణాలలో పత్రికలకు తెలిసి మర్నాటికల్లా రాష్ట్రమంతా పాకిపోయింది.

ప్రతిపక్షాలు, సన్నిహితులు, జర్నలిస్టులు, తన నియోజకవర్గ మిత్రులు మంత్రివర్గ సహచరులతో ఆ హాస్పటల్ ఆవరణ నిండిపోయిందిగానీ మంత్రిగారిని చూడటానికి మాత్రం ఎవరికీ అనుమతి ఇవ్వలేదు డాక్టర్లు. ఆ డాక్టర్లని ఊపిరి పీల్చుకోన్వీటంలేదు జర్నలిస్టులు. మంత్రిగారి ఆరోగ్య పరిస్థితి విషమించిందని మాత్రం చెప్పాడో డాక్టర్ చాటుగా!

ఇంకేం! తెల్లవారేటప్పటికి రేడియోల్లో విషాదసంగీతం వినిపించటం మొదలుపెట్టారు. పేపర్లో ఈ విషయమే ప్రధాన వార్త. రాష్ట్రమంతటా మంత్రిగారి ఆరోగ్యం గురించి ఎప్పటికప్పుడు వార్తలు అందుతున్నాయి.

అలాంటి సమయంలో ముందుగా వేసుకున్న పథకం ప్రకారం గూఢచారులు ప్రజలమధ్యకి వెళ్ళి వాళ్ళ అభిప్రాయాలను సర్వే చేయసాగారు.

సాయంత్రానికల్లా రిపోర్ట్స్ అందాయి. వారి దగ్గరనుంచి "ఏం డాక్టర్‌గారూ! మన పథకం బాగా పారిందనుకుంటాను" అన్నారు మంత్రిగారు బెడ్‌మీదనుంచి లేస్తూ.

"బ్రహ్మాండంగా సార్. ప్రజలు మీకు నిజంగానే గుండెపోటు వచ్చేసిందని నమ్ముతున్నారు. ఈసరికి చనిపోయి ఉంటారనే అనుకుంటున్నారు. మీది బండగుండె అని పాపం ఆ అమాయకులకు ఎలా తెలుస్తుంది"

"సరే! మన గూఢచారుల సర్వే ఎలా ఉంది?"

"మీకు హార్ట్ ఎటాక్ వచ్చిందన్న మరుక్షణంనుంచీప్రజలువేలసంఖ్యలోపత్రికా కార్యాలయాలకు, ప్రభుత్వ కార్యాలయాలకు ఫోన్లు చేసి కనుక్కుంటున్నట్లు తెలిసింది సార్. అయితే వాళ్ళలో ఎక్కువశాతం వాకబు చేసింది మీ మీద సానుభూతితో కాదుసార్... ఈరోజు ఆఫీసులకు సెలవో కాదో- అలాగే స్కూళ్లకు సెలవ లేద అటువంటి సంద... డాక్టర్‌గారు వివరించారు.

హతాశులయ్యారు మంత్రిగారు.

## స్ట్రీట్‌లైట్

ఎండాకాలం. వీరేంద్రనాథ్ ఆ డాబా ఇంట్లో కొత్తగా దిగాడు. ఉక్కపోస్తుంటే మేడమీదికి వెళ్ళి పడుకున్నాడు- చల్లగాలికోసం.

ఆకాశం నిర్మలంగా ఉంది. పిల్లగాలి ఆగి ఆగి రివ్వున వీస్తోంది. పౌర్ణమినాటి జాబిల్లి నిండుగా ఉంది. వీరేంద్రనాథ్ మనసు ప్రశాంతతతో నిండిపోయింది.

కనుగుడ్లమీద రెప్పలు వాలుతున్నాయి. అనగా అతడి శ్రవణేంద్రియాలకు సన్నగా స్కూల్‌పాఠంలాంటిదేదో వినిపించడం మొదలయింది. వీరేంద్రనాథ్ ఆ ఇంట్లోకి వచ్చి రెండు వారాలు గడిచాయి. ఇన్నిరోజులుగా రాత్రిపూట ఆ చదువు అలా వినిపిస్తూనే ఉంది. వీరేంద్రనాథ్ ఆసక్తిగా చాపమీదనుంచి లేచి డాబాపిట్టగోడపైకి వంగి కిందికి చూశాడు.

సందు చివర్న మున్సిపాలిటీవారి వీధిలైటు ఉంది. ఆ లైటుకింద కూర్చుని పదేళ్ళకుర్రాడు ఏదో పుస్తకం చదువుతున్నాడు. ఆ కుర్రాడిని చూసి వీరేంద్రనాథ్‌కి జాలేసింది.

ఎవరో అనాథబాలుడనుకోబోయి ఆ కుర్రాడి వంటికి ఉన్న ఖరీదైన బట్టలు చూసి నాలుక కరచుకున్నాడు. వాళ్ళింట్లో కరెంట్‌పోవడం వలన, ఇలావచ్చి శ్రద్ధగా వీధిదీపం కింద చదువుకుంటున్నాడన్నమాట. అయితే కరెంటు ఒకరోజు రెండు రోజులు పోతుందీ. ఈ కుర్రాడు రెండు వారాలుగా ఇక్కడే చదువుకుంటున్నాడు!? తను ఈ ఇంట్లోకి రాక ముందునుంచి కూడా ఈ కుర్రాడు ఇలాగే చదువుకుంటూ ఉండాలి.

దీనినిబట్టి చూస్తే ఆ కుర్రాడు నిరుపేద కుటుంబంలో పుట్టి ఉండాలి. అదేగాని నిజమయితే ఆ కుర్రాడి చదువు బాధ్యత తను తీసుకోవాలని నిర్ణయించుకున్నాడు వీరేంద్రనాథ్. శ్రద్ధగా, బుద్ధిగా చదువుకొనే బాలలంటే



వీరేంద్రనాథ్‌కి ఇష్టం. అతడు స్వయంగా అదే కోవకి చెందుతాడు. పాపం! వీధి లైట్లో అలాగే చదువుకుంటుంటే... పక్కనే ఉన్న మురికికాలువ దుర్గంధం, దోమలు ఆ చిన్నారిని అనారోగ్యానికి గురిచేయవచ్చు. ఆ కుర్రాడి దగ్గరికి వెళ్ళాడు వీరేంద్రనాథ్. "బాబూ ఇటు రా..." అని ప్రేమగా పిలిచాడు.

కుర్రాడు పుస్తకం మడిచి వీరేంద్రనాథ్ దగ్గరికి వచ్చాడు.

"ఏం అంకుల్?" అన్నాడు ముద్దుగా.

"మీ ఇల్లు ఎక్కడ?" అని అడిగాడు.

"అదిగో- ఆ కనిపించేదే" అంటూ చూపుడువేలు చూపించాడా కుర్రాడు - ఓ మూడంతస్థుల భవనానికేసి.

గతుక్కుమన్నాడు వీరేంద్రనాథ్ ఆ భవనాన్ని చూసి.

"నిజంగానా?" నమ్మలేనట్లు అడిగాడు.

"నిజంగానే! రాంబాబుగారు మాడాడీయే" చెప్పాడా కుర్రాడు.

"అలాగా! మీకు అంత పెద్ద ఇల్లు ఉంది గదా! మరి నువ్వెందుకు అనాథలాగ ఇక్కడ చదువుకుంటున్నావ్" ఆశ్చర్యపోయాడు వీరేంద్రనాథ్.

"ఓ(... అదా!? అబ్రహం లింకన్, న్యూటన్... వీళ్ళంతా వీధిదీపాల కిందేగా చదువుకున్నది! వాళ్ళలా పెద్ద చదువు చదవాలని..." అన్నాడు కుర్రాడు.

వీరేంద్రనాథ్ మొహం '!' మార్కు పెట్టేసింది.

— కె. అప్పారావు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

# ఆ కళ్లలో తళుకు కలకాలం ఉండాలి

# మార్గదర్శి

ఆ పాప అపార సంతోషం సంతృప్తి గురించే ఇప్పుడూ ఎప్పుడూ మీ ఆరాటం! ఆమె కన్నుల్లో ఆ సంతోషపు వెలుగులు కలకాలం వర్ధిల్లడానికి ఈ రోజే మార్గదర్శిలో చేరండి.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి, అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |

బ్రాంచీలు :

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడికాపూల్, హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్, లక్ష్మీపేట్, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జె.పియన్‌రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- నెహ్రూ రోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావ్‌పేట ఏలూరు.

డబ్బుకోసమేనా మీ చింత! మార్గదర్శి ఉన్నది మీ చెంత!!



మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్

రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు :
ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

Kiron-MCF-86

